# జైలుగోడల మధ్య....

(నిందితుల నిజజీవిత చిత్రణ — ప్యాపిలి వీక్లీ నుండి)






పరిశోధన:

## వేదగిరి రాంబాబు








శ్రీమహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్
మల్యాజీరియంరోడ్ * ఏలూరురోడ్ కార్నర్
గవర్నరుపేట ... విజయవాడ-2.

JAILU GODALA MADHYA

By Vedagiri Rambabu

*Publishers :*

Sri Mahalakshmi Book Enterprises
Museum Road – Vijayawada-2.



*First Edition :*

AUGUST - 1987

*Cover Design :*

B A L I

*Photos*

M. Sudhakar

**Price : Rs. 20/-**

*Printed at :*

**Sri Annapurna Printers**
Vijayawada–2

# అంకితం

నిరాడంబరులు-

స్నేహశీలి-

'స్వాతి' గ్రూపు సంస్థల సంపాదకులు-

శ్రీ వేమూరి బలరామ్ గారికి.

-వేదగిరి రాంబాబు

# 1987 ఆగస్టు విడుదల!

1. ఆఖరిక్షణం 'మీరా' లక్ష్మి 20-00
2. మరణయాత్ర ప్రతాప రవిశంకర్ 20-00
3. నవ్వితే నవ్రత్నాలు-2 మల్లిక్ 18-00
4. పరిశోధన సామవేదుల గీతారాణి 20-00
5. వెన్నెల కురిసింది దేవరాజు రవి 25-00
6. జైలుగోడలమధ్య వేదగిరి రాంబాబు 20-00
7. విద్యార్థుల భవిష్యత్‌ను తీర్చిదిద్దే
**1001** కోర్సులు- V. S. హరినారాయణ్ 25-00

తప్పక చదవండి!

# ముందుగా మూడుముక్కలు

నేరాలను అరికట్టి నేరస్థుల్ని సంస్కరించడానికి కేంద్ర ప్రభుత్వము చేపట్టిన ప్రత్యేక పథకము 'జాతీయ భద్రతా'పథకం. నేరస్థుల్ని సంస్కరించడంవల్ల నేరాలు తగ్గుతాయి. నేరాలు తగ్గడం సంఘ శ్రేయస్సుకి అవశ్యకం

వ్యక్తి స్వాతంత్రం వుండాలి. అది ఎంత వరకు అంటే- సంఘశ్రేయస్సు దెబ్బ తిననంత వరకు. సంఘశ్రేయస్సు దెబ్బ తింటుందంటే ఆ వ్యక్తికి స్వాతంత్రానికి కొన్ని ఆంక్షలు విధించాలి. అలా ఆంక్షలు విధింపబడి నేరస్థుల్ని వుంచు స్థలాలే కారాగారాలు. ఈ కారాగారాలు కేవలం నేరస్థుల నివాస కేంద్రాలుకావు, వాళ్ళ సంస్కరణకి నిలయాలు. అలా కారాగారాలని రూపొందించడమే జాతీయ భద్రతా పథకంలో ఒక భాగం.

ఏ మనిషీ పుట్టడమే దుర్మార్గుడుగా పుట్టడు. సాంఘిక ఆర్థిక, మానసిక కారణాలవల్ల కొందరు నేరస్థులుగా మారుతారు. అంటే వాళ్ళు నేరస్థులుగా మారడానికి సంఘం కారణం. కాబట్టి వాళ్ళని సంస్కరించాల్సిన బాధ్యత సంఘంమీదేవుంది. అన్న వుద్దేశ్యంతోనే ఇంత ఖర్చుతో ప్రభుత్వం జైళ్ళని నిర్వహిస్తోంది.

గాంధీగారు చెప్పినట్లు నేరస్థులు రోగులు. జైళ్ళు వాళ్ళని బాగుపరచే హాస్పిటళ్ళు! నేర మన స్తత్వము మార్చగల జబ్బే! కాకపోతే అందుకు ప్రత్యేక పద్ధతుల్ని మనుషుల్నిబట్టి అమలు పరచాలి. ప్రతీ మనిషికి గతంవున్నట్లే ప్రతీ నేరస్థుడికి భవిష్యత్తు వుండాలి. అందుకు కేవలం ప్రభుత్వ పథకాలే సరిపోవు. మనందరి సహకారమూ వుండాలి. నేరస్థుడిలో వస్తున్న మానసికమార్పుని గుర్తించాలి. అతనూ తిరిగి మామూలు మనిషిలా ఈ సంఘంలో సంచరించడానికి అనువైన పరిస్థితుల్ని మనందరం కల్పించాలి. అనువైన పరిస్థితుల్ని కల్పించకపోయినా రెచ్చిపోయే పరిస్థితుల్ని కల్పించకూడదు. సాంఘిక దురాచారాల్ని ప్రోత్సహించకూడదు.

జాతీయ భద్రతాకార్యక్రమంలో జైళ్ళని నేరస్థుల సంస్కరణ కేంద్రాలుగా మార్చడంతోపాటు ఆవారాగా తిరిగే పిల్లల్ని, సరయిన మార్గదర్శకత్వం పెద్దల నుంచి లభించక చెడిపోయే పిల్లల్ని సంస్కరించడం కోసం ప్రభుత్వం రిమాండ్ హోమ్స్, సర్టిఫైడ్ స్కూల్స్ నడుపుతోంది. మొదటిసారి తెలిసోతెలియకో నేరాలు చేసినవాళ్ళు తిరిగి తమను తాము సంస్కరించుకోడానికి వుపకరించే ప్రొబేషన్ విభాగం కూడా జైళ్ళశాఖ ఆధ్వర్యంలో ప్రారంభించబడింది. కొందరు ఆడవాళ్ళు బలవంతాన, మరి కొందరు పరిస్థితుల ప్రాబల్యాన వ్యభిచారవూబిలోకి దిగితే వాళ్ళని సంస్కరించి, సన్మార్గంలోకి మళ్ళించడానికి ప్రత్యేక పునరావాస కల్పనా కేంద్రాలని ప్రభుత్వం నడుపుతోంది. మత్తుపదార్థాల మాయలోపడి గాడి తప్పుతున్న యువతరాన్ని ఆదుకోవడానికి, ఆడుక్కు తినడాన్ని అరికట్టి అడుక్కునే వారికి పని, కూడు,

గుడ్డ, గూడు అమర్చడానికి ప్రభుత్వం కృషిచేస్తోంది. ఇవన్నీ జాతీయ భద్రతకి చేపట్టిన కార్యక్రమాలే.

నేరస్థుల సంస్కరణకోసం కారాగారాలలో ఎటువంటి సంస్కరణలని చేపడుతున్నారో వివరించడంతోపాటు కొందరు నేరస్థులకథల్ని,వాళ్ళతో ఇంటర్వ్యూలను కూడా ఈ పుస్తకంలో ఇస్తున్నాను. వాళ్ళు ఆనేరాల్ని చేయడానికి ఎటువంటి పరిస్థితులు పురిగొల్పాయో, వాళ్ళు ఆ నేరాల్ని ఎలా చేసారో, ఆ తర్వాతి పరిణామాలేమిటో అందరికీ వివరించడం కోసమే ఈ ఇంటర్వ్యూలు చేసాను. అలాగే నేరస్థుల్ని కించపరచడం, బాధించడం కూడా నా వుద్దేశంకాదు. కాబట్టి వాళ్ళపేర్లు మొదలయిన వివరాల్ని ఇవ్వడంలేదు. ఈ నేరస్థుల సంస్కరణకి జైళ్ళ విభాగానికి తోడ్పడడానికి గాని, నేరస్థుల కుటుంబాలన్నీ ఆదుకోవడానికి గాని స్వచ్ఛంద సేవా సంస్థల వాళ్ళెవరైనా ముందుకొస్తే వాళ్ళకి నా హృదయపూర్వక అభినందనలు.

'నేరాన్ని అసహ్యించుకో, కాని నేరస్థుల్ని కాదు' అన్న గాంధీగారి మాటల్ని మనందరం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి.

ఈ సమాచారాన్నంతటినీ సేకరించడానికి అనుమతించిన జైళ్ళశాఖ డైరెక్టర్ జనరల్ షఫియుల్లాఖాన్‌గారికి నాకృతజ్ఞతలు. మూడు నెలలపాటు జరిగిన ఈ నా పరిశోధనా కార్యక్రమంలో ఎంతో మంది జైలు అధికారులు నాకు సహకరించారు. వాళ్ళందరికీ నా కృతజ్ఞతలు.

భవిష్యత్తుమీద ఆశతో గతాన్ని పీడకలగా నెమరువేసుకుంటూ తమ చెడు అనుభవాల్ని వివరించి నేను నా కార్య

క్రమాన్ని జయప్రదంగా ముగించడానికి సహకరించిన ఖైదీ సోదరులందరికీ కూడా ధన్యవాదాలు చెప్పుకోవలసిన విధి నామీద వుంది.

అసలు ఈ ప్రణాళికను నేను చేపట్టడానికి కారకులు శ్రీ వేమూరి బలరామ్. తన సంపూర్ణ సహకారాన్ని నాకు అందించి, సంవత్సరంపాటు స్వాతి సపరివారపత్రికలో వీటిని ప్రచురించిన ఆయనకు నేనెంతో రుణపడి వున్నాను. అందుకే ఈ పుస్తకాన్ని ఆయనకు అంకితమిస్తున్నాను.

నాతో పాటు రోజులకి రోజులు జైళ్ళచుట్టూతిరిగి ఫోటోలు తీసి నా ఆర్టికల్స్‌కి నిండుతనాన్ని తెచ్చిపెట్టిన మిత్రుడు మిట్టమీద సుధాకర్‌కి, సి. జగన్‌మోహనరావుకి, ఈ జైల్ ఆర్టికల్స్ పుస్తక రూపంలో రావడానికి కారకులైన మిత్రులు, ప్రముఖ రచయిత మల్లాదిగారికి, శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రయిజెస్‌వారికి నా కృతజ్ఞతలు.

—వేదగిరి రాంబాబు
15-8-87

# ఓపెన్ ఎయిర్‌జైల్



సరదాగా కారమ్‌బోర్డ్ ఆడుకునే వాళ్ళు కొందరయితే, పేపర్ చదువుకునే వాళ్ళు మరికొందరు, టి. వి. చూడాలనుకునేవాళ్ళు ఇంకొందరు....

వీళ్ళందరూ ఖైదీలు....ఇది ఒక జైలులోని వాతావరణం....

ఆశ్చర్యపోతున్నారా?

ఈ జైలులో ఖైదీలు రాత్రిమాత్రమే బంధింపబడతారు. పగల్లా వాళ్ళు మనకులాగానే పనిపాటల్లో మునిగిపోతారు. కాకపోతే వాళ్ళు ఆ రెండు వందల నలభై యకరాల విస్తీర్ణం దాటి బయటికి పోకూడదు.

ఈ లిమిట్ ఏమిటి అంటారా?

హైద్రాబాద్‌లోని ఓపెన్ ఎయిర్ జైల్ విస్తీర్ణం అది!

ఇంత ఎక్కువ విస్తీర్ణంలో పరచుకుని వున్న జైలు అంటే

ఎంతో పెద్దది అని చాలా మంది వుంటారని మీరు అనుకున్నారు అంటే పొరబడ్డారన్నమాటే!

ఇప్పుడా జైలులో వుంటున్న ఖైదీలు కేవలం ముప్పయ్ అయిదు మందే! వాళ్ళకోసం ప్రత్యేకంగా రెండు బ్లాకులను నిర్మించారు. రాత్రి సమయాల్లో మాత్రమే ఖైదీలను ఆ బ్లాకులలో వుంచి తాళం వేస్తారు. పగలల్లా వాళ్ళు స్వేచ్ఛా జీవులు!

1977లో జైలు ఆవరణలో డయిరీ ప్రారంభించారు. అప్పటినుండి ఇప్పటి వరకు ఎన్నో ఆవులతో, దూడలతో డయిరీ కళకళలాడిపోతోంది. ఇప్పుడు రోజుకి 200 లీటర్లపాలు ఈ డయిరీ వల్ల లభిస్తున్నాయి. ఈ జైలులోని ఖైదీలకే కాక ప్రతిరోజు జంటనగరాలలోని మిగతా జైళ్ళ ఖైదీలకు కూడా వీటిని వినియోగిస్తున్నారు. ఓపెన్ ఎయిర్ జైలులో వున్న పన్నెండు మంది ఖైదీలు ఈ డయిరీ నిర్వహణ బాధ్యతల్ని తమ భుజస్కంధాలమీద మోస్తున్నారు.

పౌల్ట్రీలో 1500 కోళ్ళున్నాయి. వీటి నిర్వహణని ఇద్దరు ఖైదీలు చూస్తున్నారు. ప్రతి ఆదివారం ప్రెసెడ్ చికెన్ ఇక్కడి నుండే జంట నగరాలలోని మిగతా జైళ్ళకి కూడా పంపిస్తున్నారు.

కోళ్ళకిగాని ఆవులకి గాని ఏమైనా జబ్బులు వస్తే చూడడానికి ప్రత్యేకంగా ఓ పశువుల డాక్టరు, కాంపౌండర్ వున్నారు. వాళ్ళు ప్రతి రోజూవచ్చి ఆవులని, కోళ్ళని చూసి ఏదైనా చికిత్స అవసరమైతే చేస్తుంటారు.

పశువుల పేడనికూడా ఇక్కడి ఖైదీలు వ్యర్థం చెయ్యరు. ఈ పేడ యంతో ఓ గోబర్ గ్యాస్ ప్లాంట్ ని నిర్వహిస్తున్నారు. ఈ గాస్‌తోనే వ్రాత్రివంట! వంటకూడా వీళ్ళే చేసుకుంటారు.

ఇలా ప్రొద్దున లేచింది మొదలు సాయంత్రం తిరిగి తిరిగి తమ స్థావరంలోకి వెళ్ళిపోయేవరకూ ఖైదీలందరూ ఎంతో బిజీగా వుంటారు.



విడుదలయిన తర్వాత వాళ్ళ జీవనోపాధికి వుపకరించే ఎన్నో విద్యలని నేర్చుకుని ఆరితేరుతున్నారు. ఒక విధంగా చెప్పాలంటే ఇది జైలు కాదు శిక్షణా కేంద్రం! మన రాష్ట్రంలో ఇక్కడ, అనంతపూర్‌లోనే ఇటువంటి జైళ్ళున్నాయి.

కేవలం యంత్రాలలా పనిచేసుకుపోవడానికేకాదు ఖైదీలమానసికోల్లాసాన్ని పొందడానికి ఇక్కడ ఎన్నో సౌకర్యాలు కల్పిస్తున్నారు.

సాయంత్రం వాలీబాలు మొదలయిన ఆటలతో ఖైదీలు కొంత కాలాన్ని వెచ్చిస్తారు. అలాగే ప్రతీరోజూ వార్తా పత్రికలు చదువుకుని ప్రపంచజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి అవకాశముంది. వినోదించ డానికి ఖైదీల బ్లాకులో టీవీకూడా వుంది.

మతాలతో సంబంధంలేకుండా అందరూ కలిసిమెలిసి ఒక కుటుంబ సభ్యులలా ఖైదీలందరూ పనిచేసుకుపోవడం ఈ జైలు ప్రత్యేకత।

హైదరాబాద్ పొలిమేరల దగ్గరవున్న చెర్లపల్లి గ్రామంలోవున్న ఈ ఓపెన్ ఎయిర్ జైల్ మనదేశంలోని అతి ప్రాచీన ఓపెన్ ఎయిర్ జైల్‌లో ఒకటి. 1954లో ప్రారంభమైన ఈ జైలులో నూటయాభై మంది

ఖైదీల దాకా వుండవచ్చు. కానీ ఇప్పుడు కేవలం ముప్పయ్ అయిదు మంది మాత్రమేవున్నారు. అంత తక్కువమంది ఖైదీలతో అతి చాకచక్యంగా డయిరీ,పౌల్ట్రి, గోబర్ గాస్ప్లాంటు కూరగాయలని పండించడం మొదలయిన పనులన్నింటినీ నిర్వహిస్తున్న జైలు నిర్వహణా సిబ్బంది చాకచక్యాన్ని కొనియాడక తప్పదు.

"అందుకు ఖైదీలనే అభినందించాలి. ఎందుకనంటే వాళ్ళలో ఎవరికయినా సరే "ఇది నీ పని" అని అప్పజెబితే చాలు మళ్ళీ గుర్తుచెయ



నక్కరలేదు. ఇళ్ళలో చేసుకునే పనులకన్నా కూడా బాధ్యతతో పనులు చేసుకుపోతుంటారు.... వీళ్ళని ఖైదీలుగా మేము చూడడంలేదు. మాలో మనుషులుగానే మేము చూసుకుంటున్నాము. వాళ్ళు అంత డిసిప్లిన్‌తోను వుంటున్నారు" అన్నారు ఓపెన్ ఎయిర్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ టి.వి. రామనరసయ్య.

పెదవుల మీద చెరగని చిరునవ్వుతో ఆఫీసర్నన్న అహంభావం లేకుండా ఓపిగ్గా ఆయన తన విధిని నిర్వహిస్తున్న తీరు చూడముచ్చ

చేసింది. అక్కడ స్టాఫు, ఖైదీలు అందరూ చక్కటి అవగాహనతో మసలుకుంటున్నారు.

ఇక్కడచేరే ఖైదీలకి కూడా కొన్ని అర్హతలుండాలి. సరాసరి శిక్ష వేయగానే ఆ ఖైదీలను ఇక్కడికి తీసుకురారు. జీవితాంతశిక్ష లేక, ఎక్కువకాలం శిక్షపడిన ఖైదీల నడవడికను సెంట్రల్ జైల్సులో పరీక్షిస్తారు.

నడవడిక బాగుండి కనీసం అయిదు సంవత్సరాల శిక్ష అనుభవించిన వాళ్ళే ఈ ఓపెన్ ఎయిర్ ఖైల్‌లోకి రావడానికి కనీసార్హతని సంపాదించగలుగుతారు. ఆంధ్రప్రదేశ్‌కి చెందినవారే అయివుండాలి. రాజకీయ ఖైదీలుకాకూడదు. అలాగే ఎక్కువ కేసులలో ఇరుక్కుని ఉండకూడదు. మంచి మానసిక ఆరోగ్యంతోపాటు శారీరక ఆరోగ్యాన్ని కలిగివుండాలి. వయసు 21—55 సం॥ మధ్య వుండాలి. కుటుంబంతో సత్సంబంధాలు కలిగివుండాలి. వీటన్నిటికన్నా ముఖ్యంగా ఓపెన్ ఎయిర్ జైల్‌లో కష్టించి పనిచేయడానికి సుముఖంగా వుండాలి:

ఈ విషయాలన్నింటిని సెలక్షన్ బోర్డు వాళ్ళు పరిశీలించి సెలక్టు చేసిన ఖైదీలనే ఈ జైలులోకి తీసుకుంటారు.

వీళ్ళకి ప్రతినెల 25 వంటి సబ్బు, గుడ్డల సబ్బు, సోడా, పళ్ళపొడి, కొబ్బరి నూనె ఇస్తారు. అంతే కాకుండా ఆరు నెలలకి ఓసారి బనీను నిక్కరు ఇస్తారు. సంవత్సరానికి ఒక చెప్పుల జతనుకూడా ఇస్తారు మంచాలు, తలగడలుకూడా ఇస్తారు.

ఈ వాతావరణం నిజంగా మారదల్చుకున్న ఖైదీకి చక్కటి వాతావరణం. ఇక్కడవుంటున్న వాళ్ళకి ఒక జైలులో వుంటున్నట్లు వుండద అనడం అతిశయోక్తి కాదు.

కాకపోతే ఇక్కడ కష్టించి పనిచేస్తున్న ఖైదీలకు వేతనాలు ఇవ్వడంలేదు.

"ఇది అన్యాయం కదా?" అన్న ప్రశ్నకు సమాధానంగా "వీళ్ళ కష్టానికి ప్రతిఫలం ఇవ్వడానికి మా డిపార్ట్‌మెంట్ వారూ నిశ్చయించు కున్నారు. త్వరలోనే ఇవ్వడం మొదలు పెడతాం" అన్నారు సూపరిం టెంట్‌గారు.

ఖైదీలకు మామూలు వాతావరణాన్ని కలిపించి పనిపాటలని నేర్ప డానికి ఈ ఓపెన్ ఎయిర్ జైల్స్ ఎంతో సహకరిస్తాయి. రాజస్థాన్‌లోని ఓ ఓపెన్ ఎయిర్ జైల్‌లో ఖైదీలు కుటుంబాలతో కలిసి వుండే సదు పాయం వుంది.

# సెంట్రల్ జైల్

ఇందులోని ఫోటోలను చూస్తుంటే ఇదేదో చిన్నపాటి ఇండ స్ట్రియల్ ఎస్టేట్‌లా వుంది కదూ!

ఈ చిన్న చిన్న పరిశ్రమలన్నీ హైద్రాబాద్ చంచల్‌గూడాలో వున్న సెంట్రల్ జైలులోనివి. ఓపెన్ ఎయిర్ జైల్‌లో గ్రామీణ వాతా వరణమంటే సెంట్రల్ జైల్‌లో పట్టణ వాతావరణం మనకి కనిపిస్తుంది.

ఓపెన్ ఎయిర్ జైల్‌లో వుండడానికి వ్యవసాయంలో అనుభవ మున్న వాళ్ళకి ప్రాధాన్యత ఇస్తారు. వ్యవసాయంతో పాటు డైరీ, పౌల్ట్రీ మొదలయిన వాటి నిర్వహణలో ఓపెన్ ఎయిర్ జైల్ ఖైదీలు బిజీగా వుంటారు.

హైద్రాబాద్ సెంట్రల్ జైల్‌లో ఖైదీలతో కార్పెంటరీ, బూట్లు,

చెప్పులు కుట్టడం, రేకు సామాన్లు చేయించడం, ప్రింటింగు - బైండింగు, కుట్టుపని, తివాచీనేత, సబ్బుల్ని తయారు చేయడం మొదలయిన పనులు చేయిస్తుంటారు. ఏ ఖైదీలు వూరికే వుండడానికి వీల్లేదు. ఏదో ఒక పని చెయ్యాలి. ఆ పనికి కొద్దిపాటి జీతాలూ ఇస్తారు.

పొద్దున టీకాగానే ఆరుగంటలకల్లా అందరు ఖైదీలూ ఎవరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళిపోవాలి. మళ్ళీ పదకొండు గంటలకు బ్రేకు -



భోజనం. తిరిగి పన్నెండున్నరకి టీ తర్వాత మళ్ళీ పనిలోకి వెళ్తారు. సాయంత్రం నాలుగు గంటలకి భోజనంచేసి ఆరుగంటలదాకా ఆడుకుంటే ఆడుకోవచ్చు.... ఆ తర్వాత బారెక్స్‌లో వుంచి తాళాలు వేసేస్తారు. (బారెక్స్ అంటే మధ్యలో అడ్డుగోడలు లేకుండా ఆ చివరనుండి ఈ చివరకి ఒకటే హాలు) మళ్ళీ బయటికొచ్చేది ఉదయమే. ప్రతీ బారెక్స్ లోనూ లోపలే బాత్‌రూమ్స్ వుంటాయి. ఇరవై నాల్గు గంటలు సెంట్రీలు వీళ్ళ కదలికలను గమనిస్తూనే ఉంటారు.

రెండు సంవత్సరాలకి పైన శిక్షపడిన వాళ్ళే సెంట్రల్ జైల్లో వుంటారు. హైద్రాబాద్ సెంట్రల్ జైల్లోవున్న వాళ్ళలో అధికశాతం యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్న వాళ్ళే. మర్డర్ చేసిన వాళ్ళకి యావజ్జీవ

శిక్ష విధిస్తుంటారు. ఇందరి ఖైదీలని సంస్కరించడమంటే కాస్త ఓర్పుతో కూడుకున్న పనే!

అనారోగ్య పీడితులైన నేరస్థులకోసం లోపల ఒక ప్రత్యేకమైన హాస్పిటల్ వుంది. ఇరవై నాలుగ్గంటలూ డాక్టర్ వుంటాడు. ఒకవేళ డాక్టర్ ప్రత్యేక వైద్యానికి నేరస్థుణ్ణి పంపాలంటే పోలీస్ బందోబస్తుతో బయటనున్న హాస్పిటల్‌కి తీసుకొస్తారు.

జైలులోపలికి అడుగుపెట్టగానే ఎడమచేతి పక్కన కొన్ని సెపరేట్ సెల్స్ కనిపిస్తాయి. ఈ సెల్స్‌లో మతి స్థిమితం తప్పిన ఖైదీలను వుంచుతారు. వీళ్ళు కటకటాల తలుపుల గుండా అటుగా పోయేవాళ్ళని చూడగల్గుతారు. కానీ కుడి పక్కన సెల్స్‌కి బయట చెక్క తలుపువుంది. అంటే వాళ్ళు బయట తిరిగేవారిని చూడలేరు. ఆ చెక్క తలుపులు తీసిన తర్వాత లోపల మరో కటకటాల గది వుంటుంది. ఆ గదిలో ఖైదీ వుంటాడు. అంటే రెండు గదులలో లోపల గదిలో నేరస్థుడుంటాడన్న మాట! అతను ఎవర్నీ చూడలేడు. మిగతా ఖైదీలలా అతను ఆ నాల్గు గోడల మధ్య కూడా స్వతంత్రంగా తిరగలేడు. భోజనం, టీ కూడా అతనికి అక్కడికే తెచ్చిస్తారు.

జైలు అధికారులకు ఎదురు తిరిగినా లేక తమకన్నా బలహీనమైన ఖైదీలను బాధిస్తున్నా, వాళ్ళని తీసుకొచ్చి ఈ సెల్స్‌లో బంధిస్తారు. ఈ సెల్స్‌లో బంధించడమంటే పనిష్మెంట్ అన్నమాట!

ఖైదీలకి, వంట టీ కాచటం మొదలయిన పనులు చేసేదికూడా ఖైదీలే! అంతేకాదు హాస్పిటల్ స్టాఫ్‌కి కూడా కొందరు ఖైదీలు సహకరిస్తుంటారు. ఇలా తమ పనులన్నీ తామే చేసుకొంటూ వుంటారు.

సాయంత్రం పూట వాలీబాల్ మొదలయిన ఆటలు ఆడుకోవడానికి లోపల సదుపాయాలు వున్నాయి. కొందరు ఇన్‌డోర్ గేమ్స్ ఆడుకుంటారు. వయోజన విద్యా కేంద్రంకూడా లోపల వుంది. విద్యని అభ్యసిం

కొలనుకున్న వాళ్ళకి విద్య నేర్పడానికి ఓ టీచర్ వున్నాడు. ఓపెన్ యూనివర్సిటీ ఆక్జిలరీ స్టడీ సెంటర్ కూడా ఖైదీలకు వుంది ఎందరో ఖైదీలు ఓపెన్ యూనివర్సిటీద్వారా జైల్లోవుండే డిగ్రీకి కడుతున్నారు.

కొన్ని ప్రభుత్వ సంస్థల యూనిఫారాలు బూట్లు మొదలయినవి ఇక్కడి ఖైదీలే కుడతారు. అంతే కాదు ఎన్నో ప్రభుత్వ సంస్థలకి ఈ ఖైదీలు చేసిన ఫర్నిచర్ మొదలగు వాటిని అమ్ముతారు. సికింద్రాబాద్ ఎగ్జిబిషన్‌లో కూడా హైద్రాబాద్ జైలు ఖైదీల వస్తువుల స్టాల్ వుంటుంది.

ఈ విధంగా నేరస్థుణ్ణి సంస్కరించడానికి, వీలయితే పర్సనాలిటీని పెంచుకోవడానికి సెంట్రల్ జైల్‌లో అవకాశాలున్నాయి.

ప్రతి సంవత్సరం పెరోల్ మీద పద్నాలుగు రోజుల పాటు ఖైదీలను ఇంటికి పంపిస్తారు. అలాగే జైల్లో వాళ్ళ నడవడి బాగుంటే శిక్ష తగ్గుతుంది. అంటే ప్రవర్తన బాగుంటే యావజ్జీవశిక్ష విధించబడిన ఖైదీ పద్నాలుగు సంవత్సరాల శిక్షనీ కూడా అనుభవించ నక్కర్లేదు. ఈ శిక్షాకాలంతో అతని జీవితం చెడిపోకుండా వుండడానికని ఉత్సాహమున్న వాళ్ళకి జైల్లో చదువుకునే ఏర్పాట్లు చేస్తారు. వృత్తి విద్యలలో శిక్షణ ఇస్తున్నారు.

భద్రతా చట్టం క్రింద, కల్తీ స్మగ్లింగ్ మొదలయిన నేరాలతో అరెస్టయిన ఖైదీల కోసం హైద్రాబాద్ సెంట్రల్ జైల్‌లో ప్రత్యేక బారెక్స్ వున్నాయి. వాళ్ళు మిగతా ఖైదీలలా యూనిఫారమ్ వేసుకో నక్కర్లేదు.

ఖైదీలకోసం వండిన వంటకాలన్నింటినీ ముందు సూపరింటెం డెంట్ చూస్తారు. అలాగే ప్రతీ సోమవారం సూపరింటెండెంట్ జైలంతా తిరిగి అందరి సమస్యలనీ తెలుసుకుంటారు.

"జైల్‌లోకొచ్చిన నేరస్థుల మనస్తత్వంలో మార్పు తీసుకు రావడానికి మేము ఎంతో కృషిచేస్తాము. అలాగే పూర్తి ఆహారము

అందేట్లా చూస్తాము. కాకపోతే అందరూ ఏదో ఒకపని చేసి తీరాలి. ప్రతీ ఖైదీకి ప్రతీ నెల ఒక గుడ్డలుతుక్కునే సబ్బు, వంటి సబ్బు, బట్టలుతికే సోడా, పళ్ళపొడి, కొబ్బరినూనె మొదలయినవి వుచితంగా ఇస్తాం. అలాగే వాళ్ళు చేసేపనికి జీతాలు ఇస్తాం. వీటన్నిటికన్నా ముఖ్యంగా ఈ ఖైదీమీదే కుటుంబ సభ్యులు ఆధారపడి వున్నారని తెలిస్తే ఆ కుటుంబ సభ్యులకు నెలనెలా వందరూపాయల చొప్పున పంపిస్తున్నాము. డిపెన్స్యూస్ కయితే రోజుకి పన్నెండు రూపాయలు పాకెట్ మనీగా ఇస్తున్నాము. మిగతా ఖైదీలకు వుచితంగా ఇచ్చేవన్నీ వాళ్ళకీ వుచితంగా ఇస్తున్నాం.



ఓపెన్ యూనివర్సిటి డిగ్రీ ఎంట్రన్స్ రాస్తున్న
సెంట్రల్ జైలు ఖైదీలు

---

సంవత్సరానికి ఆరవై రూపాయలు గుడ్డలు కుట్టించుకోడానికి ఇస్తున్నాం. ఇక్కడ 712 మంది ఖైదీలను వుంచడానికి వసతి వుంది. ఇప్పుడు 689 మంది వున్నారు. వాళ్ళలో ఎక్కువమంది యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్న వాళ్ళు అలాగే ఆడవాళ్ళకోసం ప్రత్యేకంగా వున్న

జైలులో 60 మందిని దాకా వుండవచ్చు. ఇప్పుడు 14 మంది మాత్రమే వున్నారు. వాళ్ళకి వృత్తి విద్యలు నేర్పడానికి ప్రత్యేకంగా ఆడవాళ్ళ జైలులో ఏ పరిశ్రమ లేవీలేవు. ఆ ఖైదీలతో బియ్యం బాగుచేయించడం మొదలయిన పనులు చేయిస్తున్నాం" అన్నారు హైద్రాబాద్ సెంట్రల్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ వి. ఆర్. జోషి.

మొత్తం మనరాష్ట్రంలో నాలుగు సెంట్రల్ జైళ్ళు వున్నాయి. అవి హైద్రాబాద్, వరంగల్, రాజమండ్రి, విశాఖపట్నం.

ఆడవాళ్ళకోసం ప్రత్యేకంగా హైద్రాబాద్‌లో ఓ జైల్ వుంది. విచారణలో వున్న ఆడ ఖైదీలను, శిక్ష వేసిన ఆడ ఖైదీలనూ కూడా ఈ జైలులోనే వుంచుతారు.

ఆ ఖైదీకి పిల్లలుంటే ఆరు సంవత్సరాలు వచ్చేంతవరకూ పిల్లనీ తల్లితోపాటు వుండనిస్తారు. ఆ తర్వాత ప్రత్యేక స్కూల్‌కి పంపిస్తారు. ఆరేళ్ళవరకూ పిల్ల తల్లితో వుండకపోతే పాప మానసిక పరిస్థితి దెబ్బ తింటుందని, అలాగే ఆ తర్వాత కలిసివున్నా పాపకి నష్టమని ఇలా చేస్తున్నారు. ఇప్పుడు ఇలాంటి ఆరుగురు పిల్లలు ఆడఖైదీలతో పాటు వున్నారు.

ఇప్పుడు ఆడవాళ్ళ జైలులోవున్న పధ్నాలుగుమంది ఖైదీలలో ఏడుగురు యావజ్జీవ శిక్షని అనుభవిస్తున్నవారు. వాళ్ళలో నగ్న దేవత మంగమ్మవ్వకూడా వుంది.

## డిస్ట్రిక్ట్ జైల్

ఎన్నోరకాల నేరస్థులువుంటారు వీళ్ళని అరెస్ట్‌చేసి పోలీసులు, కారణాలతోసహా న్యాయస్థానంముందు హాజరువరుస్తారు. న్యాయస్థానం వారిని విచారణచేసి తప్పుకి తగ్గవిధంగా శిక్ష విధిస్తుంది.

సికింద్రాబాద్ జైల్‌లో విచారణ పూర్తికాని ఖైదీలతోపాటు రెండు సంవత్సరాలలోపు శిక్షపడినవారు వున్నారు. అంతకన్నా ఎక్కువ శిక్ష అయితే సెంట్రల్ జైల్‌కి పంపిస్తారు. 237 ఎకరాల విస్తీర్ణంలో ఈజైలు వుంది. దాదాపు 24బ్లాకులు వున్నాయి. భద్రతాచట్టంక్రింద అరెస్ట్‌చేసిన వారి కోసం 'బిక్లాస్' సౌకర్యాలువున్న బ్లాకుకూడా ఈ జైలులో వుంది.

బిక్లాస్‌లో వున్న ఖైదీలకు మంచాలు ఇస్తారు టి. వి, పేపర్లు మొదలయినవి అందుబాటులో వుంటాయి. వీళ్ళకి పాకెట్‌మనీగా కూడా రోజూ కొంత ఇస్తారు.

రంగారెడ్డి, జంటనగరాల ఖైదీలను విచారణ జరిగినంత కాలం ఇక్కడ నిర్బంధిస్తారు. తెలంగాణా ప్రాంతంలో వురి తీయాల్సిన ఖైదీలనూ ఈ జైలుకే తీసుకొస్తారు కర్నూలు, కడప, అనంతపురంజిల్లాల డిటెన్యూస్‌ని కృష్ణా, నెల్లూరు జిల్లాల రాజకీయఖైదీలనుకూడా ఇక్కడే వుంచుతారు తెలంగాణా జిల్లాలో వైద్యసౌకర్యం కావలసిన ఖైదీలనుకూడా ఇక్కడికి రప్పిస్తారు.

పన్నెండు పడకల సౌకర్యంతో ఖైదీలకోసం ఓ ప్రత్యేక హాస్పిటల్ ఈ జైలులో వుంది. సివిల్ అసిస్టెంట్ సర్జన్ కాడర్‌లో వున్న ఇద్దరు డాక్టర్లు, కాంపౌండర్లు రోగులని పరీక్షిస్తుంటారు. జైలులోకి రాకముందు డాక్టర్ ప్రతీవ్యక్తిని పరీక్షిస్తాడు బరువు మొదలయినవి నోట్ చేసుకుంటారు. ఏదైనా చికిత్స అవసరమనిపిస్తే వెంటనే చేస్తారు. ప్రత్యేక హాస్పిటల్స్‌కి పంపాల్సిన కేసులయితే అక్కడికి పంపుతారు.

ఖైదీలలో 90% జైలుకివచ్చిన తరువాత బరువు పెరగడం, ఆరోగ్యపరిస్థితులు అంతకన్నా మెరుగుపడడం జరుగుతుంటుంది. ఎందుకనంటే రోజూ రెండుపూటలా టైముకి టీ, భోజనం వీళ్ళకి అమురుతుంది. డాక్టర్లు ఎప్పటికప్పుడు పరీక్షించి ఆరోగ్యం మెరుగవడానికి మందులను

పుచితంగా ఇస్తుంటారు. అవసరమనిపిస్తే పాలు మొదలయిన ప్రత్యేక ఆహారంకూడా ఖైదీలకు ఇస్తారు.

ఇది చాలా పెద్దజైలు. దాంట్లో 600మంది దాకా ఖైదీలను వుంచవచ్చు. ఎమర్జెన్సీ టైమ్‌లో మన రాష్ట్రంలో ఎక్కువమంది రాజకీయ ఖైదీలను వుంచింది ఈ జైలులోనే! ఖైదీల యోగక్షేమాలని విచారించడానికి ప్రత్యేకంగా ఓ వెల్‌ఫేర్ ఆఫీసరూ వున్నాడు. ఈయన ఖైదీలకు, జైలుస్టాఫ్‌కి మధ్య వారధిలాంటివాడు. ఇద్దరిమధ్యా యెప్పుడూ సరయిన అవగాహనకోసం అతను ప్రయత్నిస్తుంటాడు.

పండగల సందర్భంగా ఖైదీలలో ఆటల పోటీలను పెడతారు.



ఖైదీలకు లెక్కప్రకారం రోజూ రెండుపూటలా భోజనం,టిఫిన్. టీ ఇస్తారు

ప్రత్యేక వుపన్యాసాలు ఏర్పాటుచేస్తారు. సినిమాలు చూపిస్తుంటారు అక్టోబరు 2అంటే మహాత్మాగాంధి పుట్టినరోజునాడు 'ప్రిజనర్స్‌వెల్‌ఫేర్ డే'గా పాటిస్తారు

ఈ జైలులోని ఖైదీలకు పాఠాలు చెప్పడానికి ఒక పార్ట్‌టైమ్ హిందీ మాష్టారు, పార్ట్‌టైమ్ తెలుగుమాష్టారు వున్నారు. ఖైదీలు చదువు

కోవడానికి రోజూ జైలుకి తొమ్మిదిరకాల వార్తాపత్రికలని, రకరకాల వార, మాసపత్రికలను తెప్పిస్తుంటారు.

ఖైదీలకు రోజూ రెండుపూటలా ఇచ్చే టీ, భోజనం కాకుండా ఇంకా వాళ్ళు తినాలనుకుంటే బిస్కట్లు మొదలయినవి లోపలున్న కాంటీన్‌లో దొరుకుతాయి. అవే కాకుండా జైలువాళ్ళు ఇచ్చేసబ్బు, పళ్ళపొడి మొదలయినవి చాలకపోయినా వాటిని, సిగరెట్లు వక్కపొడి మొదలయిన వాటినికూడా ఈ కాంటీన్‌లో కొనుక్కోవచ్చు. ఓ డెప్యూటీ జైలర్ ఆధ్వర్యంలో ఈ కాంటీన్ నడుస్తుంటుంది. ఒక్కొక్కఖైదీ తమ డబ్బుతో నెలకు యాభై రూపాయలదాకా ఈ కాంటీన్‌లో కొనుక్కోవచ్చు.

సికింద్రాబాద్ జైల్‌లోని అన్నివిభాగాల్ని డెప్యూటీ సూపరింటెండెట్ శ్రీ కె. ఆర్. ఎమ్. గుప్తస్వామికి దగ్గరుండి చూపించారు జైలు లోపల. బయటకూడా ఎంతోమంది సాయుధులైన గార్డులు కాపలా కాస్తున్నారు జైలుగోడలపైనున్న వైర్లలో ఇరవైనాలుగ్గంటలూ కరెంటు పాసవుతుంటుంది. ఎవరైనా ఆ గోడలమీదనుండి పారిపోవాలని ప్రయత్నిస్తే ప్రాణాపాయాన్ని కొనితెచ్చుకున్నట్లే! లోపల ఖైదీల ప్రవర్తనని గమనిస్తూకూడా కొందరు గార్డులుంటారు.

వంటచేయడంకోసం కొందరు ఖైదీలుంటారు. అలాగే మరి ందరు బట్టలుతికి ఇస్త్రీచేస్తారు. ఇలాఖైదీలందరూ తలా ఒకపని స్తారు. జైలుకి వెనుకవున్న పొలాల్లో కూరగాయల్ని పండిస్తారు. ఈ రగాయలు ఖైదీలకు సరిపడా ఇంకా మిగులుతాయికూడా! సాంస్కృతిక ర్యక్రమాలు నిర్వహించడానికి జైలు ఆవరణలోనే ఓ ప్రత్యేక స్టేజ్ కూడా వుంది.

"ఈ ఖైదీలందరూ నా బిడ్డలులాంటివాళ్ళు కొడుకు తప్పుచేస్తే శిక్షించం.... అతనిలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నిస్తాం. అలాగే అక్కడున్న ఖైదీలందరిలోనూ మార్పు తీసుకురావడానికి నేనెప్పుడూ ప్రయత్నిస్తుంటాను" అన్నారు సికింద్రాబాద్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ పి. వి. టి. ఫిలిప్స్.

# ఆడవాళ్ళకి ప్రత్యేక జైళ్ళు

ఆడవాళ్ళకోసం ప్రత్యేక జైళ్ళు హైద్రాబాద్ చంచల్‌గూడాలోను రాజమండ్రిలోను వున్నాయి. ఈ రెండు ప్రదేశాల్లోనూ సెంట్రల్ జైళ్ళకి అనుబంధ జైళ్ళుగా ఇవి వున్నాయి. వరంగల్, విశాఖపట్నం, విజయవాడ జైళ్ళలో కొన్ని గదులను మాత్రం ఆడవాళ్ళకి కేటాయించారు.

రాజమండ్రి ఆడవాళ్ళ జైలులో మూడు బారక్స్ వున్నాయి. (బారక్స్ అంటే మధ్య పార్టిషన్ లేకుండా పొడవుగా వుండే హాలు) కానీ హైదరాబాద్ జైల్‌లో బారిక్స్ కాకుండా రెండు వరసల్లో గదులు వున్నాయి. ఒక్కొ వరుసలోను పది గదులు. మొత్తం అరవై మంది ఆడఖైదీలను ఈ జైలులో వుంచవచ్చు కానీ ఈమధ్య కాలంలో ఎప్పుడూ ఇరవై అయిదు మందికి మించి ఈ జైలులో వుండలేదు. ఇప్పుడు ఇరవై రెండు మంది ఖైదీలుమాత్రమే ఈ జైలులో వున్నారు.

వాళ్ళలో పది మంది కేసుల విచారణ ఇంకాపూర్తికాలేదు నలుగురు మూడు సంవత్సరాలలోపు శిక్షని అనుభవిస్తున్నవారు ఎనిమిది మంది జీవిత ఖైదుని అనుభవిస్తున్నవారు.

# ఖైదీలపై నిఘా

ఒక్కొ గదిలోను ఒకరిని లేకపోతే ఇద్దరికన్నా ఎక్కువ మందిని వుంచుతారుగానీ ఇద్దర్ని పొరబాటునకూడా వుంచరు. ఇద్దరు వుంటే వాళ్ళిద్దరూ కొట్టుకోవచ్చు లేక స్వలింగ సంపర్కానికి అలవాటుపడవచ్చు అందుకని వార్డర్స్ ఎప్పుడూ ఖైదీలను గమనిస్తూనే వుంటారు.

ఖైదీలు తక్కువ వుండడంతో ఈగదుల్లోనే కొన్నింటిని ఆఫీసు గదులుగా వుపయోగిస్తున్నారు. ఖైదీలు పగలల్లా ఫ్రీగా వున్నా రాత్రిళ్ళు గదుల్లో బంధింపబడతారు. అన్ని గదులలో ఫ్యాన్లు వున్నా బాత్ రూమ్ సౌకర్యాలు లేవు.

ఈ విషయాల్ని సూపరింటెండెంట్ శ్రీ పి ఆర్. జోషిగారి ముందు ప్రస్తావనతెచ్చినప్పుడు "ఇవి చాలా పాత గదులు, అదే ఖైదీల కోసం వెనకవేపే మూడు బారెక్స్ కట్టించారు. వాటిలో అన్ని సౌకర్యాలూ వున్నాయి. త్వరలో అక్కడికి ఖైదీలను మారుస్తాము. ఒక బారెక్స్‌లో పెళ్ళాలను. రెండో బారెక్స్‌లో తక్కువ శిక్షపడిన వాళ్ళని, మూడో బారెక్స్‌లో యావజ్జీవఖైదుని అనుభవిస్తున్న వారిని వుంచుతాము.

ఇంతకు ముందు ఈ ఖైదీలతో నూలు వడికించే వాళ్ళము కానీ వాళ్ళ సంఖ్య బాగా తగ్గిపోవడంతో ఈ పని ఆగిపోయింది.

ఇప్పుడు ఈ ఖైదీలతో మొత్తం సెంట్రల్ జైలుకి అవసరమయ్యే బియ్యాము, పప్పులు మొదలయినవి బాగుచేయించడం, పరిసరాలను శుభ్రం చేయించడము చేస్తున్నాము" అన్నారు. చకచకా అన్ని పనులను చేసుకుపోవడం ఈయన ప్రత్యేకత.

చంచల్ గూడాలోని మగవాళ్ళ జైలు సూపరింటెండెంట్ జోష్షి రే ఈ ఆడవాళ్ళ జైలుకి సూపరింటెండెంట్. ఈ జైలు బాధ్యతల్ని స్వీకరించడానికి ప్రత్యేకంగా ఓ డెప్యూటీ సూపరింటెండెంట్ శ్రీమతి ఎ. ఎస్. సరోజనిగారు వున్నారు.

ఈవిడ ప్రతిరోజూ ఖైదీలందర్నీ పరామర్శించి వాళ్ళమంచి చెడ్డల్ని గమనిస్తుంటారు. ప్రతినెలా ఒక్కో ఖైదీని ప్రత్యేకంగా ఇంటర్‌వ్యూ చేసివాళ్ళలో వస్తున్న మార్పుల్ని గమనిస్తుంటారు.

నాతో మాట్లాడుతున్న కాసేపూకూడా ఆమె కళ్ళు గేటువేపు వచ్చి పోయే వాళ్ళని గమనిస్తూనే వున్నాయి. "ఎవరొస్తున్నారో వెళుతున్నారో,

ఎవరు ఏమే వస్తువుల్ని తీసుకొస్తున్నారో మేము వెయ్యికళ్ళతో గమనించాలి. లేకపోతే ఒక్కోసారి అనుకోని సంఘటనలు జరగడానికి అవకాశముంది" అన్నారామె నవ్వుతూ.

తన దగ్గరికి వచ్చే ఖైదీలతో ఎంతో సహనంతో మాట్లాడుతూ వాళ్ళ అనుమానాల్ని తీరుస్తూ చక్కటి సలహాలిస్తున్న ఆమె ఆ జైలు డిప్యూటీ సూపరింటెండెంట్‌గా కనిపించలేదు. ఓ సంఘసేవికురాలిలా కనిపించారు. ఆమెకి అన్నివిధాల సహకరిస్తూ ఆ జైలు నిర్వహణా బాధ్యతలో భాగం పంచుకుంటున్న మేట్రన్ శ్రీమతి లిల్లీ చాలాకాలం



ఆడపిల్లల జైల్లో ఆడ ఖైదీల పిల్లలకి పాఠాలు నేర్పుతున్న స్టాఫ్ నర్స్

నుండి ఈ జైలులో పనిచేస్తున్నారు. ఖైదీల మనస్తత్వాల్ని పరిశీలించటంలో ఆమెకి ఆమేసాటి. డిప్యూటీ మాట్రన్ కూడా వున్నారు. ఖైదీలకి వైద్య సౌకర్యాన్ని అందించడానికి ఓ నర్స్ వుంది. అవసరమైతే మగవాళ్ళ జైలులోవున్న డాక్టర్లనే ఇక్కడికి రప్పిస్తారు.

ఈ జైలులో చాలా తక్కువమంది వుండడంతో వంట మగవాళ్ళ

జైలులోనే చేయించి ఇక్కడికి పంపుతారు. అలాగే టీ కూడా! రోజూ ఉదయం ఏడుగంటలకి టిఫిన్‌తోపాటు టీ ఇస్తారు. మళ్ళీ మధ్యాహ్నం ఒంటిగంటకి రెండోసారి టీ ఇస్తారు. ఉదయం పదకొండు గంటలకి, సాయంత్రం అయిదున్నరకి భోజనం పెడతారు. అనారోగ్య కారణాలవల్ల ప్రత్యేక ఆహారం అవసరమైతే తగ్గ ఆహారాన్ని ఇస్తారు.

త్వరలోనే ఎంబ్రాయిడరీ మొదలయిన విద్యలని ప్రవేశపెట్టబోతున్నారు.

## పిల్లల పోషణా అధికారులదే

సినిమాలలో మనం చూసే ఖైదీలకు, ఈ ఖైదీలకు ఎంతో వ్యత్యాసముంది. ఆడఖైదీలకు తెల్లచీర, జాకెట్టు ఇస్తారు. పగలల్లా వీళ్ళు తమ గదుల్లోనే మగ్గిపోనవసరం లేదు. ఆ జైలు నాలుగు గోడలమధ్యా తిరగవచ్చు. కానీ రాత్రిళ్ళు మాత్రం వీళ్ళని గదులలో బంధిస్తారు.

చిన్నపిల్లలయితే తల్లులతోపాటే జైళ్ళలో వుండవచ్చు. జైలులో వుంటూ పిల్లల్ని కన్నవారూ వున్నారూ, శిక్ష పడేనాటికి వాళ్ళు గర్భవతులై వుంటే అక్కడి డాక్టర్లే ఆ బాధ్యతల్ని స్వీకరిస్తారు. పిల్లలకి ఆరు సంవత్సరాలు వచ్చేంతవరకూ తల్లితోపాటు వుండనిస్తారు వాళ్ళ పోషణని కూడా జైలు అధికారులే చూసుకుంటారు. ఆరు సంవత్సరాలు దాటిన తర్వాత అక్కడేవుంటే ఆ పాప లేక బాబు భవిష్యత్తు దెబ్బతింటుంది. అందుకని అప్పుడు వాళ్ళని వేరే వుంచి చదివిస్తారు

ఈ జైలులోని ఆడఖైదీలకు సబ్బులు, నూనె, పళ్ళపొడి మొదలయిన అత్యవసర వస్తువుల్ని జైలువాళ్ళే వుచితంగా ఇస్తారు. ఇవికాకుండా కోరే ఇంకేమైనా వాళ్ళకి కావల్సివుంటే లిస్టురాసి డెప్యూటీ సూపరింటెండెంట్‌కి పైస్తే ఆవిడ తెప్పిస్తారు. ఒక్కో ఖైదీ నెలకి యాభై రూపాయలకి మించకుండా తమ సొమ్ముతో ఇలా వాళ్ళకి కావలసిన వస్తువుల్ని తెప్పించుకోవచ్చు.

పొరబాటునో గ్రహపాటునో కొన్ని తప్పులుచేసి జైలుపాలై భార్యాబిడ్డలకి దూరంగావుంటూ పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న వాళ్ళూ వున్నారు, మతిస్థిమితంలేక తాము బాధపడుతూ స్వాపునీ బాధపెడుతున్న వారూ వున్నారు ఇక్కడ. నగ్నదేవతగా పేరుపొందిన మంగమ్మవ్వ కూడా ఇప్పుడు ఈ జైలులోనే వుంది.

1959 తర్వాత ఈ జైలులోని ఖైదీలని ఎవ్వరినీ ఉరితియ్యలేదు.

# వర్క్ కాంప్స్ నిర్వహించాలి

## జైళ్ళ విభాగం డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ వై. సి. తిమ్మారెడ్డితో ఇంటర్వ్యూ

డాక్టర్ రోగిని పరీక్షించిన తర్వాత ఇటువంటి చికిత్స అవసరం అనుకుంటాడు. అలాగే మేమూ నేరస్థుడు జైలులోకి రాగానే అతనికి ఇటువంటి ట్రీట్‌మెంట్ అవసరం, అలాంటి ట్రీట్‌మెంట్ ఇస్తేనే అతనూ బాగుపడతాడు, ఇతరులకీ హాని కలిగించకుండా వుంటాడని నిర్ధారణ చేసుకుని అటువంటి ట్రీట్‌మెంటే ఇస్తాము. నేరస్థులతో వార్డర్లు ఎలాప్రవర్తించాలి, వార్డర్ల విధులేమిటి వాళ్ళకి వివరంగా తెలియజెయ్యడానికి ప్రత్యేకంగా శిక్షణకూడా మేము ఇస్తాము. అందుకోసం ఇక్కడ స్టేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కరక్షనల్ అడ్మినిస్ట్రేషన్ అనే ప్రత్యేక శిక్షణాకేంద్రం వుంది. వార్డర్లపై ఆఫీసర్లకు శిక్షణ ఇవ్వడానికి వెల్లూరులో మరో శిక్షణా కేంద్రం వుంది" అన్నారు జైళ్ళ విభాగం డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ వై. సి. తిమ్మారెడ్డి, జైళ్ళలో ఖైదీలకు ఎలాంటి ట్రీట్‌మెంట్ ఇస్తారో వివరిస్తూ.

కాసేపాగి ఆయనే "ఖైదీల పరిస్థితుల్ని మెరుగు పరచడానికి తీసుకుంటున్న ప్రత్యేక ప్రాజెక్టుల గురించి డైరెక్టర్ జనరల్ శ్రీ సఫియుల్లా ఖాన్‌గారు మీకు వివరించారు కదా! ఇంతకుముందు ఎక్కువ ఫండ్స్‌ని సక్రిఫైడ్‌స్కూల్స్‌ని మెరుగుపరచడానికి వినియోగించేవారు. ఇప్పుడు జైళ్ళలో పరిస్థితుల్ని మెరుగుపరచడానికి ఎక్కువ శ్రద్ధ చూపించడంతో పాటు డబ్బునీ వెచ్చిస్తున్నారు. ఫాన్లు, సెప్టిక్ లెట్రిన్స్ మొదలయిన ఆధునిక సదుపాయాలన్నింటినీ కల్పిస్తున్నారు" అన్నారు.

"అందరు ఖైదీలను కలిపి వేస్తారా?"

"మీకు ఇందాకే చెప్పానుకదంతే వాళ్ళ మానసిక పరిస్థితుల్నిబట్టి ట్రీట్‌మెంట్ ఇవ్వాలని. ముందు ఖైదీరాగానే పూర్తిగా అతని పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటాం. కొంతమంది నేరస్థులు మనస్థితి తొన్నికోల్పోయి వుంటారు. వాళ్ళని వేరేగా వుంచుతాము. ఇంకొందరు నేరస్థులు దురుసుగా ప్రవర్తిస్తుంటారు. వాళ్ళ ప్రవర్తనలో మార్పువచ్చేంతవరకూ వాళ్ళనీ వేరే గదుల్లో వుంచుతాము. కొంతమందికి నేర ప్రవృత్తి నరనరాల్లో జీర్ణించుకుపోయి వుంటుంది. మరికొందరు కేవలం కొన్ని పరిస్థితుల కారణాన తప్పుచేసి జైలుకొచ్చి వుంటారు. వీళ్ళిద్దర్నీ కలపడం వల్ల రెండోరకం వాళ్ళు పాడైపోయే ప్రమాదముంది. అందుకని పొరపాటున కూడా ఈ రకాల వాళ్ళనీ కలవనివ్వము" అన్నారు శ్రీ తిమ్మారెడ్డి

"ఖైదీల మానసిక పరిస్థితుల్ని పరిశీలించడానికి ప్రత్యేక విభాగమేదైనా వుందాండీ?"

"జైళ్ళలో అధికారులు వాళ్ళ మనస్థితిని ఎప్పటికప్పుడు గమనిస్తూ తగ్గ ట్రీట్‌మెంట్ ఇస్తుంటారనుకోండి సైకాలజిస్టులు, డాక్టర్లు కూడా పరీక్షించి తగ్గ సూచనలిస్తుంటారు. వీళ్ళందరూకాక ప్రత్యేకంగా ప్లానింగ్ రిసెర్చి అండ్ డెవలప్‌మెంట్ అనే సెల్ వుంది. దీని ద్వారా ప్రత్యేక తరహా నేరాల పుట్టు పూర్వోత్తరాలు, ఆ నేరస్థులు ఆ నేరాలు చెయ్య

దానికి సహకరించిన పరిస్థితులు, అప్పటి నేరస్థుని పరిస్థితి మొదలయిన వాటన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలిస్తారు. ఇలా పరిశోధనలు జరపడంవల్ల ఆ నేరస్థుల మానసిక పరిస్థితిని మెరుగు పరచడమే కాకుండా, ఆ తరహా నేరాలు తిరిగి జరగకుండా నివారించడానికి కూడా ప్రయత్నించవచ్చు. ఉదాహరణకి కుష్ఠువ్యాధితో పీడింపబడుతున్న వాళ్ళు ఎక్కువగా 'రేప్' కేసుల్లో ఇరుక్కుంటున్నారు అలాగే కుర్రకారు ఈ మత్తుపదార్థాలవలలో చిక్కుకుంటున్నారు అలాగే మర్డర్లు కూడా ఎక్కువగా ఆస్తికోసమో, లేకపోతే భార్యాభర్తలలో ఎవరో ఒకళ్ళకి చట్టవిరుద్ధమయిన సంబంధాలు వుండటం వల్లనో జరుగుతున్నాయి. ఈ పరిస్థితులన్నింటినీ పరిశీలించడంవల్ల మరెందరో ఈ తరహా నేరాలలో చిక్కుకోకుండా వుండేట్లు పరిస్థితుల్ని అందరికీ తెలియజెప్పవచ్చు.

''విడుదలయిన ఖైదీల పునరావాసంలో మీరేమైనా సాయం చేస్తున్నారా?'

"అందుకూ మా డిపార్ట్‌మెంట్ ఎంతో కృషి చేస్తోందండి. ప్రత్యేకంగా కొంతమంది ఫీల్డ్ ఆఫీసర్లున్నారండి. విడుదలయిన ఖైదీలు తమకి ఏదైనా సాయం కావాలనుకుంటే వాళ్ళను కలుసుకుని పొందవచ్చండి. నిజంగా వాళ్ళలో మార్పు వచ్చివుంటే వాళ్ళు సరయిన జీవనోపాధిని పొందడానికి మా డిపార్ట్‌మెంట్ తప్పకుండా సాయం చేస్తుందండి. ఆ ఫీల్డాఫీసర్లని కలుసుకోలేకపోతే జైలు సూపరింటెండెంట్‌గారిని కలుసుకుని తమ బాధ చెప్పుకుంటే వారే వాళ్ళకి తగ్గ సాయాన్ని వెల్‌ఫేర్ ఆఫీసర్లో ఫీల్డ్ ఆఫీసర్లో అందజేసేలా చూస్తారండి"

''మరి వాళ్ళు పని చేసే దానికి ప్రత్యేకంగా వేతనాలు ఏమైనా ఇస్తుంటారా?''

"తప్పకుండా నండి. ఓపెన్ ఎయిర్ జైళ్ళలో పని చేసే వ్యవసాయ పనులకు, సెంట్రల్ జైళ్ళలో పనిచేసే పారిశ్రామిక విభాగాల్లో

పనికి అన్నింటికీ ఒక పద్ధతి ప్రకారం వేతనాలను ఇస్తున్నారండి. కేవలం ఎక్కువ శిక్షని అనుభవిస్తున్న ఖైదీలలోనే కాకుండా తక్కువ శిక్షని అనుభవిస్తున్న ఖైదీలతో కూడా పనులు చేయించాలండి. లేకపోతే వాళ్ళమీద పెట్టేఖర్చు దండగని నా అభిప్రాయం. ఉదాహరణకి టికెట్ లెస్ ట్రావెలర్స్‌ని పట్టుకున్నారనుకోండి. వాళ్ళకి పదిహేను రోజులో, నెలో, రెండు నెలలో–ఇలా తక్కువ శిక్ష పడుతుంది. ఇన్నాళ్ళూ వాళ్ళని చక్కగా పోషించాలి. వెళ్ళిపోయేప్పుడు వాళ్ళ వూరికి టికెట్లుని కొనివ్వాలి. ఈ డబ్బంతా దండుగ కదండి ఇన్నాళ్ళూ వాళ్ళు వూరికే తిని కూర్చోవడంవల్ల వాళ్ళలో సోమరితనం పెరుగుతుంది. అందుకని అటువంటి వాళ్ళందరితోనూ పనులు చేయించాలండి....

"ఎలాగంటారు?"

"వర్క్‌కాంప్స్‌ని నిర్వహించాలి. అంటే ప్రాజెక్టులు నిర్మాణం మొదలయిన ప్రదేశాల్లో శ్రామికుల అవసరం వుంటుంది. అక్కడికి వీళ్ళందర్నీ పంపించి పని చేయించాలి జైలుస్టాఫ్ కొంతమంది వెళ్ళి వాళ్ళని గమనిస్తుంటారు ఇలా చెయ్యడంవల్ల వాళ్ళలో కష్టించి పనిచేసే అలవాటుని కలిగించడంతోపాటు దేశ నిర్మాణ కార్యక్రమాలలో జైళ్ళ విభాగం ఇతోధికంగా కృషిచేసినట్లు అవుతుంది."

"జైళ్ళనుండి ఖైదీలను పనిజరిగే ప్రదేశాలకి పంపడం కష్టమవుతుందేమోనండి?"

"కోర్టునుంచి శిక్షపడగానే సరాసరి వర్క్‌స్పాట్‌కి పంపేయవచ్చండి. పని దొరక్క వస్తుండేవాళ్ళు శిక్షాకాలం పూర్తయిన తర్వాత కూడా అక్కడే పని చేసుకోవచ్చు"

"బాగుందండి. తర్వాత మరో సందేహముండి. ఓపెన్ ఎయిర్ జైళ్ళలో వ్యవసాయం చేసుకోవడానికి ఎంతో స్థలాముంటోంది. కాని ఆ జైళ్ళలో ప్రవేశార్హతని పొందడానికి మీరు ప్రత్యేక అర్హతలుండాలి అన్నారు"

"అవునుకదండిమరి.... ఆ ఓపెన్‌ఎయిర్ జైళ్ళలో ప్రవర్తన

బాగుండని ఖైదీలను పంపితే వాళ్ళు పారిపోవడానికి అవకాశాలు ఎక్కువ కదండి...."

"ఆ విషయం కరక్టేనండి- అదికాదు ఓపెన్ ఎయిర్ జైల్లోకి ప్రవేశించే అర్హతలు కలిగివుండికూడా అక్కడికి వెళ్ళడానికి వాళ్ళకి ఇష్టం లేకపోతే వాళ్ళని వదిలేస్తున్నారుకదా! ఇది సోమరితనాన్ని పెంచడంకాదా?"

"మీరన్నది నిజమేనండి. ఓపెన్ ఎయిర్ జైళ్ళలో పని ఎక్కువగా వుంటుందని చాలామంది ఖైదీలు అక్కడ స్వాతంత్ర్యం మిగతా జైళ్ళకన్నా ఎక్కువవున్నా వెళ్ళడానికి నిరాకరిస్తూన్నారు. మేమూ వాళ్ళని బలవంతం చెయ్యం. ఎందుకనంటే ఇష్టంలేనివాళ్ళని అక్కడికి పంపామనుకోండి. అక్కడ లేనిపోని గొడవలు లేవదీస్తారు."

"అలాగని వాళ్ళ సోమరితనాన్ని ప్రోత్సహించడంకన్నా మరోమార్గం లేదంటూరా!"

"ఒక విధంగా చేయ్యొచ్చండి. ఖైదీలను ప్రిమెచ్యూర్ రిలీజ్ చేసే విషయాన్ని ఒక పానెల్ పరిశీలిస్తుందండి.... అలా ప్రిమెచ్యూర్ రిలీజ్ పరిశీలనకి ఆ ఖైదీని ఆలోచించాలంటే అతను కనీసం రెండు సంవత్సరాలైనా ఓపెన్ ఎయిర్ జైల్లో వుండి తీరాలి అనే నిబంధనలాంటి వత్తిడిని తీసుకు రావాలండి. అప్పుడు వీళ్ళందరూ ఓపెన్ ఎయిర్ జైల్లోకి వెళ్ళడానికి వుత్సాహాన్ని చూపిస్తారు. అక్కడి పొలమంతాకూడా సాగులోకి వస్తుంది" అన్నారు శ్రీ తమ్మారెడ్డి.

"మా స్వాతి పాఠకులకు చాలా విషయాలు చెప్పారు. థాక్సండి" అంటూ తమ్మారెడ్డిగారి దగ్గర శలవు పుచ్చుకున్నాను.

5)

# ఖైదీల శలవులు

ఒక్కోసారి కేసువిచారణ ఆలస్యం అవుతుంటుందికదా. మరి ఈ విచారణాకాలంలో అనుభవించిన ఖైదుశిక్షకాలంలోకి వస్తుందా రాదా, ఖైదీలకు శలవులు ఎలావుంటాయి? వీళ్ళశిక్ష ఎటువంటి పరిస్థితుల్లో తగ్గుతుంది? కఠినశిక్ష అంటే ఏమిటి. తేలికశిక్ష అంటే ఏమిటి? బోస్టల్ స్కూలు అంటే ఏమిటి? మొదలయిన సందేహాల్ని ఎవ్వరో పాఠకులు వ్యక్తపరచారు. ఈ సందేహాల్ని డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ శ్రీ పి. నాగిరెడ్డిగారి ముందుంచినపుడు ఆయన చెప్పిన సమాధానాల్ని తన ప్రశ్నలతో సహా ఇప్పుడు మీ ముందుంచుతోంది, చదవండి.

నమస్కారమండి నాగిరెడ్డిగారూ....

నమస్కారమండి.

మా పాఠకుల సందేహాల్ని కొన్నింటిని మీ ముందుంచి సమాధానాలు తెలుసుకోడానికి వచ్చానండి.

తప్పకుండా.... అడగండి....

విచారణ కాలంలో అనుభవించిన ఖైదుకూడా శిక్షాకాలంలో కలుస్తుందాండి?

కలుస్తుందండి. శిక్షపడే సమయానికి అతనెంతకాలం జైలులో వున్నాడో అంతకాలం తగ్గించి మిగతా శిక్షను అనుభవించాలి.

ఖైదీలను శిక్షాకాలంలో ఇంటికి పంపించే వీలుందాండీ?

ఫర్లో అని రెండుసంవత్సరాలకి ఒకసారి 14రోజులు ఇంటికి వెళ్ళి రావడానికి వీలు కలిపిస్తారండి. ముందు పోలీస్ డిపార్ట్‌మెంట్ వారికి తెలియజేస్తారు. వాళ్ళు ఖైదీ ఇంటి చుట్టుపక్కల వాతావరణాన్ని పరి

శిలించి ఖైదీ అక్కడికి వచ్చినా పర్లేదు. మళ్ళీ కొత్తగొడవలు ఏమీ జరగవు అని సర్టిఫికేట్ ఇచ్చిన తర్వాతనే ఫర్లో శాంక్షన్ చేస్తారండి.

మొదటిసారి ఫర్లోలో పంపడానికి ఇంత కట్టుదిట్టాలు మొదటిసారి వెళ్ళి ఎటువంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా నిర్ణీతకాలం దాటకుండా జైలుకి తిరిగి వచ్చాడనుకోండి. రెండోసారి మర్రోరెండు సంవత్సరాల తర్వాత తేలిగ్గా పంపుతారు.

ఒకవేళ తిరిగిరాకపోతే?

ఫర్లో పీరియడ్ అయిపోగానే ఖైదీ తిరిగిరాకపోతే వెంటనే పోలీస్ రిపోర్ట్ ఇస్తామండి. పోలీసులు అతనెక్కడవున్నా వెదికి పట్టుకొస్తారు. ఆ తర్వాత మళ్ళీ అతనికి ఫర్లో శాంక్షన్ చెయ్యరు. పైగా అతను అంత వరకూ తనమంచి నడవడికతో తెచ్చుకున్న మంచి పేరంతా నాశనమైపోతుందండి.

ఫర్లో రెండుసంవత్సరాలకి ఒకసారి 14రోజులు ఇస్తారాండి?

క్లోజ్‌డ్ జైళ్ళలో అయితేనండి. అదే ఓపెన్ ఎయిర్ జైలులో అయితే సంవత్సరానికి 14రోజులు ఫర్లో ఇస్తారు.

ఈ ఫర్లో పీరియడ్ శిక్షాకాలంలో కలుస్తుందాండీ?

కలుస్తుందండి. పెరోల్ అనే వేరేశలవు వుందండి. ఇది శిక్షాకాలంలో కలువదు. పెరోల్‌లో ఎన్నిరోజులువెళితే అన్నిరోజులూ శిక్ష పెరుగుతుందండి.

పెరోల్ అంటే ఏమిటండీ?

ఖైదీకి దగ్గరవాళ్ళు ఎవరయినా చనిపోయినా లేకపోతే దగ్గరవాళ్ళ పెళ్ళిళ్ళయినా ఖైదీలు అప్లికేషన్ పెట్టుకుంటే విచారించి. అప్పుడు అక్కడికి పంపిస్తారండి. ఇదికూడా పోలీస్ సూపరింటెండెంట్ రిపోర్ట్ ఆధారంగానే శాంక్షన్ చేస్తారండి.

శీలించి ఖైదీ అక్కడికి వచ్చినా పర్లేదు. మళ్ళీ కొత్తగొడవలు ఏమీ జరగవు అని సర్టిఫికేట్ ఇచ్చిన తర్వాతనే ఫర్లో శాంక్షన్ చేస్తారండి.

మొదటిసారి ఫర్లోలో పంపడానికి ఇంత కట్టుదిట్టాలు మొదటిసారి వెళ్ళి ఎటువంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా నిర్ణీతకాలం దాట కుండా జైలుకి తిరిగి వచ్చాడనుకోండి. రెండోసారి మర్రోరెండు సంవత్స రాల తర్వాత తేలిగ్గా పంపుతారు.

ఒకవేళ తిరిగిరాకపోతే?

ఫర్లో పీరియడ్ అయిపోగానే ఖైదీ తిరిగిరాకపోతే వెంటనే పోలీస్ రిపోర్ట్ ఇస్తామండి. పోలీసులు అతనెక్కడవున్నా వెదికి పట్టుకొస్తారు. ఆ తర్వాత మళ్ళీ అతనికి ఫర్లో శాంక్షన్ చెయ్యరు. పైగా అతను అంత వరకూ తనమంచి నడవడికతో తెచ్చుకున్న మంచి పేరంతా నాశనమై పోతుందండి.

ఫర్లో రెండుసంవత్సరాలకి ఒకసారి 14రోజులు ఇస్తారాండి?

క్లోజ్డ్ జైళ్ళలో అయితేనండి. అదే ఓపెన్ ఎయిర్ జైలులో అయితే సంవత్సరానికి 14రోజులు ఫర్లో ఇస్తారు.

ఈ ఫర్లో పీరియడ్ శిక్షాకాలంలో కలుస్తుందాండీ?

కలుస్తుందండి. పెరోల్ అనే వేరేశలవు వుందండి. ఇది శిక్షా కాలంలో కలువదు. పెరోల్‌లో ఎన్నిరోజులువెళితే అన్నిరోజులూ శిక్ష పెరుగుతుందండి.

పెరోల్ అంటే ఏమిటండీ?

ఖైదీకి దగ్గరవాళ్ళు ఎవరయినా చనిపోయినా లేకపోతే దగ్గరవాళ్ళ పెళ్ళిళ్ళయినా ఖైదీలు అప్లికేషన్ పెట్టుకుంటే విచారించి. అప్పుడు అక్క డికి పంపిస్తారండి. ఇదికూడా పోలీస్ సూపరింటెండెంట్ రిపోర్ట్ ఆధా రంగానే శాంక్షన్ చేస్తారండి.

మరికొందరు ప్రభుత్వం ప్రతి నిధులతో ఒక సలహా సంఘం ఏర్పడు తుంది. ఈ సలహా సంఘం ఖైదీలను పరీక్షించి వివరాల్ని ప్రభుత్వానికి తెలియ పరుస్తుంది. అప్పుడు ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ఎవర్ని ఎప్పుడు విడుదల చెయ్యాలో ....

ఈ సలహాసంఘం జైళ్ళలోవున్న అందరు ఖైదీలనూ పరిశీలిస్తుందాండీ?

అందర్నీ కాదండి. 2 సం. అంతకుమించి శిక్షని అనుభవించే వాళ్ళనే ఈ బోర్డు పరిశీలిస్తుంది. యావజ్జీవ ఖైదు కాకుండా తక్కువ శిక్షని అనుభవించే వాళ్ళు సగం శిక్ష ఏ మచ్చా లేకుండా పూర్తిచేస్తే ఈ బోర్డు పరిశీలనలోకి రావడానికి అర్హులవుతారు. అలాగే యావజ్జీవ ఖైదీలు రెమిషన్‌తో కలుపుకుని 10 సం॥ శిక్ష అనుభవిస్తే సలహాసంఘ పరిశీ లనలోకి వచ్చే వాళ్ళు. ప్రవర్తన బాగుండి పరిస్థితులన్నీ అనుకూలిస్తే విడుదల అయిపోయే వారుకూడా!

కానీ 1978 డిసెంబరునుండి కొత్త చట్టం అమలులోకి వచ్చింది. ఈ చట్టప్రకారం రెమిషన్లు కాకుండా ఖచ్చితంగా శిక్షను 14 సం॥ అనుభ విస్తేనే యావజ్జీవఖైదీలు సలహా సంఘం ముందుకు రావడానికి అవకాశ ముంటుంది. అంటే మినహాయింపులతో కలుపుకుని 20 సం॥ శిక్ష అనుభ వించాలి దీంతో యావజ్జీవ ఖైదీలు జైలులో ఖచ్చితంగా వుండాల్సిన కాలం ఇదివరకటికన్నా పెరిగింది

ఎంతకాలానికి ఒకసారి ఈ సలహాసంఘం కలుస్తుం దండీ?

ప్రతీ జైలులోను 3 నెలలకి ఒకసారి ఈ సలహా సంఘంవస్తుంది. ఒక్కోసారి కేసులు ఎక్కువగా వుంటే ఇంకా ఎక్కువసార్లు ఈ సలహా సంఘం కలిసే అవకాశం వుంది.

బోర్స్టల్ స్కూల్స్ గురించికూడా చెబుతారండీ?

18—21 సం. మధ్య శిక్షపడిన ఖైదీలను బోర్స్టల్ స్కూల్‌లో

వుంచుతారు. 23 సం॥ వయసురాగానే బోస్టల్ స్కూల్ నుండి పింపేస్తారు. అంటే బోస్టల్ స్కూళ్ళలో 5 సం. కన్నా ఎక్కువ కాలం వుంచరు. ఇక్కడ మామూలు విద్యతోపాటు వృత్తి విద్యలనీ నేర్పిస్తారు. బోస్టల్ స్కూలునుండి ఎటువంటి పరిస్థితుల్లోనూ జైలుకి పంపకూడదని సుప్రీమ్‌కోర్ట్ ఆర్డరుంది. 21 సం. వయసుదాటిన తర్వాత శిక్ష పడితే బోస్టల్ స్కూల్‌కి పంపరు. ఇక్కడవుంటూ బయటి స్కూళ్ళకి విద్యనేర్చుకోడానికి వెళ్ళనిస్తారు.

యవ్వన దశలోకి అడుగుపెడుతున్న వీరికి సరయిన శిక్షణనిస్తే తిరిగి మామూలు పౌరులవుతారన్న వుద్దేశంతో 18–21 సం. మధ్య కుర్రాళ్ళని బోస్టల్ స్కూళ్ళకి పంపిస్తారు. ఒకవేళ ప్రభుత్వంవారు ప్రత్యేకంగా ఆదేశిస్తు వీళ్ళను సెంట్రల్ జైల్‌లో ప్రత్యేకంగా వుంచుతారు. మనరాష్ట్రంలో నిజామాబాద్, విశాఖపట్నం, అనంతపూర్‌లలో బోస్టల్ స్కూళ్ళున్నాయి.

సబ్ జైళ్ళ నిర్వాహణని ఇప్పుడు పూర్తిగా జైళ్ళశాఖే తీసుకుంటోందిట కదండీ?

ఇంతకు ముందు న్యాయశాఖ ఆధ్వర్యంలో సబ్‌జైళ్ళువుండేవి. నిర్వాహణా ఖర్చుని మాత్రం జైళ్ళ శాఖే భరించేది. ఏడవ ఫైనాన్స్ కమీషన్‌లో కేంద్ర ప్రభుత్వం సబ్ జైళ్ళ పరిస్థితి మెరుగుపరచడానికి ఫండ్స్ ఇచ్చింది. ముందు రాయలసీమలో కొన్ని సబ్‌జైళ్ళని మాశాఖ తీసుకుంది. క్రమంగా అన్ని సబ్ జైళ్ళ నిర్వాహణా బాధ్యతల్నీ మాశాఖే చేపడుతుంది. మన సంఘ ప్రతిబింబాలే జైళ్ళు. అందుకని జైళ్ళ పరిస్థితినీ మిగతా సంఘ పరిస్థితులతోపాటు మెరుగుపరచాలి.

చాలా విషయాలు చెప్పారు. థాంక్సండి.

# ఖైదీలలో మార్పు తేవడం ఎలా?

జైళ్ళు చూసిన తర్వాత కల్గిన మరికొన్ని సందేహాల్ని తీర్చు కోవడానికి డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ శ్రీ ఎమ్.వి. సుబ్బారెడ్డిని కలుసుకున్నపుడు సాదరంగా ఆహ్వానించారు సుబ్బారెడ్డిగారు.

"జైళ్ళల్లో ఖైదీలకు ఫ్యాన్లు, సెప్టిక్ లెట్రిన్స్‌లాంటి సదుపాయాల్ని కలిగించడం వల్ల ఇంటికన్నా జైలు పదిలం అనిపించదుగదా వాళ్ళకి" అనుమానాన్ని వ్యక్తపరచాను.

"ఎంతమాత్రం కాదండి. మిగతా సదుపాయాలు ఎన్ని సమకూర్చినా ఎక్కడికి కావాలనుకుంటే అక్కడికి వెళ్ళే స్వేచ్ఛ వుండదు కదండి.... అందుకని ఇక్కడికి రావడానికి ఎవ్వరూ మోజు చూపించరు. సాధార ణంగా మనం ఇళ్ళలో అయిదారుగురిం లేక పదిమంది వుంటాము. కానీ జైళ్ళలో వుండే ఈ బారెక్స్‌లో చాలామంది వుంటారు. ఒక్కోసారి కెపాసిటీని మించిపోయే జనాన్ని కూడా ఆ బారెక్స్‌లలో వుంచాల్సిన పరి స్థితులు వస్తాయి. అందుకని అక్కడ కార్బన్‌డయాక్సైడ్ ఎక్కువై ఇబ్బంది పడతారు. అదికాకుండా మనకి ఇంట్లో కాస్త వుక్కగా అనిపిస్తే కాస్త అటు ఇటు తిరిగివస్తాం. కానీ వాళ్ళకి అలా కుదరదు వాళ్ళు కట కటాల వెనుకన వుంటారు కదా! వాళ్ళ ప్రవర్తనలో మార్పు తీసుకురావా లంటే వాళ్ళ మనసుల్ని ఆహ్లాదంగా వుంచాలి. వాళ్ళలో చిరాకుని పెంచితే మంచి జరగదు సరికదా చెడు జరుగుతుంది. అందుకే ఎంత ఖర్చయినా వెనుదీయకుండా ఈ సదుపాయాలన్నింటినీ సమకూర్చాము" అన్నారు. ఖైదీలకు ఎందుకు అన్ని సదుపాయాలు కల్పిస్తున్నది వివరిస్తూ శ్రీ సుబ్బారెడ్డి.

సుబ్బారెడ్డిగారు ఇంతకుముందు అనేక జైళ్ళకి సూపరింటెండెంట్‌గా వ్యవహరించారు. అప్పట్లో అనేకమంది ఖైదీలలో విప్లవాత్మకమైన మార్పు తీసుకురావడంలో ఆయన కృతకృత్యులయ్యారు.

అందుకని "ఖైదీలలో మానసికమార్పు తీసుకురావడానికి మీరు ఎటువంటి పద్ధతుల్ని అవలంభించేవారో కొన్నింటిని మా పాఠకులకు వివరించండి" అని ఆయనను అడిగాను.

ఖైదీలలో మార్పుతీసుకురావడానికి సందర్భాన్నిబట్టి భయపెట్టాల్సి వస్తుంది బుజ్జగించాల్సి వస్తుంది. ముందు అతడి నేరానికి వెనుక వున్న పరిస్థితుల్ని పరిశీలించే అతనితో ఎలా ప్రవర్తించి మార్పు తీసుకురావాలో నిర్ధారణ చేసుకుంటాం. అలా మారిన కొందరి గురించి మీకు చెబుతాను.

రాజమండ్రి జైలు సూపరింటెండెంట్‌గా వున్నప్పుడు ఎందరో దీర్ఘకాలిక ఖైదీలలో మార్పు తెచ్చాను.

ఒకసారి ఒక ఖైదీ జైలులో వురేసుకోవడానికి ప్రయత్నించాడు. వార్డర్లు అతడిని కొట్టబోగా నేను వారించి నా దగ్గరకు పిలిపించుకున్నాను.

"ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకున్నావంటే నువ్వెంత మానసిక వ్యధకి లోనవుతున్నావో అర్థం చేసుకున్నాను. నేను నీ ప్రయత్నాన్ని ఆపదల్చుకోలేదు. కాకపోతే నువ్వు ఆత్మహత్య చేసుకునేముందు నాకు చెప్పు. అప్పుడు నేనూ నీవెంట వుంటా.... లేకపోతే సెక్యూరిటీ సరిగా లేకపోవడం వల్ల నువ్వు వురేసుకున్నావని నామీద విరుచుకు పడతారు. నాపైన చర్యకూడా తీసుకుంటారు నేను నీ శ్రేయోభిలాషిని. కాబట్టి నాకు చెప్పకుండా నువ్వు వురేసుకుని నన్నవసరంగా శిక్షించకు" అంటూ అతనికి నచ్చజెప్పాను.

ఆ తర్వాత "నువ్వీ నిర్ణయానికి ఎందుకొచ్చావ్?" అని ఆప్యాయంగా అడిగి అసలు కథను రాబట్టాను.

చిన్నప్పటినుండి అతను ఎన్నో కష్టాలని ఎదుర్కొన్నాడు. చిన్నప్పుడే తల్లి చనిపోయింది. తండ్రి పట్టించుకునేవాడు కాదు. తర్వాత తండ్రి మళ్ళీ పెళ్ళిచేసుకోవడంతో అతని పరిస్థితి మరి దుర్భరమైంది.

సరిగ్గా తిండి దొరికేది కాదు. ఆరోగ్యం అంతంత మాత్రంగా తయారైంది. తర్వాత పెళ్ళి చేసుకున్నాడు. అలాగే రిక్షాతొక్కి జీవితాన్ని లాక్కొస్తుండేవాడు, ముగ్గురు పిల్లలు పుట్టిన తర్వాత భార్య చనిపోయింది అతని ఆరోగ్యం పూర్తిగా పాడైపోయింది. పిల్లలకి సరిగ్గా తిండికూడా పెట్టలేని పరిస్థితులు వచ్చాయి.

క్షుద్బాధని భరించలేక ఒకరోజు పిల్లలు వెళ్ళి ఓ పెళ్ళి దగ్గర పారేసిన ఎంగిలాకులలోని తిండితిని కడుపు నింపుకుంటుంటే అతని కడుపు చెరువైపోయింది. తన పిల్లలు ఇంత హీనస్థితికి దిగజారిపోయారా అని కంటికి మింటికి ఏకధారగా ఏడ్చాడు. ఆఖరుకి ఓ నిర్ణయానికి కొచ్చాడు.

"మీ అమ్మ గంగమ్మ దగ్గరవుంది. మనల్ని అందర్నీ రమ్మంది" అని పిల్లలతో చెప్పి అందర్నీ తీసుకుని తమవూరు చివర్న వుండే సముద్రంవేపు బయల్దేరాడు.

అలా అతను సముద్రంలోకి వెళుతుంటే పిల్లలు అతడిని అనుసరించసాగారు. అందరూ సముద్రంలో మునిగిపోయారు. తర్వాత నాల్గు శరీరాలు ఒడ్డుకి కొట్టుకువచ్చాయి. ముగ్గురు పిల్లలూ చనిపోయారు. అతను మాత్రం కొనవూపిరితో వున్నాడు. చికిత్స చేయించి, ముగ్గురు పిల్లల్ని చంపి, ఆత్మహత్య చేసుకోవడానికి ప్రయత్నించాడని యావజ్జీవకారాగార శిక్ష వేసారు. అప్పటినుండి అతను ఆత్మహత్య చేసుకుని చనిపోవాలనే ఆలోచిస్తున్నాడు.

అతని దయనీయగాథ విన్న తర్వాత నా మాటల్తో అతనిలో మార్పు తీసుకురావడానికి ఎంతో ప్రయత్నించాను.

6)

"చూడుబాబూ....నువ్వెంతో పాపం చేసావు క్రిందటి జన్మలో. అందుకనే ఇంత మానసిక వేదనకి గురవుతున్నావు. మళ్ళీ ఆత్మహత్యకు ప్రయత్నించి లాభంలేదు. నీ పాపం పరిహారమయ్యేవరకూ నీకు చావు కూడా రాదు అందుకే రెండుసార్లు నువ్వు ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించినా కుదరలేదు. కాబట్టి మంచిగా వుంటూ పాపాన్ని కొంత వరకయినా తగ్గించుకోలేకపోతే ఆ పాపం, యీ జీవితంలోని యీ పాపం కలుపుకొని ముందుజన్మలో మరీ కష్టాలు అనుభవిస్తావు. నీకు సుఖ, శాంతులే వుండవు. బ్రతికి వుండగానే ఏదైనా సాధించాలిగాని, చచ్చి ఏమి సాధిస్తావు. ఏ శాంతి నీకు కరువయ్యి ఆత్మహత్యకు తలపడ్డావో, వచ్చే జన్మలోనూ ఆ అశాంతే నిన్ను వెన్నాడుతుంది. నీవు నీ బిడ్డలకు చేసిన అన్యాయానికి పరిహారం నీవు చిన్న పిల్లలకు సేవచేయడమే. నీవు విడుదల అయిన తర్వాత నిన్ను చిన్నపిల్లల కేంద్రాలలో ఏదో వుద్యోగంలో పెడతాను"అంటూ అతనికి బోధించాను.

## రక్షకుడైన ఖైదీ

ఆ మాటల ఫలితం అతనిమీద కనిపించింది.

ఆ రోజునుండి అతను ఎంతో మంచిమనసుతో మసలుకోవడం ప్రారంభించాడు. క్రమంగా అతడిని కిచెన్‌లోని పనికి పంపాను. అక్కడ కత్తులుంటాయి. మళ్ళీ ఆత్మహత్యా ప్రయత్నం చేస్తాడేమోనని చాలా మంది భయపడ్డారు. కానీ మళ్ళీ అతను అట్లాంటి ప్రయత్నం చెయ్యలేదు తర్వాత ముసలి ఖైదీలకు రక్షకుడిగా అతడిని వుంచాము. ఇలా క్రమంగా అతనిలో ఎంతో మార్పు వచ్చింది.

"నువ్విలా మంచిగా వున్నావంటే శిక్ష తగ్గిపోతుంది. ఆ తర్వాత నీకు సర్టిఫైడ్ స్కూల్లో ఏ వంటవాడిగానో వుద్యోగం ఇప్పిస్తాను. అప్పుడు నీకు రెండువందల మందికి పైగా పిల్లలున్నట్లు!" అని కూడా అతడిని వూరించాను.

ఆ ఆశతో ఇప్పుడు రాజమండ్రి జైలులో శిక్షను మంచి ప్రవర్తనతో పూర్తి చేస్తున్నాడు" అంటూ ఆ కేసుగురించి చెప్పడం ముగించాడు.

జైలు అధికారులు సైకాలజీని బాగా స్టడీ చేయగల నేర్పరులయితేనే ఇట్లాంటి ఖైదీలలో మార్పు తీసుకు రాగలుగుతారు.

మరో చక్కటి ఉదాహరణని కూడా వివరించారు సుబ్బారెడ్డిగారు.

## ప్రాణాలుతీసే నేరస్థునికి కుందేళ్ళ పెంపకం

రాజమండ్రి జైలులోకి ఏ మాత్రం బెరుకులేకుండా ప్రాణాల్ని సులభంగా తీసేయగల ఓ నేరస్థుడు వచ్చాడు. అతనిలో మార్పు తీసుకు రావడానికి నాల్గు కుందేలు పిల్లల్ని సంపాదించాను. వాటిని అతనికిచ్చి జాగ్రత్తగా పెంచమన్నాను.

ఆ రోజునుండి అతను ఎంతో ప్రేమతో వాటిని పెంచసాగాడు. వాటికి ఏమాత్రం బాగుండకపోయినా అతను అన్నంకూడా తినకుండా వైద్యం చేయించమని తీసుకొచ్చేవాడు. నువ్వు అన్నం తినిరా.... అన్నా కూడా తినివచ్చేవాడుకాడు. అలా అతనికి ఆ కుందేళ్ళతో అటాచ్‌మెంట్ పెరిగిపోయింది.

ఒకరోజు అతడిని పిలిపించి "ఆ కుందేళ్ళని చంపేయమంటావా?" అని అడిగాను.

"వద్దుసార్...." అంటూ అతను బిక్కమొహం వేసాడు.

"నువ్వు పెంచిన కుందేళ్ళను చంపుతానంటేనే ఇంతగా బెంబేలు పడిపోతున్నావుకదా! మరి మనుషుల్ని చంపితే వాళ్ళ తాలూకువాళ్ళు ఎంత బాధపడతారు?" అని సూటిగా అతడిని అడిగాను. ఇబ్బందిపడిపోయాడు.

"నేనుగతంలో చాలాపొరపాట్లు చేసానుసార్" అంటూ బావురుమన్నాడు.

అలా అతనిలో మార్పు తీసుకొచ్చాను.

వడుపువృత్తి చేసుకుంటూ జైలుకొచ్చిన ఎందరోన్నికూడా సుబ్బారెడ్డిగారు ఓ ఒడ్డుకి చేర్చారు.

వేశ్యావృత్తిచేస్తూ పట్టుబడి జైలుకి వచ్చిన వాళ్ళ వివరాల్ని పూర్తిగా సేకరించి ఇళ్ళకి వుత్తరాలు రాయించేవారు. విడుదల కాగానే కంపెనీల తాలూకువాళ్ళు వాళ్ళని తీసుకుపోవడానికి వస్తే వాళ్ళని వెళ్ళగొట్టి, తల్లిదండ్రులకో భర్తకో నచ్చజెప్పి ఆ ఆడపిల్లని అప్పగించేవారు.

## చదువుంటే రహస్యం బయటికి పొక్కదు

ఒకసారి ఓ ఖైదీకి వుత్తరం వచ్చింది.

కానీ ఆ ఖైదీకి చదవడంరాదు.

ఎవరితోనో చదివించుకుని విన్నాడు.

ఇంకేముంది? క్షణాల్లో ఆవార్త జైలంతా పొక్కిపోయింది. అందరూ భార్య లేచిపోయిందని అతడిని గేలిచేయసాగారు.

ఈ సంఘటనకి. బాధపడ్డ సుబ్బారెడ్డిగారు దీనిద్వారా ఖైదీలలో కొందరికయినా చక్కటి గుణపాఠాన్ని చెప్పాలనుకున్నారు.

వెంటనే అందర్నీ సమావేశపరచి "చూసారా ఇతనికి చదువు రాకపోవడంతో ఈ వుత్తరాన్ని మరొకడితో చదివించుకున్నాడు కాబట్టి ఇలా నల్గురికీ చులకనయ్యాడు. అతనికే చదువు వచ్చివుంటే ఈ రహస్యం బయటికి పొక్కేదికాదుగదా?" అన్నారుట సుబ్బారెడ్డిగారు.

అంతే! మర్నాటినుండి వయోజనవిద్యా తరగతిలో సంఖ్య పెరిగిపోయింతంట. అంటే అందరూ చదువుకోవాలనే వుత్సాహాన్ని చూపించడం ప్రారంభించారన్నమాట!

ఇలాంటి సంఘటనలు సుబ్బారెడ్డిగారి సర్వీసులో ఎన్నో! ఖైదీలకు ఇన్ని సేవలు చేస్తున్న ఆయనకు కృతజ్ఞతలుచెప్పి మరోసారి మళ్ళీ కలుస్తానని శలవు తీసుకోవడం జరిగింది.

# నేరస్థుల సంస్కరణలో ప్రొబేషన్ విభాగం

జైళ్ళలో వెల్ఫేర్ ఆఫీసర్లకి చాలా ప్రాముఖ్యం వుంది. ఖైదీలు తమ సాధక బాధలను వాళ్ళకే చెబుతారు. శ్రద్ధగావిని అవసరమైన సాయాన్ని అందచేస్తారు వెల్ఫేర్ ఆఫీసర్లు. ఖైదీలకు లోపల ఏదైనా అసౌక్యరంగా అనిపించినా, ఇంటిదగ్గరునుండి వుత్తరాలు రాకపోయినా, జైలులో తాను కష్టపడితే వచ్చిన డబ్బుని ఏ ముసలితల్లికో పంపాలను కున్నా, పెరోల్ కోఫర్లోకో అప్లయ్ చేసుకోవాలనుకున్నా—ఖైదీలు అడి గేది వెల్ఫేర్ ఆఫీసర్లనే!

వెల్ఫేర్ ఆఫీసర్లు కూడా ఎంతో ఉదాత్త హృదయంతో ఖైదీలకు అండగా నిలుస్తారు భయంకరంగా మర్డర్చేసి హైద్రాబాద్ సెంట్రల్ జైలు కొచ్చిన ఓ ఖైదీ ఈ మధ్య చాలా దిగులు పడిపోయాడు. అతడిని చూడడానికి చుట్టాలెవ్వరూ రావడంలేదు. ఆఖరికి తల్లికూడా! ఆ బాధని అతను వెల్ఫేర్ ఆఫీసర్ శ్రీ రామ్గోపాల్ దగ్గర వెళ్ళబోసుకున్నాడు. ఒక్కసారి వచ్చి మీవాడ్ని చూసి వెళ్ళమని వెల్ఫేర్ ఆఫీసర్ వుత్తరాలు, ఫోను ద్వారా వార్తలను అతని తల్లికి అందజేసినా ఆమె రాలేదు. కనీసం జవాబియ్యలేదు. ఆ ఖైదీ క్రుంగిపోసాగాడు.

సూపరింటేండెంట్ శ్రీ జోషిగారుకూడా చెప్పడంతో వెల్ఫేర్ ఆఫీసర్ రామ్గోపాల్ ఆ ఖైదీ ఇంటికి వెళ్ళి, కొన్ని గంటలపాటు అతని తల్లికి నచ్చజెప్పి ఆఖరికి ఆమెను జైలుకి తీసుకొచ్చాడు. తల్లిని చూడ గానే ఖైదీ కొద్దిగా కుదుటపడ్డాడు. ఆమెకు కూడా కొడుకంటే భయం కొంచెం తగ్గింది. ఇలా ఆ తల్లి కొడుకులమధ్య పెరుగుతున్న దూరాన్ని ఆపడమే కాకుండా దగ్గరవడానికి కూడా బీజం వేశారు. శ్రీ రామ్గోపాల్. ఇలాంటి సంఘటనలు అతని సర్వీసులో ఎన్నో!

సికింద్రాబాద్ జైలు వెల్ఫేర్ ఆఫీసర్ శ్రీ నారాయణరెడ్డి పని తీరుని కూడా గమనించింది స్వాతి, ఓర్పుతో సికింద్రాబాద్ "డిస్ట్రిక్ట్ జైలు" మౌలాలి ఓపెన్ ఎయిర్‌జైల్ ఖైదీలనందరినీ సమర్థించుకొస్తున్నారాయన. ఇంతకుముందు ప్రొబేషన్ ఆఫీసరుగా పని చేసారాయన, వెల్ఫేర్ ఆఫీసర్లు జైలులో వున్నప్పుడు ఖైదీల బాగోగులను గమనిస్తే బయటికి వెళ్ళిన తర్వాత వాళ్ళకి ప్రొబేషన్ ఆఫీసర్లు అండగా నిలుస్తారు. ప్రొబేషన్ ఆఫీసర్‌గా తనకు ఎదురైన ఓ వింత అనుభవాన్ని వివరించారు శ్రీ నారాయణరెడ్డి.

ఒకసారి ఒక ఖైదీని శలవులో ఇంటికి పంపమనికి సొంత వాళ్ళందరూ సూరిటి ఇవ్వడానికి దడిసారు. అతను తిరిగొస్తే మళ్ళీ ఎవరినయినా చంపుతాడని వాళ్ళభయం. మానసికంగా నలిగిపోయే ఖైదీకి సొంతవాళ్ళు ఇంటికి రావడానికి కూడా ఇష్టపడలేదంటే మరింత బాధపడతారు. అందుకని ఈ విషయం ఎలా తెలియజెయ్యాలా అని ఆలోచిస్తున్న ప్రొబేషన్ ఆఫీసర్‌కి మరో రూపంలో కనిపించిన కొందరు వ్యక్తులు ఆ ఖైదీకి సూరిటి ఇవ్వడానికి ముందుకొచ్చారు.

"ఖైదీ గురించి తెలిసు కూడా తెలీకుండా సూరిటీ ఇవ్వడానికి ఎందుకు మీరు ముందుకు వస్తున్నారు?" అని వాళ్ళను అడిగారాయన.

"మేమూ కొన్నాళ్ళు జైలులో వుండి వచ్చాము. జైలులో వుండేవాడి మనస్తత్వం మాకు తెలుసు. సంవత్సరాలకొద్దీ శిక్షని అనుభవిస్తున్న వాళ్ళకి ఇంటికి శలవులో వెళ్ళిరావడం పెద్ద పండుగ. అలా 2,3 సంవత్సరాల కొకసారయినా కొన్నిరోజుల పాటయినా తనవాళ్ళ మధ్య గడిపితేనే మిగతా రోజులు ఏదో ఒక ఆశతో జైలులో గడపగలడు" అన్నారు.

వాళ్ళ సాయంతోనే ఆ ఖైదీ ఇంటికివచ్చి వెళ్ళాడు. మారిన అతని ప్రవర్తనని ఇంట్లో వాళ్ళు గుర్తించారు. ఇలా ఆ ఖైదీ వాళ్ళ వాళ్ళకి దూరం కాకుండా ఆ పాత ఖైదీలు ఆదుకున్నారు. అంటూ తమ అనుభవాల్ని చెప్పారు నారాయణరెడ్డి.

ప్రొబేషన్ విభాగం పాత్ర ఎంతో పవిత్రమైనది. సెంట్రల్ ప్రొబేషన్ ఆఫ్ అఫెండర్స్ యాక్ట్ 1958లో ప్రవేశపెట్టారు. నేరస్థుల్ని సన్మార్గులుగా తీర్చిదిద్దడానికి ఇది ఎంతో సహకరిస్తోంది. శిక్షలేకుండా నేరస్థుల్ని సంస్కరించే విభాగం ఇది.

మన రాష్ట్రాన్ని ఏడు రీజియన్లుగా విభజించారు. ఏడు రీజియన్లకి ఏడుగురు రీజినల్ ఇన్‌స్పెక్టర్లు వుంటారు. ఒక్కో రీజియన్‌కి 4 లేక 5 జిల్లాలు వుంటాయి. వాళ్ళ అధీనంలో జిల్లా ప్రొబేషన్ ఆఫీసర్లు వుంటారు.

హత్యకాకుండా మిగతా నేరాలు చేసిన 21 సం॥లోపు పిల్లల్ని శిక్ష అనుభవించ కుండా సంస్కరించడానికి ప్రొబేషన్ ఆఫ్ అఫెండర్స్ యాక్ట్ అమలులోకి వచ్చింది. ఈ యాక్టుద్వారా శిక్షనుండి బయటపడిన పిల్లలను సంస్కరించడం ప్రొబేషన్ ఆఫీసర్ల ముఖ్య కర్తవ్యం.

ఏ నేరస్థుడయినా రెండు సంవత్సరములు, అంతకులోపు శిక్షపడి, అతను అంతకు ముందు ఏ నేరం చేయకుండా వుండి ఇప్పుడు చేసిన నేరాన్ని తప్పుకుని పశ్చాత్తాప పడుతుంటే అతడిని శిక్షవేసి జైలుకిపంపకుండా "ప్రొబేషన్"లో విడిచిపెట్టవచ్చు. ఈ కాలంలో ప్రొబేషన్ ఆఫీసర్ అతడిని గమనిస్తుంటాడు.

శిక్షపడితే ఆ వ్యక్తి జీవనానికి ఎన్నో అవరోధాలు వస్తాయి. ఉద్యోగం కూడా పోవచ్చు. అందుకని ఈ బాధలు భరించకుండా అతనిలో మార్పు తెచ్చుకోవడానికి ప్రొబేషన్ సహకరిస్తుంది.

హైద్రాబాద్ రీజియన్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ ప్రొబేషన్ శ్రీ కె. వి. రమణారావు మాట్లాడుతూ శిక్ష విధించేముందు నేరస్థుల పూర్వాపరాలను సేకరించమని న్యాయాధిపతి ప్రొబేషన్ ఆఫీసరుని అడుగుతారు. ప్రొబేషన్ ఆఫీసర్లు న్యాయాధిపతి చెప్పిన టైమ్‌లోపల ఆ వివరాల్ని సేకరించి రిపోర్ట్ తయారుచేసి ఇస్తారు. ఈ వివరాలు నేరస్థుడి సంస్కరణకి సర

యిన శిక్ష విధించడానికి ఎంతో సహకరిస్తాయి. ఒక్కోసారి ప్రొబేషన్ ఆఫీసర్ల రికమండేషన్‌తో కొందరు నేరస్థుల్ని శిక్షలేకుండా విడిచిపెడతారు. కానీ కొంతకాలం ప్రొబేషన్ ఆఫీసర్ల నిర్దేశకత్వంలో వుండాలని న్యాయాధిపతులు ఆదేశిస్తారు. ఆ కాలంలో వాళ్ళని గమనిస్తూ సంస్కరించే బాధ్యత ప్రొబేషన్ ఆఫీసర్లదే.

ఈ ప్రొబేషనర్లని ప్రొబేషన్ ఆఫీసర్లు నెలకోసారయినా కలుసుకుని పరిస్థితి గమనించి సలహాలిస్తుంటాలి. ప్రోగ్రెస్‌తో మంత్లీ రిపోర్టుని రీజినల్ ఇన్‌స్పెక్టర్ తగిన సలహాలిస్తాడు. ప్రతి ఆరునెలలకి రీజనల్ ఇన్‌స్పెక్టర్ తన ఆధీనంలోవున్న ప్రొబేషన్ ఆఫీసర్లనితనిఖీచేస్తుంటాడు. అడ్వయిజర్స్‌బోర్డు సలహాతో శిక్ష పూర్తికాకుండా విడుదలైన ఖైదీలు, సర్టిఫైడ్ స్కూల్ విద్యార్థుల బాగోగులను చూడాల్సిన బాధ్యతకూడా ప్రొబేషన్ ఆఫీసర్లమీదే వుంటుంది. ముందు కోర్టు ఎంక్వైరీస్‌కి ప్రిఫరెన్స్ ఇవ్వాలి" అంటూ ప్రొబేషన్ ఆఫీసర్లు, రీజనల్ ఇన్‌స్పెక్టర్ల పనితీరుని వివరించారు.

రంగారెడ్డి, మెదక్, నల్గొండ, మహబూబ్ నగర్, నిజామాబాద్ జిల్లాలకు రీజనల్ ఇన్‌స్పెక్టర్ మక్బూల్ అహ్మద్‌గారు నేరస్థులని సత్ప్రవర్తనవేపు మళ్ళించడమే కాకుండా విడుదలయిన ఖైదీల పునరావాసానికి మాశాఖ ఎంతో కృషి చేస్తోంది. అవసరమనిపించిన వాళ్ళ పునరావాసానికి మెటీరియల్ అసిస్టెన్స్ అంటూ ప్రభుత్వం మా శాఖ ద్వారా కొంత ధన సహాయాన్ని అందిస్తోంది. కలెక్టర్‌గారు చైర్మన్‌గా ప్రతీ ఆరు నెలలకి ఓ సారి జిల్లా ప్రొబేషన్ సలహామండలి సమావేశమై ప్రొబేషన్ ఆఫీసర్ల పర్యవేక్షణలో వున్నవారందరి పరిస్థితుల్ని గమనించి, వాళ్ళలో బాగా అవసరమనుకున్న వాళ్ళకి తగిన సాయం లభించేలా చూస్తారు. వ్యవసాయం చేసుకునే వాళ్ళకి ఎడ్లుబండి ఏదైనా చిన్న వ్యాపారాలు పెట్టుకోదల్చుకున్నవాళ్ళకి ఆ చిన్న వ్యాపారానికి తగ్గ పెట్టుబడి,

ఇల్లు, అవసరమైతే అది కట్టుకోడానికి డబ్బు బాంకు నుంచి అప్పుగా ఇప్పిస్తాము. తర్వాత నెమ్మదిగా ఈ అప్పుని తీర్చుకోవచ్చు" అన్నారు.

"ఒకసారి ఒక ఖైదీని శలవులో పంపవద్దు. ఇంటివద్ద అతనికి పరిస్థితులు వ్యతిరేకంగా వున్నాయి. అంటూ జైలు సూపరింటెండెంట్‌కి నేను రాసాను. కాని పోలీసులు పంపవచ్చన్నారు. నా రిపోర్టుకన్నా ఆ రిపోర్టుకి ఎక్కువ విలువనిచ్చి ఆ ఖైదీని శలవులో ఇంటికి పంపారు. నేనూహించినట్లే వ్యతిరేకవర్గంవారు అతడిని చంపడానికి గొడవచేసారు" అంటూ తన అనుభవాన్ని చెబుతూ జిల్లా ప్రొబేషన్ ఆఫీసర్ సొభద్రా రెడ్డి "మేము సివిల్ డ్రస్‌లో వెళతాము కాబట్టి ఎక్కువ వివరాల్ని సేకరించడానికి అవకాశముంటుంది" అన్నారు. మొదటిసారి నేరం చేసిన వాళ్ళని కొందరిని శిక్షపడకుండా ఆపించి తిరిగి నేరం చేయకుండా సంస్కరించానని కూడా ఆయన అన్నారు. శిక్ష పడకుండా చూడటంవల్ల వాళ్ళ ఉద్యోగాలు పోలేదట!

"21సం లోపు వాళ్ళకి శిక్ష వేసేముందు మేజిస్ట్రేట్ తప్పక మా సలహా తీసుకోవాలి. మేము పూర్తి పరిస్థితుల్ని విచారించి చెబుతాము. అలా మా సలహా తీసుకోకుండా 21సం. లోపు కుర్రాళ్ళకి శిక్షవేసే మేము ప్రొబేషన్‌యాక్ట్ ప్రకారం పైకోర్టుకి అప్పీలు చెయవచ్చు. తర్వాత ప్రొబేషనర్ల మీద ఎటువంటి యాక్షన్ తీసుకోవాలన్నా పోలీసువాళ్ళు జిల్లా ప్రొబేషన్ ఆఫీసర్‌కి తెలియజెయ్యాల్సిన అవసరముంది. జైళ్ళకి తరచు వెళ్ళి చూసి ఖైదీ వివరాలని ప్రొబేషన్ ఆఫీసరు తెలుసుకుంటూవుంటారు" అంటారు మరో ప్రొబేషన్ ఆఫీసర్ శ్రీ సొద్దిఖి.

మహ్మద్ అన్వరుల్లాఖాన్ కూడా ప్రొబేషన్ ఆఫీసరే "పిల్లల్ని దత్తత తీసుకోవడానికి కూడా మేము ఎంతో సహకరిస్తాము. పిల్లల స్కూళ్ళనుండి దత్తత ఇవ్వడానికి ముందు దత్తత తీసుకోదల్చుకున్నవారి పరిస్థితులగురించి క్షుణ్ణంగా తెలుసుకుంటాము. ఆర్థికంగా పర్వాలేదను

కున్నప్పుడే దత్తత కివ్వడానికి మేము అంగీకరిస్తాము. దత్తత ఇచ్చినే తర్వాత కూడా కొన్నాళ్ళు వాళ్ళ అనుబంధాన్ని మేము గమనిస్తాము" అన్నారు ఖాన్.

"తప్పిపోయిన పిల్లల్ని తల్లిదండ్రులకి చేర్చడంలో కూడా మేము సహకరిస్తాము. ఈ మధ్య ఓ కుర్రాడు విజయవాడ నుండి ట్రయిన్‌లో సికింద్రాబాదు వచ్చి ప్లాటుఫారమ్ మీద పొట్లు పడుతుంటే పోలీసులు పట్టుకొచ్చారు. తండ్రి ముందు బండిలో వస్తే వెనుకబండిలో హైదరాబాద్ వచ్చి దారి తెలిక అతను బాధపడ్డాడని గమనించి రామ్‌నగర్ మొదలయిన ప్రదేశాలు గాలించి ఆఖరికి ఎట్లాగయితేనేమి వాళ్ళవాళ్ళ దగ్గరకి అతడిని చేర్చగలిగాను" అన్నారు ఉమామహేశ్వర్ అనే ప్రొబేషనరీ ఆఫీసర్.

పుట్టుకతో ఎవరూ దుర్మార్గులుకారు. కొన్ని కారణాలవల్ల వాళ్ళు నేరాన్ని చేసారు. కాబట్టి వాళ్ళని సంస్కరించ వచ్చునే ఉద్దేశంతో వాళ్ళ జీవితాలలో నేరంవల్ల ఎటువంటి మచ్చ ఏర్పడకుండా వుండడానికి ప్రొబేషన్ సర్వీస్ వచ్చింది.

## రాష్ట్ర సంస్కరణాల పరిపాలన శిక్షణా సంస్థ

మొట్టమొదట్లో నేరస్థుల్ని శిబిరాలలో వుంచి వాళ్ళతో ప్రజలకి ఉపయోగపడే పనులని చేయించేవారు. నేరస్థుల్ని చాలా క్రూరంగా శిక్షించేవాళ్ళు, కొద్దిపాటి అస్వస్థులయినా వాళ్ళతో నిర్దాక్షిణ్యంగా పనులు చేయించేవాళ్ళు. వాళ్ళ శిబిరాల చుట్టూ ఆరోగ్యకర పరిస్థితులుండేవికావు.

అందుకే ఒకసారి నేరం చేసి పట్టుబడి ఆ శిబిరాలలోకి వెళ్ళినవాడు తిరిగి ఆరోగ్యంతో బయటికి వస్తాడనే నమ్మకముండేదికాదు.

ఈస్టిండియాకంపెనీ డైరెక్టర్లకి మనదేశ జైళ్ళమీద డబ్బు ఖర్చు పెట్టడానికి ఇష్టం ఉండేదికాదు.కానీ లార్డ్ మెకాలే 1836లో ఒక కమిటీని వేసి జైళ్ళ పరిస్థితిని పరీక్షించి కొత్త సెంట్రల్ ప్రిజన్స్ ఏర్పాటు చేశాడు. మొదటిది ఆగ్రాలో 1846లో కట్టారు. 1844 మొదట ఇనస్పెక్టర్ జనరల్‌ని నార్త్ వెస్టర్న్ ప్రావిన్స్‌కి అపాయింట్ చేశారు. 1870 నుండి జైళ్ళకి సూపరింటెండెంట్, జైలర్, డాక్టర్ మొదలయిన ఉద్యోగుల్ని నియమించసాగారు.

జైళ్ళలోని పరిస్థితుల్ని మెరుగు పర్చడానికి 1919లో అలెగ్జాండర్ కార్డియో ఆధ్వర్యంలో ముఖ్యమైన అఖిలభారత చెరసాలల సంస్కరణల పునరాలోచన సభ ఏర్పడింది.

ఈ సభ శిబిరాలలో వుంచి నేరస్థులతో చేయించే పనులని ఆపమని సలహాఇచ్చింది. అలాగే నేరస్థులని ఉంచడానికి ప్రత్యేక జైళ్ళని నిర్మించాలనీ కోరింది. ఆ జైళ్ళు నేరస్థుల్ని సంస్కరించేవిగా వుండాలిగాని శిక్షించేవిగా వుండకూడదు. సరయిన శిక్షణని పొందిన వాళ్ళనే నేరస్థులకు పరిరక్షకులుగా వుంచాలని అనికూడా ఈ జైళ్ళ సంస్కరణల సభ సూచించింది. నేరస్థులని వాళ్ళ నేరాలనిబట్టి విడివిడిగా వుంచాల్సిన అవసరం ఎంతయినా వుందని కూడా ఈ సభ అభిప్రాయపడింది. ఇలాంటి చక్కటి సలహాలని ఇచ్చి మన దేశంలోని జైళ్ళ పరిస్థితి మెరుగుపడడానికి శ్రీకారం చుట్టింది అలెగ్జాండర్ కార్డియో ఆధ్వర్యంలో జైళ్ళ పరిస్థితిని సమీక్షించిన జైళ్ళ సంస్కరణల సభ. కానీ, .కొన్ని కారణాలవల్ల ఈ కార్యక్రమాలన్నింటినీ వెంటనే చేపట్టలేకపోయారు.

స్వాతంత్ర పోరాటంలో ఎందరో నాయకులు జైళ్ళలో మ్రగ్గారు. దానితో వాళ్ళందరికి జైళ్ళలోని అసలు పరిస్థితులు పూర్తిగా అవగత

మయ్యాయి. అందుకనే అందరూ జైళ్ళని సంస్కరించాల్సిన అవసరం వుందని నొక్కి వక్కాణించారు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతే ఖచ్చితమైన జైళ్ళ సంస్కరణ మనదేశంలో జరిగిందని చెప్పాలి.

1951లో అమెరికాకి చెందిన నిపుణులు శ్రీ డబ్ల్యు.సి. రెక్‌లెస్‌ని భారత ప్రభుత్వం మనదేశంలో వున్న జైళ్ళ పరిస్థితుల్ని పరిశీలించడానికి రమ్మనికోరింది. ఆయన ఆధ్వర్యంలో బొంబాయిలో జైళ్ళ విభాగాలకి చెందిన అందరు ఇన్‌స్పెక్టర్ జనరల్స్‌కి ఓ శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు. మొదటి శిక్షణా శిబిరం జరిగింది 1952లో. ఆల్ ఇండియా జైల్ మన్యువల్ కమిటీ నొకదానిని స్థాపించి దాని సాయంతో దేశంలోని జైళ్ళ పరిస్థితులన్నింటినీ పరిశీలించడం అవసరం అని చెప్పారు రెక్‌లెస్. ఆ తర్వాత ఆల్ ఇండియా జైల్ మాన్యువల్ కమిటి 1957లో ఏర్పాటయింది. ఈ కమిటీ ఎన్నో సంస్కరణాలని సూచించింది ప్రొబేషన్ విధానం ద్వారా నేరస్థుల్ని సంస్కరించే పద్ధతుల్ని వుధృతం చెయ్యాలని, నేరస్థుల్ని సంస్కరించడానికి శిక్షణ పొందినవారినే నియమించాలని, ఈ కరక్షనల్ సర్వీసెస్‌కి సమన్వయ సంస్థగా ఢిల్లీలో సెంట్రల్ బ్యూరోని స్థాపించాలని, నేరస్థులు విడుదలయిన తర్వాత కూడా వాళ్ళ బాగోగులను కొంతకాలం చూడటానికి "ఆఫ్టర్ కేర్ ఆర్గనైజేషన్స్" వుండాలని ఈ మాన్యువల్ కమిటీ సూచించింది.

ఈ సలహాలమేరకు 1961లో ఢిల్లీలో సెంట్రల్ బ్యూరో ఆఫ్ రెక్షనల్ సర్వీసెస్" స్థాపించబడింది. ఆ తర్వాత దీనిపేరు "నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ డిఫెన్స్"గా మార్చారు.

1957లో జైల్ మాన్యువల్ కమిటీ సూచించిన వాటన్నింటినీ ఆచరణలో పెట్టడానికి 1972లో వర్కింగ్ గ్రూప్ ఏర్పాటయింది. ఈ కమిటీ కూడా జైళ్ళలో పనిచేసేవారికి సరయిన శిక్షణఇచ్చే పాఠశాలల అవసరం

ఎంతో వుందని నమ్మింది. అన్ని రాష్ట్రాలలోను అటువంటి శిక్షణాలయా లను స్థాపించాలని సూచించింది. పోలసీ నిర్ణయాలని తీసుకునేవాళ్ళ దగ్గర నుండి వాటిని ఆచరణలో పెట్టే వార్డెర్ల వరకూ శిక్షణ కావాలి అని ఈ గ్రూప్ సలహా ఇచ్చింది. అప్పుడే 'నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ డిఫెన్స్' ప్రారంభమైంది.

ఈ సిఫార్సులతోనే 1979లో ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఒక జైల్ ట్రెయినింగ్ స్కూల్ ప్రారంభమైంది. ఒక జైలర్ ఆధ్వర్యంలో నిర్వ హించే ఈ స్కూల్‌లో నెలకి 25మంది వార్డర్లకి శిక్షణ ఇచ్చేవారు. ఈ ఈ జైలరే వాళ్ళకి అన్నిరకాల శిక్షణనీ ఇచ్చేవాడు.



వార్డర్లకి ప్రత్యేక శిక్షణ వుంటుంది

1983లో జస్టిస్ ముల్లా ఆధ్వర్యంలోని జైల్ రిఫారమ్స్ కమిటీ రీజ నల్ ఇనిస్టిట్యూట్స్ ఆఫ్ కరక్షనల్ అడ్మినిస్ట్రేషన్‌తోపాటు ప్రతీ రాష్ట్రంలోను స్టేట్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కరక్షనల్ అడ్మినిస్ట్రేషన్‌ని కూడా ప్రారంభించాలని సూచించింది. ఈ సిఫార్సులోనే మనరాష్ట్రంలో హైదరా బాద్‌లో 'స్టేట్' ఇనిస్టిట్యూట్ ఆఫ్ కరక్షనల్ అడ్మినిస్టేషన్ (సికా)

1984లో ప్రారంభమైంది. అంతకుముందు అప్పుడుకూడా డెప్యూటీ జైలర్ పై ర్యాంక్ ఆఫీసర్లకు వెల్లూరులోని రీజినల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కరెక్షనల్ అడ్మినిస్ట్రేషన్'లో శిక్షణ ఇస్తున్నారు. ఆంధ్ర, మద్రాసు, కర్నాటక, కేరళ రాష్ట్ర జైలు అధికారుల శిక్షణకోసం ఏర్పాటయిన రీజనల్ కేంద్రం ఇది.

మనరాష్ట్రంలో డెప్యూటీజైలర్, అంతకు తక్కువస్థాయి ఉద్యోగస్థులకు 'సీకా'లో శిక్షణ ఇస్తున్నారు. క్రొత్తగా చేర్చుకున్నవాళ్ళు ఇక్కడ శిక్షణ పూర్తిచేసుకున్న తర్వాతే డ్యూటీలో జాయిన్ అయ్యేది! అలాగే ఇంతకుముందే అపాయింటై శిక్షణ పొందని వారందరుకూడా ఈ కేంద్రంలో తప్పక శిక్షణ పొందాలి. అంతేకాకుండా రిఫ్రెషర్ కోర్సులనుకూడా 'సీకా' నిర్వహిస్తోంది.

'సీకా' ప్రిన్సిపాల్ శ్రీ క్రిష్టోఫర్. ఈయన జైలు అధికారిగా విశేషానుభవాన్ని గడించారు. జైలులో పనిచేసే ఉద్యోగస్థులకు ఎటువంటి శిక్షణ అవసరమో ఈయనకి క్షుణ్ణంగా తెలుసు. అందుకే ఈయన నిర్వహణలో 'సీకా' ఎందరో ఉద్యోగులకు చక్కటి శిక్షణనిస్తోంది.

'సీకా' గురించి స్వాతి పాఠకులకు వివరించమని ఆయనని అడిగాను.

"ముందుగా స్వాతికి నా ప్రత్యేక అభినందలు. ఎందుకనంటే అన్ని పత్రికలు నేరస్థుడు నేరాన్ని ఎలా, ఎందుకుచేసాడు. అతనికి ఎటువంటి శిక్షపడింది అనే విషయాలమీద మాత్రమే ఉత్సాహాన్ని చూపిస్తున్నాయి. ఆ వివరాల్ని ప్రచురిస్తున్నాయి కానీ స్వాతి మరో అడుగు ముందుకేసి ఆ నేరస్థుల్ని సంస్కరించడానికి మ జైళ్ళ విభాగం ఎటువంటి కార్యక్రమాల్ని చేబడుతుందో పాఠకులకు చక్కగా వివరిస్తోంది. ఇది చాలా అభినందించతగ్గ విషయం...."

"నేరస్థుల్ని సంస్కరించడమనేది గురుతరమైన బాధ్యత. దీన్ని

సక్రమమైన మార్గంలో నిర్వహించడానికి సరయిన శిక్షణ ఎంతో అవసరం. డెప్యూటి జైలర్ అంతకు క్రిందస్థాయి ఉద్యోగస్థులకు మేము ఇక్కడ శిక్షణ ఇస్తున్నాము. ఉద్యోగంలోకి చేరగానే ఉద్యోగస్థులందరికీ తొమ్మిది నెలలపాటు ఈ శిక్షణని ఇస్తున్నాము. తర్వాత మూడు నెలల పాటు సెంట్రల్ జైళ్ళలో ప్రాక్టికల్ ట్రయినింగ్ ఇస్తాము. ఆల్రెడి సర్వీసులోవున్న వాళ్ళకయితే ఆరు నెలల శిక్షణచాలు."

"తమ బాధ్యతలు ఏమిటి? ఆ బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించడానికి ఎలా మెలగాలి? మొదలయినవి వివరించడంతోపాటు వ్యక్తిగత సామర్థ్యాన్ని పెంచడానికి ఈ ట్రయినింగ్ తోడ్పడుతుంది."

"ఈ ట్రయినింగ్ పీరియడ్‌లో అందరూ ఇక్కడ హాస్టల్‌లోనే వుండాలి. మెస్ వాళ్ళచేతే నిర్వహించబడుతుంది. ట్రయినింగ్ పీరియడ్‌లో లాడ్జింగ్, బోర్డింగ్ ఉచితము. వీళ్ళు ఇండోర్, అవుట్‌డోర్ గేమ్స్ ఆడుకోవడానికి వీలుంది.

"ట్రయినింగ్ కాలములో స్టాఫ్‌తోనే కాకుండా అనేకమంది అనుభవజ్ఞులతోకూడా రకరకాల సబ్జక్టులమీద లెక్చర్లు ఇప్పిస్తారు. విషయ పరిజ్ఞానం పెంపొందించుకోడానికి ఈ లెక్చర్లు ఎంతో తోడ్పడతాయి. ఆడియో విజ్యువల్ ఎయిడ్స్‌ద్వారాకూడా బోధిస్తుంటాము. చర్చలని నిర్వహిస్తుంటాము. జైళ్ళకి సంబంధించిన న్యాయశాస్త్రము, ఆ జైళ్ళ నిర్వహణా పద్ధతులు, ఖైదీల మనస్తత్వం మొదలయిన వాటితోపాటు ఫిజికల్ ట్రయినింగు, ఆర్మ్స్‌డ్రిల్లులోకూడా శిక్షణ ఇస్తాము. 60% మార్కులు వచ్చిన వాళ్ళే పాసైనట్లు. లేకపోతే శిక్షణాకాలం పెంచుతాం. పూర్తిశిక్షణ పూర్తయిన తర్వాతే వాళ్ళని విధులకు పంపేది! మంచి మార్కులు సంపాదించిన వాళ్ళకి బహుమతులుంటాయి. ఇంతవరకూ మేము 22మంది క్రొత్తగాచేరిన డెప్యూటీ జైలర్లకు, 126మంది క్రొత్తగాచేరిన మగవార్డర్లకు, 9 మంది ఆడవార్డర్లకు శిక్షణ ఇచ్చాము. సంవత్సరానికి ఈ ట్రయినింగ్ ఇనిస్టిట్యూట్ నిర్వహణ ఖర్చు ఆరులక్షలు. రాష్ట్రప్రభు

త్వమే దీన్ని భరిస్తుంది. ట్రయినింగ్ ఇనిస్టిట్యూట్‌కి ప్రత్యేక భవన నిర్మాణానికి 17లక్షలు, అవసరమైన ట్రయినింగ్ ఎయిడ్స్ కొనడానికి 6లక్షలు కేంద్రప్రభుత్వము శాంక్షన్ చేసింది" అన్నారు ప్రిన్సిపాల్ క్రిష్టోఫర్ గారు.

'సీకా' కోసం ప్రత్యేక భవననిర్మాణం జరుగుతోంది. చక్కటి ఆడియో విజ్యువల్ ఎయిడ్స్‌తోపాటు అన్నిరకాల పుస్తకాలతోను చక్కటి లైబ్రరీకూడా వుంది "సీకా"లో.

శిక్షణపొందేవాళ్ళ మానసిక సామర్థ్యాన్ని పెంచడంతోపాటు శారీరక ఆరోగ్యాన్ని మెరుగుపరచడానికి "సీకా" నిర్వహిస్తున్న డ్రిల్ మొదలయినవాటిని స్వాతి చూసింది. నేరస్థుల సంస్కారణకి తోడ్పడే ఉద్యోగస్థులను తీర్చిదిద్దుతూ జైళ్ళ విభాగానికి సహకరిస్తున్న "సీకా"ని అభినందించకుండా వుండలేకపోతున్నాను.

# ఈనాటి బాలలు రేపటి నేరస్థులు కాకూడదు

చిన్నపిల్లలలోకూడా రకరకాల నేరాలు చేసేవాళ్ళున్నారు. ఇళ్ళలోనుండి పారిపోయివచ్చి రోడ్లమీద చెడ తిరుగుతుంటారు. ఇంకా కొంతమంది పిల్లలు చెప్పినమాట వినకుండా తలిదండ్రులనే పీడించేపిల్లలూ వున్నారు. ఇటువంటి పిల్లల్నందర్నీ సక్రమమైన మార్గంలోకి మళ్ళించడానికి ప్రభుత్వం సర్టిఫైడ్ స్కూళ్ళని ప్రారంభించింది. జైళ్ళ విభాగం నిర్వహణలోనే ఈస్కూళ్ళు వుంటాయి. పిల్లల్ని ముందు తీసుకురాగానే

రిమాండ్ హోమ్‌లో వుంచుతారు. ఆ తర్వాత వయసునిబట్టి జూనియర్ సర్టిఫైడ్ స్కూలుకో సీనియర్ సర్టిఫైడ్ స్కూలుకో, ఆడపిల్లలయితే గరల్స్ సర్టిఫైడ్ స్కూల్‌కి పంపుతారు. ఆడపిల్లలకి రిమాండ్‌హోమ్ కూడా వేరేగా వుంటుంది.

ఈ స్కూళ్ళనిర్వహణ బాధ్యతని చూసుకోవడానికి ప్రత్యేకంగా డెప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎన్. జి. రాజు వున్నారు ఆయనను కలుసుకుని ప్రొబేషన్ వింగ్‌లో సర్టిఫయిడ్‌స్కూళ్ళు, రిమాండ్‌హోమ్స్ గురించి వివరించమని అడిగాను.

చిన్న వయసులో సరయిన విచక్షణా జ్ఞానం లేకుండా కొంత మంది నేరాలు చేస్తుంటారు. వాళ్ళకి సరయిన క్రమశిక్షణ విద్యా బుద్ధులను గరిపితే సరయిన మార్గంలోకి వచ్చేస్తారు. మొక్కగా వున్నప్పుడు ఎటు వంచితే అటు వంగుతారు. అందుకని అటువంటి కుర్రాళ్ళను పట్టుకొచ్చి ముందు రిమాడ్ హోమ్‌లోవుంచి వాళ్ళ నేరాలను పరిస్థితులను విచారించి ఎన్నాళ్ళు సర్టిఫైడ్ స్కూల్‌లో వుంచాలో నిర్ణయిస్తారు న్యాయాధికారులు.

దానినిబట్టి సర్టిఫైడ్ స్కూళ్ళలో శిక్షణ ఇస్తారు. ఒక్క విషయం మీరు గమనించాలి ఈ సర్టిఫైడ్ స్కూళ్ళు శిక్షణా సంస్థలుగాని శిక్షా సంస్థలు కావు. వాళ్ళని సరయిన మార్గంలోకి మళ్ళించి, బ్రతుకు తెరువుకు మార్గాలని చూపిస్తాయి ఈ స్కూళ్ళు అందుకే. ఈ స్కూళ్ళలో వున్నా ముందుముందు ప్రభుత్వోద్యోగాలు చెయ్యడానికి ఎటువంటి ఆటంకంరాదు. అంటే సర్టిఫైడ్ స్కూళ్ళకి పంపేప్పుడు 2సం॥ తగ్గకుండా శిక్ష వేసి పంపుతారు.

"అతి చిన్న పిల్లలను కూడా సర్టిఫైడ్ స్కూళ్ళకి పంపవచ్చు. ఆరు సంవత్సరాల లోపయితే గరల్స్ సర్టిఫైడ్ స్కూల్లో వుంచుతారు. 7 నుండి 12సం॥ మధ్య జూనియర్ సర్టిఫైడ్ స్కూళ్ళలో వుంచుతారు.

12నుండి 16సం॥ మధ్య పిల్లల్ని సీనియర్ సర్టిఫైడ్ స్కూల్‌కి పంపిస్తారు. వాళ్ళకి 18సం॥ వచ్చేవరకు సీనియర్ సర్టిఫైడ్ స్కూల్‌లో వుండవచ్చు. సీనియర్ సర్టిఫైడ్ స్కూల్ మన రాష్ట్రంలో హైదరాబాద్ ఈది బజారులో వుంది. గరల్స్ సర్టిఫైడ్ స్కూల్ హైదరాబాద్ లోనే నింబోలి అడ్డలో వుంది. జూనియర్ సర్టిఫైడ్ స్కూల్ మాత్రం హైదరాబాద్, కడప, ఏలూరులలో వున్నాయి. రిమాండ్‌హోమ్స్ చాలాచోట్ల వున్నాయి. సంవత్సరానికి రెండు చొప్పున మొత్తం ఆరు రిమాండ్ హోమ్స్‌ని ప్రారంభించాలనే సంకల్పంలో మా డిపార్ట్‌మెంట్ వుంది. అలాగే మా డైరెక్టర్ జనరల్‌గారు మీకు చెప్పినట్లు జూనియర్ సర్టిఫైడ్ స్కూల్ నిర్మాణానికి నలభై లక్షల రూపాయలు శాంక్షన్ అయ్యాయి ...."అంటూ చెప్పారు రాజుగారు.

నేరాలు చేసిన పిల్లల్నే కాకుండా జువెనైల్ పోలీస్ బ్యూరోవాళ్ళు విచ్చలవిడిగా తిరుగుతున్న పిల్లలను పట్టుకొచ్చి జువెనైల్ కోర్ట్ ముందు హాజరు పరుస్తారు. మేజిస్ట్రేట్ ఆర్డర్ ప్రకారం విచారణ జరిగేంతవరకు ఈ పిల్లల్ని రిమాండ్ హోమ్‌లో వుంచుతారు. రిమాండ్ హోమ్‌లో వుండే ప్రొబేషన్ ఆఫీసర్ కుర్రవాడు వచ్చిన మూడు రోజులలోపు అతనితో మంచిగా మాట్లాడి వివరాలన్నింటినీ రాబడతాడు అంతేకాకుండా ఆ కుర్రాడు ఏ ప్రాంతంవాడో అక్కడి ప్రొబేషన్ ఆఫీసర్‌కి కూడా రాస్తారు. ఫలానా కుర్రాడి తాలూకు పూర్తి వివరాల్ని పంపమని, అలా రిమాండ్ హోమ్‌లోకి వచ్చిన కుర్రాడి చరిత్రను మొత్తం సేకరించి మేజిస్ట్రేట్ ముందు హాజరు పరుస్తారు.

అప్పుడు ఆ మేజిస్ట్రేట్ కుర్రాడు బాగుపడాలంటే ఏన్నాళ్ళు ఏ సర్టిఫైడ్ స్కూల్‌లో వుండాలో నిర్ణయించి ఆర్డర్ జారీ చేస్తారు. కుర్రాడి ప్రవర్తనలో మార్పు తీసుకురావాలంటే కనీసం రెండు సంవత్సరాల కాలమైనా వుండాలనే వుద్దేశంతో సర్టిఫైడ్ స్కూల్‌కి రెండు సంవత్సరాలు, అంతకుమించి వుండేట్లు పంపిస్తారు.

సర్టిఫైడ్ స్కూళ్ళకి పంపేలోపు విచారణ సమయంలో పిల్లల్ని వుంచే ప్రదేశాన్ని రిమాండ్ హోమ్ లేక అబ్జర్వేషన్ హోమ్ లేక రిసెప్షన్ హోమ్ అంటారు. ఇట్లాంటి హోమ్స్ హైదరాబాద్‌లోనే కాకుండా తిరుపతి, కడప, రాజమండ్రి, విజయవాడ, విశాఖపట్నం, వరంగల్ మొదలయిన ప్రదేశాల్లో కూడా వున్నాయి

రకరకాల నేరాలు చేసిన పిల్లల్ని, ఆవారాగా తిరుగుతున్న పిల్లల్ని దిక్కులేని పిల్లల్ని తమ మాట వినకుండా చెడిపోతున్నాడని తల్లిదండ్రులు రిపోర్ట్ చేసిన పిల్లల్ని ఇక్కడికి తీసుకొస్తారు. తల్లిదండ్రులు తమ పిల్లల బాధ్యత స్వీకరిస్తామంటే సర్టిఫైడ్ స్కూల్ పిల్లల్ని వెనక్కి పంపేస్తారు. ప్రొబేషన్ ఆఫీసర్ వాళ్ళని సూపర్‌వైజ్ చేస్తారు.



ఆడపిల్లల సర్టిఫైడ్ స్కూల్లో అగర్‌బత్తీలను పాక్ చేస్తున్న పిల్లలు

స్వాతి హైదరాబాద్‌లోని రిమాండ్‌హోంని సందర్శించిన రోజున 153మంది పిల్లలున్నారు. వాళ్ళలో అధికభాగం అంటే 121మంది ఆవారాగా తిరుగుతుంటే పట్టుకొచ్చిన పిల్లలే। నేరాలు చేసి పట్టుబడిన పిల్లలు

32మంది, తల్లిదండ్రులు ప్రవర్తన బాగుపరచండంటూ అప్పగించినపిల్లలు ఆ రోజున ఎవ్వరూ లేరు.

రిమాండ్ హూమ్ సూపరింటెండెంట్ శ్రీ పి. గోపాలరెడ్డిగారు స్వాతితో మాట్లాడుతూ "మా రిమాండ్‌హోమ్‌లో పిల్లలకి నీతులు బోధించడానికి ఓ పార్ట్‌టైమ్ మోరల్ ఇన్‌స్ట్రక్టర్ వున్నారండి. తర్వాత వీళ్ళకి ఏదైనా పని కల్పించాలనే వుద్దేశంతో అంబికా అగర్‌బత్తీ వాళ్ళకి అగర్‌బత్తీల్ని ఇక్కడ పిల్లలతో తయారు చేయిస్తున్నామండి. దాదాపు 35 మంది పిల్లలు అగర్ బత్తీలను రోజూ తయారు చేస్తుంటారు.

మిగిలిన పిల్లలలో కొందరు నీళ్ళపని చేపడితే మరికొందరు సూపర్‌వైజర్ల సాయంతో వంటపని చేస్తారు ఇంకొందరు ఆ ప్రాంతాన్ని పరిశుభ్రంగా వుంచడానికి శ్రమ పడుతుంటారు.

కారమ్‌బోర్డ్ మొదలయిన ఇండోర్‌గేమ్స్ ఆడుకోవడానికి ఇక్కడ వీలుంది. మరో విశేషమేమిటంటే ఇక్కడున్న కలర్ టి.వి. చూడండి. ఇది పిల్లలు కొనుక్కున్నదే: అగ్గిపుల్లలు ఫ్రేమ్‌లోఅమర్చి పిల్లలు సంపాదించిన డబ్బుతోనే ఈ కలర్ టి.వి.ని కొన్నాము"అన్నారు.

సినిమాలు, ముఖ్యమైన కార్యక్రమాలు వచ్చేటప్పుడు పిల్లలకి టెలివిజన్ చూపిస్తారు

డాక్టర్‌గార్ని అడిగినప్పుడు పిల్లలలో ఎక్కువ మందికి చర్మ వ్యాధులు వున్నట్లు చెప్పారు. అందుకని పిల్లలు ప్రతీరెండు మూడు రోజులకి శుభ్రమైన దుస్తులు ధరించేట్లు, ప్రతి దినం స్నానం చేసేట్లు చూడడం అధికారుల బాధ్యత. బారెక్స్ లోపల అటాచ్‌డు బాత్‌రూములు, పాన్లు వున్నాయి. బాగానేవుంది. ఈ బాత్‌రూములన్నింటినీ, బారెక్స్‌ని కూడా అతి తరచుగా ఫినాయిల్ మొదలయిన వాటితో కడిగించాలి. అప్పుడే పరిసరాలు శుభ్రంగా వుంటాయి. అందుకు అవసరమైన నీటిని ఎలాగైనా తెప్పించుకోవలసిన బాధ్యత నిర్వహణాధికారులమీద వుంది.

ఈ విషయకిలో జైలువిభాగం ఉన్నతాధికారుల సహకారం వాళ్ళకిఎప్పుడూ వుంటుందని ఆశిస్తోంది స్వాతి.

ముఖ్యంగా రిమాండ్ హోమ్‌లోకి ఎప్పుడూ కొత్తవాళ్ళు వస్తుంటారు. వాళ్ళలో కొంతమంది రకరకాల జబ్బులతో రావచ్చు. అవిమిగతా వాళ్ళకి అంటకుండా వుండాలంటే ఈ జాగ్రత్తలన్నీ అత్యవసరం. పూర్తిగా రిమాండ్ హోమ్‌కోసం ఒక డాక్టర్ వుండాల్సిన అవసరం ఎంతయినావుంది అంటు జబ్బులున్న పిల్లల్ని వేరేగావుంచి, వాళ్ళకి ప్రత్యేక సదుపాయాన్ని కల్పిస్తున్నారు.

ఆవారాగా తిరిగే వాళ్ళే కాకుండా రకరకాల నేరాలు చేసిన పిల్లలూ ఇక్కడికి వస్తుంటారు. కాబట్టి వాళ్ళకి మంచి బుద్ధులు నేర్పడం ఎంతో అవసరం. అందుకు పార్ట్‌టైమ్ మోరల్ ఇన్‌స్ట్రక్టర్ సరిపోడు—పూర్తి బాధ్యతల్ని స్వీకరించే ఇన్‌స్ట్రక్టర్ వుండాలి.

పిల్లలలో డిసిప్లిన్‌ని పెంచడానికి గార్డింగ్ స్టాఫ్ పెంచాల్సిన అవసరమూ వుంది. పిల్లలకి అన్ని విషయాలలోనూ క్రమశిక్షణను బోధించాలి. పిల్లల్ని హాస్పిటళ్ళకి, కోర్టులకు తిప్పడానికి ప్రత్యేకంగా ఒక వాహనం వుండాలి. లేకపోతే ఒక్కోసారి విపత్కర పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. ఈ జాగ్రత్తలన్నింటినీ తీసుకుంటేనే ఈ స్కూళ్ళ స్థాపనలోని ధ్యేయం నెరవేరుతుంది.

ఇక పిల్లల నేర విషయానికొస్తే పెద్దవాళ్ళు లేక చెడిపోయేవాళ్ళు కొందరయితే పెద్దవాళ్ళ వల్ల చెడిపోయేవాళ్ళు మరికొందరు.

పెద్దవాళ్ళతోపాటు కొట్లాటలలో పాల్గొని మర్డర్లకి సహకరించిన పిల్లలూ వున్నారు. పెద్దల సాయంతో దొంగతనాలు చేస్తున్న పిల్లలూ వున్నారు.

ఓ పిల్లవాణ్ణి "నువ్వేమి దొంగతనం చేసావ్?" అని ప్రశ్నించినప్పుడు.

"మా అవ్వ బాగ్ ఎత్తుకు రమ్మంది. తీసుకెళ్ళబోతుంటే పట్టు కున్నారు" అన్నాడు.

వీళ్ళు మొత్తం నల్గురుబేచ్. అవ్వ జనసమర్థమున్న ప్రాంతంలో వెళుతూ ఎవరో ఒకరి మెడమీద వెనుకనుండి పౌడర్ జల్లుతుంది. ఆ వ్యక్తి దురదతో మెడగోక్కోబోతాడు. ఇంతలో పక్కనున్న కుర్రాడు చటుక్కున అతను క్రిందపెట్టిన బాగ్‌ని అంది పుచ్చుకుని పరుగెత్తుకు పోయి అవ్వకిస్తాడు. ఆమె తన కూతురికి (అంటే కుర్రాడి తల్లికి) ఇస్తుంది. కూతురు భర్తకిస్తుంది. ఇలా ఆ వస్తువు చేతులుమారి వెళ్ళి పోతుంది.

గోల్కొండ ప్రాంతంలో ఇలాంటి ఓ దొంగతనాన్ని చేస్తున్న ప్పుడు కుర్రాణ్ణి పట్టుకొచ్చారు. పెద్దలు పారిపోయారు. ఇటు వంటి కుర్రాళ్ళని సంస్కరించడంలో భాగమే అటువంటి పెద్దల్ని కఠినంగా శిక్షించడం! వాళ్ళు ఎక్కడున్నా వెదికి పట్టుకోవాలి.

"కొంతమంది కుర్రాళ్ళు మళ్ళీ మళ్ళీ ఏదో వంకతో ఈ స్కూళ్ళకి వస్తుంటారు" అన్నారు డాక్టర్ రామారావుగారు.

"అవునండి! కొంతమంది పిల్లలు ఇక్కడికొచ్చిన తర్వాత ఏదో వంకన తమ తమ్ముళ్ళనీ ఇక్కడికి రప్పించుకోడానికి ప్రయత్నిస్తుం టారు. అందుకోసం వాళ్ళు ఏదో ఒకటి చేస్తారు. ఇక్కడికివస్తే రెండు పూటలా తిండయినా దొరుకుతుందని వాళ్ళ ఆశ" అన్నారు. రిమాండ్ హోమ్ సూపరింటెండెంట్.

ఇదీ మనదేశపరిస్థితి! బయట ప్రపంచంకన్నా నిర్బంధమే మంచి దని వూహించే పసికూనలూ మనలో వున్నారంటే మనము సిగ్గుపడాలా? గర్వించాలా? ఇందుకు బాధ్యులెవరు? ఈ పరిస్థితుల్లో మార్పు ఎప్పుడు వస్తుంది? వీళ్ళని బాగుచేయటం ప్రభుత్వ బాధ్యతేనా? మనకి ఎటువంటి బాధ్యతా లేదా?

# సర్టిఫైడ్ స్కూళ్ళు శిక్షాకేంద్రాలుకావు శిక్షణా కేంద్రాలు!

రిమాండ్ హోమ్‌నుండి పిల్లల్ని సర్టిఫైడ్ స్కూళ్ళకి పంపిస్తారు. ఆరు సంవత్సరాల లోపు పిల్లల్నయితే గరల్స్ సర్టిఫైడ్ స్కూల్‌లో వుంచుతారు. 7-12 సం. మధ్య వయసుగల పిల్లల్ని జూనియర్ సర్టిఫైడ్ స్కూల్‌కి పంపుతారు. 16 సం. వచ్చేవరకు జూనియర్ స్కూల్‌లో వుంచవచ్చు. ఆ తర్వాత వుండకూడదు. 12-16 సం. మధ్య పిల్లల్ని సీనియర్ సర్టిఫైడ్ స్కూళ్ళకి పంపుతారు. 18 సం. దాటి సీనియర్ సర్టిఫైడ్ స్కూల్‌లో వుంచకూడదు.

హైద్రాబాద్ జూనియర్ సర్టిఫైడ్ స్కూల్‌ని గురించి చెబుతూ ఆ స్కూల్ సూపరింటెండెంట్ శ్రీ కె. సోమారెడ్డి "మా స్కూల్‌లో ఇప్పుడు 266 మంది వున్నారు. వాళ్ళలో అధికభాగం ఆ వారాగా తిరుగు తుంటే పట్టుకొచ్చినవాళ్ళు. సక్రమ మార్గంలోకి రావడానికి తల్లిదండ్రులే విడిచివెళ్ళిన వాళ్ళు.

నేరాలు చేసినవాళ్ళు 20% వుంటారు. ఆ నేరాలుకూడా అధిక భాగం చిన్నచిన్న దొంగతనాలు! 1960లో ఈ స్కూల్‌ని ప్రారంభించా రండి....ఇక్కడి పిల్లలకి 4వ తరగతి వరకు చదువు చెప్పడానికి టీచర్లు వున్నారు. ఒకవేళ అంతకన్నా ఎక్కువ చదివే పిల్లలుంటే, వాళ్ళ ప్రవ వర్తనని బట్టి బయటి స్కూళ్ళకి చదువుకోడానికి పంపిస్తుంటాం. ఇప్పుడు 13 మంది పిల్లలు అలా బయటికి వెళ్ళి చదువుకుంటున్నారు. వాళ్ళకి ఫీజులు కట్టడం, పుస్తకాలు-యూనిఫారాలు మొదలయినవి కొనివ్వడం-అంతా ప్రభుత్వం ఖర్చే!

హిందీ, ఉర్దూలో ఓరియంటల్ పరీక్షలకి వెళతున్నావారూ మా జూనియర్ సర్టిఫైడ్ స్కూల్‌లో వున్నారు. ప్రస్తుతం హిందీలో విద్వాన్ పాసైన కుర్రాడుకూడా మాదగ్గర వున్నాడు. వీళ్ళుబయటికి పోయిన తర్వాత హిందీ, ఉర్దూ టీచర్లుగా పనిచేసుకుని బ్రతకగలరు. అంతేకాకుండా కార్పెంటరీ, టైలరింగ్, బూట్లు చెప్పులు కుట్టడం, హౌస్‌వైరింగ్, ఎలక్ట్రిక్ మోటార్ రివైండింగ్, ప్లంబింగ్ మొదలయిన వృత్తి విద్య లలో కూడా శిక్షణ ఇస్తున్నాము.



కుర్చీలు తయారుచేస్తున్న సర్టిఫైడ్ స్కూల్‌పిల్లలు

ఒక్కోశాఖలోను 20మందిదాకా పిల్లలు తర్ఫీదు అవుతున్నారు. పూర్తి తర్ఫీదు పొందిన తరవాత, ప్రవర్తన బాగుంటే బయట కంపెనీ లలో పనిచేసుకోవటానికి పంపిస్తుంటాం. అలా ఈ స్కూల్‌లో వుండి శిక్షణపొంది, పని చేసుకుని కోద్దో గొప్పో సంపాదించుకుని బయటికి వెళ్ళినవాళ్ళు ఎంతోమంది. తల్లిదండ్రులతో వీళ్ళబంధం దెబ్బతినకుండా వుండటానికి సంవత్సరానికి 15రోజులు ఇంటికి పంపిస్తాము. నెల నెలా ఇంటికి వుత్తరాలు రాసుకోవడానికి కార్డులు ఇస్తుంటాము" అన్నారు.

హైద్రాబాద్‌లో కాకుండా కడప, ఏలూరులలోకూడా జూనియర్ సర్టిఫైడ్ స్కూళ్ళున్నాయి. సీనియర్ సర్టిఫైడ్ స్కూల్ మాత్రం రాష్ట్రమంతటికీ ఒక్కటే హైద్రాబాద్‌లో వుంది. అక్కడి వివరాలన్నీ పాఠకులకు తెలియజెయ్యాలని అక్కడికి వెళ్ళాను.

ఆ స్కూల్ సూపరింటెండెంట్ శ్రీ బి. సత్యనారాయణ మాట్లాడుతూ "1965లో ఈ స్కూల్‌ని ప్రారంభించారండి. అక్కడ 300మంది



సర్టిఫైడ్ స్కూల్లో చదువుకుంటున్న పిల్లలు

పిల్లలదాకా వుంచవచ్చు. కానీ ఇప్పుడు 1?5మంది మాత్రమే వున్నారు వీళ్ళలో ఎక్కువమంది ఏ నేరాలు చేయనివాళ్ళు.... ఆవారాగా తిరి జీవితాల్ని వక్రమార్గంవేపు మళ్ళించుకోబోతుంటే సక్రమ మార్గంలోకి మళ్ళించడానికి అక్కడికి తీసుకొచ్చారు. నేరాలు చేసినవాళ్ళలో రకరకాల నేరాలు చేసినవాళ్ళూ వుంటారు. అందుకని వీళ్ళందర్నీ సక్రమమార్గంలోకి మళ్ళించడానికి మేమెంతో కృషి చేయాల్సి వుంటుంది. నాల్గు తరగతులవరకూ బోధించడానికి ఇక్కడ నల్గురు టీచర్లున్నారు. అంతకన్నా

ఎక్కువ చదవాలనుకున్న పిల్లల్ని మా ఖర్చుతోనే బయట స్కూళ్ళలో చదివిస్తాము. అలా వెళ్ళి బుద్ధిగా చదువుకుంటున్నవాళ్ళు ఎంతోమంది వున్నారు.

చదువుమీద కాకుండా వృత్తివిద్యలలో ఆసక్తి చూపించినవాళ్ళకి కార్పెంటరీ, టైలరింగ్, కేన్‌వీవింగ్, కమ్మరిపని, హౌస్‌పెయింటింగ్, ప్లంబింగ్ మొదలయిన వృత్తివిద్యలలో శిక్షణ ఇస్తున్నాము. ఈ శిక్షణ సాయంతో విడుదలయిన తర్వాతవాళ్ళు జీవనోపాధిని పొందవచ్చు. ఇక్కడవుండే శిక్షణ పూర్తిచేసుకుని, బయట ప్రయివేట్ ఫ్యాక్టరీలలో పనిచేస్తున్నవాళ్ళు మా కుర్రాళ్ళలో వున్నారు" అన్నారు.

రెండుస్కూళ్ళలోనూ పద్ధతులు ఒకటే వుండడటంతో సీనియర్ సర్టిఫైడ్ స్కూల్‌ని మాత్రమే పాఠకులకి పరిచయం చేస్తున్నాము. ఆ స్కూళ్ళ సూపరింటెండెంట్స్ చెప్పినట్లు రెండు స్కూళ్ళలోనూ పద్ధతులు ఒకటేవున్న తేడాఅల్లా పిల్లలవయసు మాత్రమే.

ప్రతిరోజూ ఉదయం 8గం॥కి పిల్లలకి ఉప్మా పెడతారు. పది గంటలనుండి సాయంత్రం నాలుగంటల వరకూ స్కూలు లేక వృత్తి విద్యలలో శిక్షణ వుంటుంది. మధ్యాహ్నం ఒంటిగంటకి భోజనం పెడతారు. తిరిగి సాయంత్రం ఆయిదు గంటలకి రెండోసారి భోజనం.... ప్రతీ బుధవారం మాంసాహారం పెడతారు. పిల్లలకి ఈ వంటకాలు చేసి పెట్టడానికి ముగ్గురు వంటవాళ్ళున్నారు. సాయంత్రం కాసేపు పిల్లలు ఆడుకోవచ్చు. డ్రిల్లుకూడా వుంటుంది. ఆరు గంటలకల్లా బారెక్సులలో వుంచి లాకప్ చేసేస్తారు. వీళ్ళ భద్రతా ఏర్పాట్లు చూడడానికి 25మంది గార్డింగ్ స్టాఫ్ వున్నారు. సంవత్సరంలో ఆరుసార్లు పిల్లల్ని ఎగ్జిబిషన్, జూ, మ్యూజియమ్ మొదలయిన ప్రదేశాలకి తీసుకువెళ్ళి చూపిస్తారు.

ప్రవర్తన మెరుగు పరచుకునే పిల్లలకు మంచి సదుపాయాలున్నాయి. చక్కగా చదువుకోవచ్చు. లేకపోతే వృత్తి విద్యలలో శిక్షణ

పొందవచ్చు. ఏ విధంగనయినా ఈ స్కూల్‌లోవున్న కాలాన్నంతటినీ సద్వినియోగ పరుచుకోవచ్చు.

పిల్లలు ఆనందించడానికి రేడియో, టెలివిజన్ మొదలయినవికూడా వున్నాయి.

ఆరోజు ఆరు దాటిన తర్వాత కూడా ఒక గదికి తాళం వేసిలేదు. ఆ విషయం గురించి స్కూల్‌ని చూపిస్తున్న డెప్యూటీ సూపరింటెండెంట్ శ్రీ కృష్ణయ్యని అడిగింది స్వాతి.

"వీళ్ళు మంచి ప్రవర్తన గల పిల్లలండి.... బయటికి వెళ్ళి చదువుకునే వాళ్ళు కొందరయితే బయటికివెళ్ళి కష్టపడి పనిచేసి వస్తున్న వారు మరికొందరు....అందుకే వీళ్ళకి కొద్దిగా ఎక్కువ స్వాతంత్రం...." అన్నారాయన.

18సం. వయసు వచ్చే లోపలే శిక్ష పూర్తయ్యేటట్లు పిల్లల్ని ఇక్కడికి పంపిస్తారు. ఈ లోపల వీళ్ళు ఇక్కడ విద్యాబుద్ధులతోపాటు క్రమశిక్షణని అలవరచుకుని బయట పడతారు. అందుకే ఇవి శిక్షా కేంద్రాలు కావు శిక్షణాకేంద్రాలు. ఇక్కడి స్టాఫ్ ఎవరికీ యూనిఫారమ్ వుండదు. యూనిఫారమ్ వుంటే పిల్లలకి, నిర్వహణాధికారులకు మధ్య అగాధం ఏర్పడవచ్చునేమోనని అలా చేసారు. ఇప్పుడు పిల్లలు స్టాఫ్‌తో చనువుగా వుండగలుగుతారు. ఆరోగ్యం బాగుండని పిల్లలకి వైద్య సదుపాయాలు కల్పించడానికి ఈ స్కూళ్ళలో ప్రత్యేక ఏర్పాట్లున్నాయి ఆరోగ్య రీత్యా అవసరమయితే పిల్లలకి ప్రత్యేక ఆహారం ఇస్తారు. మరో విశేషమేమిటంటే సర్టిఫైడ్ స్కూళ్ళలో శిక్షని అనుభవించడంవల్ల పిల్లలకు ప్రభుత్వోద్యోగాలను పొందడంలో ఎటువంటి ఇబ్బందీ వుండదు.

ఇన్ని మంచి ఆశయాలతో చెడు మార్గంలోని పిల్లల్ని మంచి మార్గంలోకి మళ్ళించడానికి ఆలయాలుగా ఈ సర్టిఫైడ్ స్కూళ్ళు విరాజిల్లుతున్నాయి. అందుకని ప్రభుత్వంవారు వీటికి శాశ్వత భవనవసతి

కల్పించాల్సిన అవసరం ఎంతోవుంది. అప్పుడే జైళ్ళకి లాగా వీటిని అవసరమైన పద్ధతిలో ఆరోగ్యకరంగా వుంచుకోవడానికి వీలవుతుంది. డైరెక్టర్ జనరల్ శ్రీ ఎమ్.ఎ. షఫియుల్లాఖాన్‌గారు జూనియర్ సర్టిఫైడ్ స్కూల్ భవన నిర్మాణానికి పదిహేను లక్షల రూపాయలు మంజూరి అయ్యాయని చెప్పారు. ఇది సర్టిఫైడ్ స్కూళ్ళ శాశ్వత భవన నిర్మాణానికి శ్రీకారంగా భావిద్దాం. జైళ్ళలాగానే సర్టిఫైడ్ స్కూళ్ళు, రిమాండ్ హోమ్స్ షఫియుల్లాఖాన్‌గారి పర్యవేక్షణలో సంపూర్ణ రూపాన్ని సంతరించుకుంటాయని ఆశిస్తున్నాం.

# మా పిల్లలందరూ మంచిపిల్లలు

ఒక పద్ధతి ప్రకారం కట్టిన భవనం. మధ్యలో చుట్టూ ఖాళీ స్థలంలో రకరకాలచెట్లు పరిశుభ్ర వాతావరణం, పెద్ద ప్రహరీగోడ, మెయిన్ గేటులోపాటు భవనానికి నాల్గు పక్కల నాలుగు గార్డింగ్ పోస్టులు.... హైద్రాబాద్‌లోని నింబోలి అడ్డలోవున్న గరల్స్ సర్టిఫైడ్ స్కూల్ వర్ణన ఇది.

జైలు విభాగంవాళ్ళు గరల్స్ సర్టిఫైడ్ స్కూల్‌కోసం ప్రత్యేకంగా కట్టించుకున్న భవనం కాబట్టి అన్ని వసతులతో చక్కగా వుంది. రాత్రిపూట పిల్లల్ని లాకప్‌చేసే మూడుబారెక్సులూ పక్కపక్కనే వున్నాయి. రాత్రిళ్ళుకూడా ఒక బారెక్సులోనుండి మరో బారెక్స్‌లోకి వెళ్ళవచ్చు. అన్ని బారెక్సులకు కలిపి బయట తాళం వేస్తారు. లోపల అటాచ్‌డ్ బాత్‌రూమ్స్ వున్నాయి. ఈ సర్టిఫైడ్ స్కూల్ చూసిన తర్వాత మగపిల్లల సర్టిఫైడ్ స్కూల్స్‌కి ఇటువంటి సొంత బిల్డింగ్స్ వుంటే అవీ ఇలా బాగుంటాయికదా అనిపించింది.

వసతులన్నీ వుండడంకన్నా పరిసరాలన్నింటినీ పరిశుభ్రంగా వుంచడంతో సర్టిఫైడ్ స్కూల్‌కి ఉదాహరణగా కనిపించింది గరల్స్ సర్టిఫైడ్ స్కూల్. పరిసరాలను, లోపలి భాగాలను చక్కగా చిమ్మించి ఆ చెత్తను లోపల పోగులు పెట్టకుండా దూరంగా ఎక్కడో పారేస్తున్నారు. బాత్‌రూమ్స్, లెట్రిన్స్ పినాయిల్‌తో పరిశుభ్రంగా కడిగిస్తున్నారు. మిగతా సర్టిఫైడ్ స్కూళ్ళకన్నా ఈ విషయంలోకూడా మిన్నగా అనిపించింది గరల్స్ సర్టిఫైడ్ స్కూల్.

రిమాండ్ హోము, సర్టిఫైడ్‌స్కూల్ కలిసేవుంది. స్వాతి సందర్శించినరోజున రిమాండ్ హోమ్‌లో పదిహేనుమంది ఆడపిల్లలుంటే, సర్టిఫైడ్ స్కూల్‌లో యాభైమంది వున్నారు. ఈ యాభైమందిలో నలభై ఒక్కమంది అనాధలు. ఆవారాగా తిరుగుతుంటే, పట్టుకొచ్చినవాళ్ళు. తల్లిదండ్రులు కంట్రోల్ చెయ్యలేక డిసిప్లిన్ అలవడడంకోసం సర్టిఫైడ్ స్కూల్‌కి పంపినవాళ్ళు ముగ్గురు, నేరంచేసి ఇక్కడికి వచ్చినవాళ్ళు ఆరుగురు.

వీళ్ళు ఎటువంటినేరాలు చేసారో పరిశీలించడానికి వాళ్ళని ఇంటర్‌వ్యూ చేసాను

ఒక పాపకి పద్నాలుగేళ్ళుంటాయి. చాలా చిన్నప్పుడు పనిపిల్ల కావాలని బొంబాయినుండి ఆ పాపను తీసుకొచ్చారు హైద్రాబాద్‌లో ఒకరు. రెండుసంవత్సరాలపాటు ఒకళ్లింట్లో చక్కగ పనిచేసింది. ఆ తర్వాత వేరేఇంట్లో పనికిపెట్టారు. మామూలుగాపని చేసుకుపోతున్న ఆ పాపని బొంబాయినుండి తీసుకొచ్చినవాళ్ళు ఆ ఇంట్లోనుండి ఓ సూటు కేసుని ఎత్తుకు రమ్మని అడిగారు. అలాగే చేసినఆమె దొరికిపోయి ఇక్కడికొచ్చింది.

మరోఅమ్మాయికి సినిమాలపిచ్చి సినిమాలన్నీ చూడడానికి కావలసిన డబ్బుని బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మి సంపాదించుకోవచ్చు అనుకుంది.

అలా గుంటూరులోని ఓ థియేటర్ దగ్గర టిక్కెట్లు అమ్ముతూ పట్టుబడింది.

గుంటూరుకి చెందిన మరోపిల్ల చేతివాటుతనంతో ఓ టిఫిన్ కారియర్ దొంగతనంచేసి అమ్ముతుండగా దొరికిపోయి ఇక్కడికి వచ్చింది.

మరోపాప వయసు 15సం॥ వుంటుంది. తల్లిదండ్రులు లేరు. అత్తమ్మ దగ్గర వుంటోంది. ఆవిడ కొట్టడంతో అలిగి హైద్రాబాద్‌లో వున్న అన్న గారింటికి బయల్దేరింది. తీరా హైద్రాబాదుకి చేరుకున్న తర్వాత అన్న గారిల్లు ఎక్కడుంది గుర్తుపట్టలేక సికింద్రాబాదు స్టేషనులో తచ్చాడుతుంటే మరోపిల్ల ఆమెను తనింటికి పట్టుకెళ్ళింది. చిన్నపాటి దొంగతనాలుచేసి బ్రతుకుతున్న ఆపిల్ల క్రమంగా ఈ పిల్లకి దొంగతనాలు చేయడం నేర్పింది ఒక దొంగతనం చేస్తూ పట్టుబడి ఈ స్కూల్‌కి చేరింది.

ఈ పిల్లల్లో చాలామందికి తమ ఇంటిదగ్గర వాళ్ళకి తమగురించి తెలియడం ఇష్టంలేదు. అందుకే వాళ్ళగురించి సరయిన వివరాలు ఇవ్వడంలేదు. ఒకవేళ గట్టిగా అడిగితే ఏవో తప్పుడు అడ్రసులు చెబుతున్నారు.

"ఈ స్కూల్‌లో 3, 4 సంవత్సరాలు వున్న తర్వాతయినా మీరు ఇంటికివెళ్ళాలి కదా! అప్పుడెలా?" అని అడిగితే.

"ఇక్కడ మాకు కుట్టుపని, ఎంబ్రాయిడరీ మొదలయిన పనుల్లో శిక్షణ ఇస్తున్నారు. వీటి సాయంతో మేము బయటికెళ్ళి మా కాళ్ళమీద మేము నిలబడగలము" అని ఎంతో ఆత్మస్థయిర్యంతో చెప్పారు కొందరు పిల్లలు.

ఇంత ఆత్మస్థయిర్యం పెంపొందడం మంచిదేకాని సొంతవాళ్ళతో పూర్తి బంధాలు తెంపుకోవడం మంచిది కాదుగదా! తనవాళ్ళమీదే అభిమానం లేని వాళ్ళు మిగతావాళ్ళమీద మాత్రం అభిమానాన్ని ఎలా పెంచుకోగలరు? అందుకని స్టాఫ్ మరింత శ్రద్ధతో వాళ్ళ మనసులు వాళ్ళ ఇంటి

వేపు మళ్ళేటట్టుచేస్తే వాళ్ళకి మరింత మేలుచేసిన వాళ్ళవుతారు. ఇంటి దగ్గర పరిస్థితులు మంచివి కాకపోతే అది వేరే విషయం।

టైలరింగు, ఎంబ్రాయిడరీ పనులలో పధ్నాలుగుమంది పిల్లలకు శిక్షణ ఇస్తున్నారు. వీళ్ళు కుట్టిన వస్తువుల్ని హైద్రాబాద్‌లో జరిగే ఎగ్జిబిషన్‌లో అమ్మిస్తారు.

ఒకటినుండి నాల్గుతరగతులవరకు పిల్లలకు పాఠాలు బోధించడానికి ప్రత్యేకంగా ఓ టీచర్ వున్నారు. 29మంది అప్పుడు తనదగ్గర విద్యని అభ్యసిస్తున్నట్లు ఆవిడ చెప్పారు సాయంత్రంపూట పిల్లలు స్కిప్పింగ్ కారమ్‌బోర్డ్ మొదలయిన ఆటలు ఆడుకుంటూ వుంటారు.

తీరికవేళల్లో మగపిల్లల రిమాండ్ హోమ్‌లో తయారుచేసిన అగర్ బత్తీలను ఇక్కడి పిల్లలతో పాక్ చేయిస్తున్నారు. అలా పనిచేయడంవల్ల వచ్చిన డబ్బుని వాళ్ళ వ్యక్తిగత ఖాతాలలో వేస్తున్నారు. ఇలా ప్రతీపిల్లా బయటికి వెళ్ళేలోపు ఒకపాటి మొత్తాన్ని తన అకౌంట్‌లో జమ చేసుకోగలుగుతుంది.

పిల్లలకి ఎనిమిది గంటలకి టిఫిన్ పెడతారు. మధ్యాహ్నం 1గం॥కి సాయంత్రం అయిదున్నరకి భోజనాలు పెడతారు ప్రతిసారి గ్లాసు మజ్జిగ ఇస్తారు. ఈ పిల్లలకి సరిపడా పాలు మౌలాలి ఓపెన్‌ఎయిర్ జైలు డైరీ సరఫరా చేస్తుంది. అలాగే ప్రతీ మంగళవారం మాంసం ప్రత్యేక ఆహారంగా ఇస్తారు నాన్ వెజిటేరియన్ తినేవాళ్ళకి. వెజిటేరియన్లకి స్వీట్ ఇస్తారు.

ప్రొద్దున ముఖాలు కడుక్కోగానే పిల్లల్ని గ్రూపులుగా విభజించి కొందర్ని పరిసరాలు పరిశుభ్రం చెయ్యడానికి, కొందర్ని నీళ్ళు తేవడానికి, కొందర్ని వంటకి.... ఇలా విభజించి ఆయాపనిమీద పంపుతారు. కొన్ని రోజులు కాగానే వంటదగ్గర వాళ్ళని పరిశుభ్రం చెయ్యడానికి, అక్కడి వాళ్ళని వంటదగ్గరికి మారుస్తారు. ఈ విధంగా అందరిచేతా అన్ని పనులూ

చేయించడంవల్ల అందరికీ అన్నిపనులూ చేయగల సమర్థత అలవడు తుంది.

4 సంవత్సరాలనుండి 16 సంవత్సరాలమధ్య పిల్లలు ఇక్కడ వుంటారు. ఏడుసంవత్సరాలలోపు మగపిల్లల్నికూడా ఇక్కడే వుంచుతారు. అల్లాంటి మగపిల్లలు ఇప్పుడు ఇద్దరున్నారు.

ఏడు సంవత్సరాలలోపు పిల్లలు దొరికితే వాళ్ళు పెద్దవాళ్ళ గురించి సరిగ్గా చెప్పలేరు కాబట్టి ఫోటోతోపాటు ఈపిల్లల వివరాల్ని ప్రచు రిస్తారు. రేడియో, టెలివిజన్ ద్వారాకూడా ప్రకటిస్తారు అప్పటికీ పెద్ద వాళ్ళెవ్వరూ రాకపోతే ఇక్కడ వుంచేస్తారు. అయిదుగురు చెవిటి మూగ పిల్లలుకూడా ఈ స్కూల్‌లో వున్నారు. ఆరుగురు మతిస్థిమితంలేని పిల్లలూ వున్నారు.

నిజామాబాద్ జిల్లా ఓ గ్రామంలో బావిలోనుండి చిన్నపిల్ల మూలుగు వినిపించడం ఎవరోవచ్చి రిపోర్ట్ చేయడంతో పోలీసులు వెళ్ళి చూసేసరికి ఆ బావిలో నాల్గు సంవత్సరాల పాపవుంది. తల్లిదండ్రుల కోసం ఎంతగా అడిగినా ఆ పాప ఏమీ చెప్పలేకపోయింది. ఆ వూరి పాప కాదని అక్కడి వారందరూ చెప్పారు ఎవరో కోపంతోనో, వది లించుకోవడానికో ఆ పాపని తీసుకొచ్చి బావిలో పారేసి వుంటారని తీసు కొచ్చి ఈ స్కూల్‌లో చేర్చారు. తలకి కూడా దెబ్బ తగలడంతో ఈపాప మానసిక పరిస్థితి అంతంత మాత్రమే!

ఇట్లాంటి పిల్లల్ని అందర్నీ కూడా ఎంతో ఓర్పుతో ఇక్కడ సాకుతున్నారు. ఇక్కడ పనిచేసే వాళ్ళందరూ ఆడవాళ్ళు కావడంతో సహనంతో అందర్నీ తమ శాయశక్తులా చక్కగా తీర్చిదిద్దడానికి ప్రయ త్నిస్తున్నారు.

చిన్నపిల్లల్ని పెద్దపిల్లల పర్యవేక్షణలో విడిచి పెడుతుంటారు. ఆ పిల్లలకి స్నానం చేయించడం, బట్టలుతికి పెట్టడం, రాత్రిళ్ళు భయపడ

కూరిడా చూడడం. అన్నీ పెద్దపిల్లలే చూసుకుంటారు. పిల్లలమధ్య చక్కటి అనుబంధం వుంది. అలాగే స్టాఫ్‌కి, పిల్లలకి మధ్య కూడా చాలా చక్కటి అవగాహన వుంది. స్టాఫ్‌లోని అందర్నీ వరుసలుబెట్టి పిలుస్తుంటారు పిల్లలు.

"మీ అమ్మ ఎక్కడుంది?" అని ఓ పిల్లని అడిగినప్పుడు- సూప రింటెండెంట్ శ్రీమతి అక్తర్ ఖానుగార్ని ఆమె చూపించడమే అందుకు మంచి ఉదాహరణ.

పిల్లలలో మార్పు తీసుకురావడానికి అన్నివిధాలా అనుకూలమైన వాతావరణం గరల్స్ సర్టిఫైడ్ స్కూల్‌లో వుంది సంవత్సరంలో ఆరు సార్లు ఈ పిల్లల్ని ఎక్స్‌కర్షన్‌కి తీసుకువెళ్తారుట.

1960లో ఈ సర్టిఫైడ్ స్కూల్ పెట్టినప్పటినుండి శ్రీమతిఅక్తర్ ఖానుగారు ఇక్కడే పనిచేస్తున్నారు. అప్పట్లో డెప్యూటి సూపరింటెం డెంట్‌గా వుండేవారు. ఇప్పుడు సూపరింటెండెంట్. స్కూల్‌లోని పిల్లల గురించి చెప్పమన్నప్పుడు ఆవిడ "వాళ్ళ ఖర్మ బాగుండక వాళ్ళు ఇక్క డికి వచ్చారుగాని అందరూ మంచిపిల్లలు, చెప్పినట్లు నడుచుకుంటారు. చిన్నపిల్లల్ని పెద్దపిల్లలు చక్కగా చూసుకుంటారు. ఇరవైనాలుగ్గంటలూ మేమందరమూ వేయికళ్ళతో పిల్లల్ని గమనిస్తుంటాము. డాక్టర్‌గారు కూడా పిల్లలని ఏ టయిమ్‌లో పరీక్షించడానికయినా అందుబాటులో వుం టారు" అన్నారు.

ఈ స్కూల్ ఒక మూల వుంది. ఆడపిల్లల్ని అర్ధరాత్రి ఏ హాస్పి టల్‌కో తీసుకెళ్ళాలన్నా చాలా ఇబ్బంది. అందుకని ఈ స్కూల్ కోసం ప్రత్యేకంగా ఓ చిన్న వాహనమైనా వుండితీరాలి. అలాగే స్టాఫ్ క్వార్టర్స్ కూడా పక్కనే వుంటే ఇరవైనాల్గు గంటలూ పిల్లలకి అండగా విలు స్తారు. యిది ఆడపిల్లల స్కూలు కాబట్టి అందరూ ఎప్పుడూ వెయ్యి కళ్ళతో గమనిస్తుండాల్సిన అవసరం ఎంతోవుంది.

10)

వీటన్నిటికన్నా ముఖ్యమైనది బోర్‌వెల్. అది లేకపోతే ముందు ముందు పరిస్థితుల్ని యింత పరిశుభ్రంగా వుంచడం కూడా కష్టమవుతుంది.

జైళ్ళలోను, సర్టిఫైడ్ స్కూల్ అన్నింటిలో కూడా టెలివిజన్ వుంది. కానీ ఇక్కడలేదు. కాబట్టి ఏ స్వచ్ఛంద సేవాసంస్థ అయినా ముందుకొచ్చి ఈ పిల్లలకి ఓ టెలివిజన్‌ని బహూకరిస్తే వాళ్ళకి కొద్దిపాటి వినోదాన్ని అందుబాటులోకి తెచ్చిన వాళ్ళవుతారు. కొన్ని పుస్తకాలు రేడియో తప్ప పిల్లల మానసిక వికాసాన్ని పెంపొందించడానికి ఇక్కడ మరేమీలేవు. ఈ విషయంలో ప్రభుత్వంతో పాటు స్వచ్ఛంద సేవా సంస్థలూ కొద్దిగా చొరవతీసుకోవాలి!

# మెదడు తిన్న మనిషి

ఒరుగా పోతున్న అతను కిటికీలోంచి లోపలకు చూసి కెవ్వుమని అరిచాడు.

భయంతో పరుగెత్తుతున్న అతడిని మరికొంతమంది చుట్టుముట్టి ఆపారు, విషయం ఎవ్వరికీ అర్థంకాలేదు. ఏమిటని అడిగితే అతని నోరు విప్పడంలేదు. భయంతో వణికిపోతున్నాడు.

ఇంతలో ఎవరో గ్లాసుతో నీళ్ళు తెచ్చిచ్చారు. ఆ నీళ్ళని తాగి అతను కొద్దిగ తెప్పరిల్లాడు. విషయమేమిటని గుచ్చి గుచ్చి అడిగిన తర్వాత అతను నంగి నంగిగా విషయాన్ని బయటపెట్టాడు. వెంటనే అందరూ అతను చెప్పిన ఇంటివేపు పరుగెత్తారు.

కిటికీలోంచి చూసిన అందరికి నోట్లో తడారిపోసాగింది.

లోపల దృశ్యం అతి భయంకరంగా వుంది.

అదంతా రక్తపు మడుగు, తల పగిలిపోయి ఒకావిడ పడుంది. క్కనే రోకలుంది.

ఆమె తల పక్కనే కూర్చుని పగిలిన తలలోంచి బయటికి కని స్తున్న బ్రెయిన్‌ని తింటున్నాడతను.

ఆ దారుణాన్ని చూడలేక ఇవతలికి వచ్చిన వాళ్ళలో ఒకరు పోలీ లకు విషయాన్ని తెలీజేసారు.

వెంటనే పోలీసులు వచ్చి ఆ యువకుడిని అరెస్టుచేశారు.



మెదడుతిన్న మనిషి

హైద్రాబాద్‌లో ఓ మూల 1982లో జరిగిన ఈ హత్య ఆ చుట్టు పక్కల పెద్ద సంచలనాన్ని రేకెత్తించింది.

రోకలితో ఆమె తల పగలగొట్టినప్పుడు అతని వయసు 28సం॥ తండ్రిలేడు! తల్లివుంది! అన్నదమ్ములు లేరు. ఒక్క అక్క మాత్రమే ఉంది! పెళ్ళవడంతో ఆమె వెళ్ళిపోయింది! వీళ్ళకి రెండిళ్ళు వున్నాయి.

ఆ ప్రాంతంలో ఆ రెండిళ్ళమీద వచ్చే అద్దెలతో వాళ్ళిద్దరూ బ్రతుకు తున్నారు.

అతనికి ఫిట్స్ వస్తుంటాయి. అందుకని తల్లి పని మాన్పించేసింది. ఆరోజు ఫిట్ వచ్చినప్పుడు ఇంట్లో తల్లిలేదు. సరిగ్గా స్పృహలో లేని అతను సరాసరి తమ ఇంట్లో అద్దెకుంటున్న వాళ్ళ వాటాలోకి జొరబడ్డాడు. ఆ వాటాలో ఓ యాభై సంవత్సరాల వృద్ధురాలు మాత్రం ఉంటోంది.

మరోమాట లేకుండా ఆమె తలని ప్రక్కనున్న రోకలితో బ్రద్దలు చేసాడు అతను. క్రింద పడిపోయిందామె. ప్రక్కనే కూర్చుని ఆమె బ్రెయిన్‌ని తినసాగాడు అతను ఆ పరిస్థితిలో అతడిని చూసిన ఓ వ్యక్తి అరవడంతో నలుగురూ ప్రోగై పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు. పోలీసులు వచ్చి అతడిని పట్టుకెళ్ళారు.

అంతకుముందు కూడా అతనికి ఫిట్స్ వస్తుండేవని, ఫిట్ వచ్చినప్పుడు మానసికస్థితి సరిగ్గాలేక అతను హత్యచేసాడు కాబట్టి క్షమార్హుడు, అతని బాధ్యతని స్వీకరించడానికి తల్లిగాని మరెవరైనాగాని ముందుకొచ్చి షూరిటీ ఇస్తే విడిచి పెట్టవచ్చని కోర్టు తీర్పు ఇచ్చింది

కోర్టు అలా తీర్పు ఇచ్చి చాలా కాలమైనా అతనింకా హైద్రాబాద్ సెంట్రల్ జైల్లోనే వున్నాడు.

వెల్ఫేర్ ఆఫీసర్ రామ్‌గోపాల్‌ని చూడగానే "సార్.... నన్ను బయటికి పంపించేయండి సార్" అంటూ బావురుమన్నాడు అతను.

"మీ అమ్మకు కబురు చేసాను. ఆవిడ వచ్చిన తర్వాత విడిచి పెడతాంలే...." అన్నాడు అతడిని ఓదారుస్తూ పక్కనేవున్న వెల్ఫేర్ ఆఫీసర్ రామ్‌గోపాల్.

"అనవసరంగా మీ ఇంట్లో అద్దెకున్న ఆ ముసలమ్మని ఎందుకు చంపావ్?" అని అడిగాను.

"నేను చంపలేదుసార్....నాకేమీ తెలీదు....జైల్లో పెట్టిన తర్వాత ఎప్పటికో నాకు తెలిసింది. నన్ను ఎందుకు తీసుకు వచ్చారంటే నువ్వు మీ ఇంట్లో అద్దెకుండే ఆవిడ తల పగలగొట్టి బ్రెయిన్ తింటుంటే పట్టు కొచ్చాం అన్నారు సార్....నిజంగా నాకేమీ తెలీదు సార్....నేను ఎవ్వరి తోనూ పోట్లాటలు పెట్టుకోనుసార్, ఆవిడతో అంతకుముందు నేను సరిగ్గా మాట్లాడింది కూడా లేదు. అట్లాంటిది ఆమెను ఎందుకు చంపుతాను చెప్పండి...."కళ్ళు తుడుచుకుంటూ చెప్పుకుపోతున్నాడు అతను.

"మరి, మీ అమ్మ కూడా నువ్వంటే ఎందుకంత భయపడి పోతోంది?"అడిగాను.

"మా అమ్మ ముసల్దయి పోయింది సార్....దాన్ని మా అక్క-బావ మార్చేస్తున్నారు. నేను జైలు నుండి బయటికి రాకుండా వుంటే ఆస్తినంతటినీ వాళ్ళే అనుభవించ వచ్చని మా అక్క వాళ్ళే ఇలా అమ్మని కూడా రానీయకుండా చేస్తున్నారు."

"ఇన్ని విషయాలు తెలిసిన వాడివి మరి ఆమెను చంపిన విష యం కూడా తెలీదంటే ఎలా నమ్ముతాం చెప్పు"

"నిజంసార్....యదార్థం....నాకేమి తెల్వద్‌సార్.... ఫిట్ వచ్చి నప్పుడెప్పైనా చేసానేమో నాకేమి తెల్వదు. వీళ్ళందరూ చంపావంటుంటే కాబోలనుకుంటున్నాను.... మా అమ్మని పిలిపించండిసార్....నాకు శిక్ష తీసేసారని, తీసుకుపొమ్మని...." వెల్ఫేర్ ఆఫీసర్ కాళ్ళని చుట్టేసాడు.

అలా గేలే...." అతడిని విడిపించుకుని ఇవతలికి వచ్చేశారు రామ్ గోపాల్.

"అతనికి నిజంగానే హత్య చేసిందికూడా తెలీదంటారా?" వెల్ఫేర్ ఆఫీసర్ని అడిగాను.

"మొదట్లో ఫిట్ వచ్చిన తర్వాత కాసేపు ఏమి చేసేవాడో అత నికి తెలిసేది కాదు. అందుకనే బారెక్స్‌లో కాకుండా అతడిని సింగిల్

రూమ్‌లో వుంచాము. మిగతా ఖైదీలందరూ కూడా మొదట్లో అతనంటే భయపడిపోయేవారు. డాక్టర్ ఎగ్జామిన్‌చేసి నిర్ధారించిన తర్వాతేకదా కోర్టు శిక్షని రద్దుచేసింది. ఇక్కడ మేము ట్రీట్‌మెంట్ ఇప్పిస్తున్నాము. ఇప్పుడతనిలో చాలా మెరుగుదల కనిపిస్తోంది. ఇదివరకటిలా ఫిట్స్ అతి తరచుగా రావడంలేదు. వచ్చినా కూడా మనిషి అలా మృగంలా కావడంలేదు. ఫిట్ వస్తుందనిపించినప్పుడు అతనంతటికి అతనే తన గదిలోకి వెళ్ళిపోతాడు. పూర్తిగా తగ్గిన తర్వాతగాని బయటికి రాడు...."

"మరి, వాళ్ళ అమ్మా వాళ్ళు ఎందుకు రావడంలేదు తీసుకెళ్ళడానికి"

"వాళ్ళందరి మనసుల్లోనూ అప్పటి సంఘటనే ముద్రించుకు పోయివుంది. ఇంటికి వస్తే మళ్ళీ ఎవరి తల పగలగొట్టి బ్రెయిన్ తింటాడో అని అందరూ భయపడిపోతున్నారు. ఆఖరికి తల్లికూడా! మొన్నీ మధ్య మేము ఆవిడకి ఫోన్ చేశాము-కొడుకుని తీసుకువెళ్ళమని అతను ఇంటికివస్తే చంపేస్తామని చుట్టుపక్కలవాళ్ళు బెదిరిస్తున్నారని! జైల్లో వుంటే ప్రాణాలతోనయినా వుంటాడని తను తీసుకువెళ్ళడంలేదని" ఆమె అంది.

## అమ్మా నన్ను తీసుకుపోవే

"మరి ఈ సమస్యని మీరు ఎలా పరిష్కరించ దల్చుకున్నారు?" అని అడిగినప్పుడు.

"ఇతనిలో వచ్చిన మార్పు వాళ్ళకి తెలీక వాళ్ళు ఇంకా ఆ భయంలోనే వున్నారు. వాళ్ళని తీసుకువస్తే ఇతని పరిస్థితి మెరుగు పడ వచ్చు అంటున్నారు సూపరింటెండెంట్‌గారుకూడా అన్నారు. వెల్ఫేర్ ఆఫీసర్ రామ్‌గోపాల్.

అన్నట్లుగానే సూపరింటెండెంట్ జోషిగారి సలహామీద మరో పదిరోజుల తర్వాత వాళ్ళింటికి వెళ్ళి తల్లికి, మామకి నచ్చజెప్పారు.

అతనిలో ఎంతో మార్పు వచ్చిందని, అయిన వాళ్ళందరూ ఇలాగే దూరంగా వుంటే మళ్ళీ అతనికి పిచ్చి ఎక్కవచ్చని ఒక పూటల్లా ఆయన నచ్చజెప్పిన తర్వాత తల్లి మామ చూడటానికి వచ్చారు జైలుకి.

వాళ్ళతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు ఆ ఖైదీ. "అమ్మా ....కోర్టు నాకు శిక్షలేదందే....నన్ను తీసుకుపోవే...." అంటూ తల్లిని బ్రతిమాలాడు దీనంగా.

"మళ్ళీ వచ్చినప్పుడు తీసుకెళతాం...." అంటూ వాళ్ళు తెచ్చిన పళ్ళు అతనికిచ్చి వెళ్ళిపోయారుట.

ఇది జరిగిన మరో వారం రోజులకి జైలుకి వెళ్ళినప్పుడు ఈ విశేషాలన్నీ తెలిసాయి.

## నన్ను విడిపించండిసార్

వాళ్ళమ్మకి ఇప్పుడితనంటే కొద్దిగా భయం తగ్గింది. మరో మూడు నాల్గు సార్లు వస్తేగాని కొడుకుని పూర్తిగా నమ్మదు" వెల్ఫేర్ ఆఫీసర్ కిటికీదగ్గరనుంచి "సాబ్.... సార్...." అంటూ అరుపులు వినిపించాయి.

అటు చూసాను.

అక్కడ ఉన్నాడు ఖైదీ. ఆ వూచల అవతల నుంచే ప్రాధేయ పడుతున్నాడు.

"సార్....నన్ను విడిపించండి సార్! మా అమ్మ మళ్ళీ వస్తా న్నది రాలేదు. నేను ఎవర్నీ ఏమీ చెయ్యనుసార్. నేను ఎంతో నెమ్మదస్థుడినో జైలులో ఎవ్వరినయినా అడగండి సార్...." అతను చెప్పుకుపోతున్నాడు.

"నేను, సారు మళ్ళీ మీ అమ్మదగ్గరకి వెళుతున్నాము. ఆవిడని తీసుకువస్తాం. నువ్వు సెల్‌లో గోలచేయకుండా వుండు" వెల్ఫేర్ ఆఫీసర్ ఆ మాటలు అనడంతో అతను లోపలికి వెళ్ళిపోయాడు.

తన తల్లి వస్తుందని, ఇంటికి తీసుకు వెళుతుందని, ఎంతో ఆశతో ఎదురు చూస్తూ అతను రోజులు గడుపుతున్నాడు హైద్రాబాద్ సెంట్రల్ జైల్లో.

(ఉన్మాదం భయంకరమైన జబ్బేమీ కాదు. కాకపోతే ఆ లక్షణాలు కనిపించగానే ఆలస్యం చెయ్యకుండా వైద్యంచేయించాలి. ఇది ఎంతో అవసరం)

# పిల్లలతో సహా బావిలో దూకిన యువతి

చంకలో ఒక పిల్లని పెట్టుకుని మిగతా ఇద్దరు పిల్లల్ని నడిపించు కుంటూ ఆమె వెళుతోంది.

ఆమె మెదడులో ఎన్నో ఆలోచనలు....

పాపం! ఆ పసి పిల్లలకి ఏం తెల్సు .... అమాయకంగా తల్లిని అనుసరిస్తున్నారు.

ఊరు బయటికి చేరుకున్నారందరూ.

బావి దగ్గరకు చేరుకోగానే ఆమె కాళ్ళు అటోమేటిక్‌గా నిల్చి పోయాయి. చటుక్కున చేతిలోని పిల్లాడిని ఆ బావిలోకి విసిరేసింది. పిల్లలకి జరుగుతున్నదేమిటో వూహించుకునే వ్యవధి ఇవ్వకుండా ఆ వెంటనే పక్కనున్న పిల్లల్ని కూడా బావిలోకి తోసేసింది. ముగ్గురు పిల్లలూ బావిలో పడగానే ఆలస్యం చెయ్యకుండా తనూ దూకేసింది.

ఒక్కసారి ఆ ప్రదేశమంతా పిల్లల కేకలతో మారుమ్రోగి పోయింది.

ఆ కేకలతో అక్కడికి చేరుకున్న వాళ్ళు వాళ్ళని రక్షించడానికి ప్రయత్నించారు.

అతి ప్రయత్నంమీద వాళ్ళందర్నీ బయటికి తీయగలిగారు. అప్పటికే ముగ్గురు పిల్లల ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. ఆమె మాత్రం బ్రతికింది.

ఆమె భర్త రాళ్ళు కొట్టేవాడు. అతడు సంపాదించే చిన్నమొత్తంతో కుటుంబంలోని అందరికీ తిండి గడవడమే అంతంత మాత్రం.... అతనికి ఎన్నో దుర్గుణాలు. వాటికే అతని సంపాదన చాలేది కాదు. దాంతో భార్యా పిల్లలూ చాలా ఇబ్బందులు పడేవారు. తనయితే కడుపు మాడ్చుకునయినా వుండగలిగేదిగాని పిల్లలు ఆకలితో అలమటిస్తుంటే ఆ మాతృహృదయం విలవిలలాడిపోయేది. ఏమిచేయాలో అర్థమయ్యేదికాదు. ఆఖరికి ఒక నిశ్చయానికొచ్చి చావే తమ సమస్యలకి పరిష్కారంగా భావించి పిల్లలని బావిలోకి తోసి తనూ దూకింది.



పిల్లలతోసహా బావిలో దూకిన యువతి

ఆ తర్వాతకూడా దురదృష్టం ఆమెని వెన్నాడుతూనే వుంది. ముగ్గురు పిల్లలూ చనిపోయారు ఆమె బ్రతికింది.

పిల్లల్ని చంపి ఆత్మహత్యా ప్రయత్నం చేసిందన్న నేరంమీద ఆమెకి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు.

"పిల్లల్ని బావిలో పడేసి నువ్వూ ఆత్మహత్య చేసుకోవాలని ఎందుకు ప్రయత్నించావు?" అని ఆమెను అడిగితే-

"నా పిల్లలను నేను బావిలో పడేయలేదండి. నా మొగుడంటే పడనివాళ్ళు మావూళ్ళో వున్నారు వాళ్ళు నన్నూ, నాపిల్లల్ని బావిలో పడేసారు" అంటుందేగాని భర్తకి వ్యతిరేకంగా ఒక్కమాటకూడా చెప్పలేదు.

తెలంగాణా జిల్లాలోని ఓ జిల్లాలో వుంటున్న ఈ యువతి వయసు ఇప్పుడు 32సం॥ వుండవచ్చు. ముస్లిమ్ యువతి. తెలుగు మాట్లాడడం రాదు.

విచిత్రమేమిటంటే ఈమె విచారణ సమయంలో బెయిల్‌మీద విడుదలయినప్పుడు మళ్ళీ గర్భవతయింది.

శిక్షపడిన తర్వాతే ఆమెకు నెలలు నిండాయి. జైల్లో వుండగానే ప్రసవించింది. ఇప్పుడా పాపకూడా తల్లితోనే చంచల్‌గూడలోని ఆడవాళ్ళ జైలులో వుంటోంది.

పిల్లలకి ఆరు సంవత్సరాలు నిండేవరకూ తల్లితోపాటే జైలులో వుండనిస్తారు. ఆ తర్వాత వాళ్ళని చదువుకోసం వేరుచేస్తారు.

జైలులో ఈమె ప్రవర్తన బాగానే వుంటుంది. మనిషిలో నిదానం పాలు ఎక్కువ. బియ్యం బాగుచేయడం మొదలయిన పనులు జైల్లో చేస్తుంటుంది.

ఆమెభర్త తన సంపాదన నంతటినీ ఇంటికితెస్తే ఆ అమాయక ప్రాణులు అనవసరంగా బలైపోయి వుండేవి కావుకదా! ఆమె తొందరపాటు తనానికి, భర్త వ్యసనాలకు ఫలితం అనుభవించింది ఆపిల్లలు! ఈ పాపంలో ఎవరిపాత్ర ఎంతవుంది?

# కన్నకూతుర్ని దారుణంగా చంపిన తండ్రి

అయిదు సంవత్సరాల క్రితం సికింద్రాబాద్‌లో పెద్ద సంచలనాన్ని కలిగించింది ఓ హత్య.

ఆ హత్య చేసింది ఎవరోకాదు.

తండ్రి!

మరెవర్నోకాదు-

కూతుర్ని!!

సంచలనాన్ని కలిగించింది హత్యకాదు అందుక్కారణం!!!

కూతురు వయసు 17సం. వుంటాయి. ఆమె స్నానం చేస్తున్నా, గుడ్డలు కట్టుకుంటున్నా ఓ జతకళ్ళు తినేసేటట్లు ఆమెను చూస్తుండేవి.

మరెవరయినా అయితే తన బాధని తల్లిదండ్రులకు చెప్పుకునేది కన్నతండ్రే అలా చేస్తుంటే ఇంకెవరికి చెప్పుకుంటుంది? కుళ్ళిపోయేది... ఆఖరికి భరించలేక తల్లికి చెప్పుకుంది. ఆమె భర్తని సరయిన మార్గంలోకి పెట్టడానికి ప్రయత్నించేది.

కానీ ఆమెకూడా బ్రతుకుతెరువుకై ఏదో ఓపని చేస్తుండేది. ఆమె లేనప్పుడు ఆ తండ్రి చూపులకు విలవిలలాడిపోయేది ఆపిల్ల. సాధ్యమైనంత వరకూ అతనికి దూరంగానే తప్పించుకుని తిరిగేది. కానీ ఒకే ఇంట్లో ఉంటూ ఎంతకాలం అతడిని తప్పించుకుని తిరగ్గలదు?

ఆరోజు ఆ తండ్రికి అవకాశం చిక్కింది.

కూతురుమీద దౌర్జన్యం జరుపబోయాడు. అతని బారినుండి తప్పించుకోడానికి ఆ పిల్ల శతవిధాలా ప్రయత్నించింది. ప్రాధేయపడింది.

బాగా తాగివున్న అతడిలో విచక్షణా జ్ఞానం పూర్తిగా నశించింది. కూతుర్ని ఆక్రమించుకోబోయాడు.

మాన సంరక్షణలో ఆ పిల్ల వంటింటి కత్తితో అతడిని గుండెల మీద పొడిచింది. అతను ఆ కత్తిని లాక్కుని కోపంతో కసితో ఆమెను పొట్టలో పొడిచాడు.

కేకలు....

ఆ ప్రదేశమంతా రక్తమయమై పోయింది. వాళ్ళిద్దర్నీ హాస్పటల్ లోకి చేర్చారు. రెండురోజుల తర్వాత ఆ పిల్ల చనిపోయింది. మరికొన్ని రోజులతర్వాత అతని పరిస్థితి మెరుగుపడింది.



కన్నకూతుర్ని దారుణంగా చెరచి చంపిన తండ్రి

“తాగివచ్చి కూతుర్ని మానభంగం చెయ్యడానికి అంతకుముందు కూడా ఎన్నోసార్లు ప్రయత్నించాడని” భర్తకి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పింది చనిపోయిన పిల్లతల్లి.

దాంతో అతనికి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు. హైద్రాబాద్

చంచల్‌గూడా జైల్‌లో శిక్షని అనుభవిస్తున్న అతడిని స్వాతి కలుసుకోవడం జరిగింది.

"మీ వయస్సెంత?"

"యాభై మూడు సంవత్సరాలు"

"ఈహత్య ఎప్పుడు జరిగింది?"

"1981లో"

"మీకెంతమంది పిల్లలు?"

"నల్గురు మగపిల్లలు ఒక ఆడపిల్ల"

"హత్య జరిగినప్పుడు మీ అమ్మాయి వయసెంత?"

"పదిహేడు సంవత్సరాలు. పిల్లలందరిలో ఆమే పెద్ద"

"ఆమెను మానభంగం చెయ్యబోయారా?"

"అప్పట్లో పేపర్లన్నీ కూడా అలాగే ప్రచురించాయండి...."

"మీ ఆవిడ కూడా అలాగే సాక్ష్యం ఇచ్చిందికదా?"

"మా ఆవిడకి, నాకు అంతకుముందే చాలా కాలంనుండి మాటలు లేవండి. అందుకనే నాకు వ్యతిరేకంగా చెప్పింది"

"అంతేగాని మీకే పాపం తెలీదంటారు"

"మా అమ్మాయి ప్రవర్తన అంత బాగుండేది కాదండి. ఎవర్తోనో తిరుగుతుండేది. నాకది నచ్చేది కాదు. ఎన్నోసార్లు ఎందుకిలా తిరుగుతావని నిలదీసాను. కానీ ఆమె లక్ష్యపెట్టేదికాదు. తల్లికూడా కూతురికి వత్తాసు పలికేది, ఒకరోజు నేను ఆఫీస్‌నుండి పెందలాడే ఇంటికిచేరాను. అప్పటికి మా ఆవిడ ఇంకా డ్యూటీనుండి తిరిగి రాలేదు.

బెడ్‌రూమ్‌లో మా అమ్మాయితోపాటు మరో కుర్రాడున్నాడు. నా రక్తం వుడికిపోయింది. నన్ను చూడడంతోనే అతను తప్పించుకు వెళ్ళిపోయాడు.

ఎందుకిలా చేస్తున్నావని మా అమ్మాయిని మందలించబోయాను.

ఆమె గుండెలమీద తన్నింది. దాంతో కోపంవచ్చి వంటింట్లోకి వె కూరలు తరిగే కత్తి తీసుకున్నాను. పొడిచి ఆమెను భయపెట్టాలని వుద్దేశ్యం. కానీ కడుపులో కత్తి దిగపడడంతో ఆమెకు పెద్ద గాయమైం వెంటనే భయపడిపోయి నన్ను నేను పొడుచు కోబోయాను. గుండెమీ ఎముకలకి తగిలి కత్తి విరిగింది. ఇద్దర్నీ హాస్పిటల్‌లో చేర్చారు. రెం రోజుల తర్వాత ఆమె చనిపోయింది. మరికొన్ని రోజుల తర్వాత గాయం మాని బయటపడ్డాను. నా భార్యకూడా నాకు వ్యతిరేకంగా చెప డంతో నాకీ శిక్ష పడింది"

"మిమ్మల్ని చూడడానికి భార్య మిగతా పిల్లలు వస్తుంటారా?"

"ఒకసారి వచ్చారు?"

"మీరిలా జైలుకి వచ్చేయడంతో కుటుంబం గడవడానికి ఇబ్బంది ఏమీలేదా?"

"మా ఆవిడ పని చేస్తూనే వుంది. నాకు రెండిళ్ళువున్నాయి.పిల్లలు చదువుకుంటూవున్నారు"

"వాళ్ళందరికి దూరంగా ఇలా వంటరిగా గడపడం ఇబ్బందికరంగా లేదా?"

"ఎందుకు వుండదండి వుంటుంది. అయినా తప్పదుకదా!"

శిక్షని అనుభవిస్తున్న వాళ్ళలో కూడా 90శాతం తాము తప్పు చేయ లేదనే బుకాయిస్తూ వుంటారు.

మత్తు పదార్థాలని సేవించడం ఫాషన్ అయిపోయింది. ఈకాలంలో ఈ అలవాటువల్ల డబ్బు, ఆరోగ్యం నాశనమవడమే కాకుండా కొందరికి ఇలాంటి విపరీత బుద్ధులూ పుడుతుంటాయనే విషయంపై సంఘటన రుజువు చేస్తోందికదా!

# పిల్లల రక్తం తాగిన ఓ తల్లి

రెక్కాడితే గాని డొక్కాడని బ్రతుకులు వాళ్ళవి. అందుకని భార్యాభర్తలు ఇద్దరూ పనిలోకి పోతారు. పగలల్లా పిల్లలు ఆ స్టేషన్ పరిసరాల్లోనే ఆడుకుంటారు. సాయంత్రమయ్యేసరికి తల్లిదండ్రులు అక్కడికి చేరుకుని వండిపెడితే తిని పడుకుంటారు. ఇదీ వాళ్ళ బాల్యావస్థ.

ఆమె ఎక్కడనుంచీ వచ్చేదో అక్కడికి ఆ పిల్లలవి బాగా చేరదీసేది. వాళ్ళతో ఆడుకునేది. తమ పిల్లలకి పెద్దతోడుగా తాము పనుల్లోకి పోయినా వుంటుందికదాని పెద్దలు సంతోషించారు.

ఆరోజు పనులనుండి పెద్దవాళ్ళు తిరిగొచ్చేసరికి ఓ పాప చచ్చి పడివుంది. మెడమీద గాట్లున్నాయి. ఏ కుక్కో కరిచిపడేసి వుంటుందనుకుని తల్లిదండ్రులు ఏడ్చి వూరుకున్నారు

మరికొన్ని రోజుల తర్వాత మరో పాపకూడా అదే గతి పట్టింది. ఆ ఘాతుకాన్ని కళ్ళారా చూసిన వ్యక్తి నల్గురికీ చెప్పాడు. లేకపోతే ఆ పాపని ఏ కుక్కో కరిచిందని ఏడ్చి వూరుకునేవాళ్ళు.

ప్రేమతో పిల్లల్ని చేరదీసిన ఆమే ఎవ్వరూ లేనప్పుడు మెడదగ్గర కొరికి రక్తం పీల్చి పిల్లల్ని చంపింది!

అందరూ హడలిపోయి పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు. పోలీసులు వచ్చి ఆమెను అరెస్ట్ చేసారు.

ఆమెకు యావజ్జీవ కారాగార శిక్ష వేసారు. ఆరు సంవత్సరాల క్రితం ఆమెకు 20సం. వయసు ఉన్నప్పుడు జైలుకొచ్చింది.

మూడో పిల్లాడు పుట్టగానే ఆమె మతి భ్రమించింది. అప్పటినుండి రక్తం దాహంతో పిల్లలకోసం వేట ప్రారంభించింది. బయటవాళ్ళ పిల్లల్ని ఇద్దర్ని చంపి రక్తం తాగిందికాని తన ముగ్గురు పిల్లల్లో ఎవ్వర్నీ ఏమీ

చేయలేదు. మొదట్లో మరీ పిచ్చిగా వుండేది. ఒకసారి మాట్లాడే మాటకు మరోసారి మాట్లాడే మాటకు సంబంధం వుండదు. కనిపించిన పువ్వులు అన్నీ అలంకరించుకుని కాలేజీకి వెళుతున్నానంటూ పుస్తకాలు పుచ్చుకుని బయల్దేరినట్లు నటిస్తూ బయల్దేరుతుంది.

మానసిక వైద్య నిపుణులతో చికిత్స చేయించారు. ఇప్పుడు పిచ్చి కొద్దిగా తగ్గింది. కానీ పూర్తిగా తగ్గలేదు. జైలులో వున్న మిగతావాళ్ళ పిల్లల్ని చాలా చక్కగా చూసుకుంటూ వుంటుంది. డెప్యూటీ సూపరింటెండెంట్ గారి రూమ్ దగ్గర అటెండర్ గా వుంటోంది.



పిల్లల రక్తం తాగిన ఓ తల్లి

మాటిమాటికీ "నన్నెప్పుడు ఇంటికి పంపిస్తారు?" అని అడుగుతుంటుంది.

"పిల్లల్ని ఎందుకు చంపావ్?" అని అడిగినప్పుడు కనుబొమ్మలు ముడివేసి నేనెందుకు చంపాను.... నేనేమీ చంపలేదు...." అంటూ బుకాయించింది.

"పిల్లల రక్తం తాగితే ఏవైనా శక్తులు వస్తాయని చెప్పారా? ఎందుకు రక్తం తాగావ్?" మళ్ళీ అడిగితే "నేనే పిల్లల్ని చంపలేదు. నన్ననవసరంగా తీసుకొచ్చి ఈ జైల్లో పారేసారు. అసలు పిల్లలంటే నాకెంతో ఇష్టం. ఈ జైల్లోవున్న ఎవరినయినా అడగండి వాళ్ళ పిల్లల్ని ఎంత ప్రేమగా చూసుకుంటానో...." అంది.

అది నిజమేనని అందరూ అన్నారు. ఇప్పుడు పిల్లలందర్నీ ఎంతో చక్కగా ఆడిస్తుందిట.

"నీ పిల్లల్ని ఎవరు చూసుకుంటూ వుంటారు? నీ భర్తా?"

"నా భర్తా? వాడెక్కడున్నాడు? ఎప్పుడో వెళ్ళిపోయాడుగా! మా అమ్మ చూసుకుంటోంది...." అని నాతో అని "అమ్మా! మా అమ్మకి ఈనెల పైసలు పంపారా?" అని డెప్యూటీ సూపరింటెండెంట్ సరోజిని గారిని అడిగింది.

కుటుంబానికి ముఖ్యాధారమైన వ్యక్తి జైలుకి వస్తే ఆ కుటుంబ సభ్యులు ఆకలితో అలమటించకుండా వాళ్ళకి నెలకి వంద రూపాయల చొప్పున ప్రభుత్వం పంపిస్తుంటుంది. ఆ డబ్బుకోసమన్న మాట ఆమె అడిగింది.

"మా యమ్మ బాగా ముసలిదైపోయింది. వాళ్ళనెలా పోషిస్తుందో...." తల్లి గురించి బాధ పడుతుంటుంది.

ఈమెను చూడడానికి కూడా ఆ తల్లి జైలుకి వస్తుంటుందిట. రెండు సంవత్సరాలకి ఒకసారి "ఫర్లో" అనే శలవుమీద రెండు వారాల పాటు ఖైదీలు ఇళ్ళకి వెళ్ళి రావచ్చు. అలా ఈమధ్య శలవుమీద ఇంటికి కూడా వెళ్ళి వచ్చింది. ఈమె ప్రవర్తనలో ఇదివరకటికన్నా చాలా మెరుగుదల కనిపించిందంటున్నారు జైలు అధికారులు.

# తండ్రిని చంపిన తనయుడు

ఆడవాళ్ళు కనిపిస్తే చాలు కొంతమంది ఎన్ని వికార చేష్టలు చేస్తారో వాళ్ళకే తెలీదు. వయసులోవున్న వాళ్ళయితే "పోనీలే ఆ వయసు అటువంటిది" అని కొంతవరకూ సరిపెట్టుకోవచ్చు. వయసు ఎక్కువగా వుండి తన కూతుళ్ళతోనో కోడళ్ళతోనో వికార చేష్టలు చేస్తే ఎవరు చూస్తూ వూరుకోగలరు?

అతను పోలీస్ కానిస్టేబుల్‌గా చేసి రిటైర్ అయ్యాడు. సర్వీస్‌లో వున్నప్పుడు ఎలాంటి వికార చేష్టలు చేసాడో ఎవరికీ తెలీదుగాని రిటైరై అంతకు ముందెప్పుడో సంపాదించుకున్న ఆరెమ్పీ డిగ్రీతో వైద్యం చేస్తూ దగ్గరకి వచ్చిన ఆడ పేషంట్ లందరితోనూ విపరీతంగా ప్రవర్తించే వాడు.

ఆయన ప్రవర్తనకి ఇంటిల్లిపాదీ కుళ్ళిపోయేవారు. ఎవరైనా గోల చేస్తే తమ కుటుంబం పరువు బజార్న పడుతుందేమోనని భయపడిపోయే వారు. తొమ్మిదిమంది మొగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలూ కూడా తండ్రికి ఏమీ చెప్పలేక పోయేవారు. ఒకవేళ ఎవరైనా ధైర్యం చేసి చెప్పడానికి ప్రయత్నించినా అతను వాళ్ళమాట వినేవాడుకాదు. తాగివచ్చి ఇంటిల్లి పాదినీ బూతులు తిట్టేవాడు.

పెద్ద కొడుకుకి పెళ్ళయింది. కోడలితో ఏదో అసభ్యంగా మాట్లా డితే వాళ్ళు వేరే వెళ్ళిపోయారు

ఒక రోజున సొంత కూతురితో కూడా అసభ్యంగా ప్రవర్తించ బోయాడు. మూడో కొడుకుకి ఇరవైనాల్గు సంవత్సరాలుంటాయి. ఆ వుడుకు రక్తం ఈ దారుణాలన్నింటిని సహించలేకపోయింది. తండ్రికి ఎదురు తిరిగాడు, కొట్టాడు.

అసలే తాగివున్న అతను కొడుకు కొట్టేసరికి రెచ్చిపోయి "కొడుకుల్ని నా మీదకి వుసిగొల్పుతున్నావ్" అంటూ భార్యని కొట్టబోయాడు రోకలితో. ఇంతలో మూడో కొడుకు అతడిని పక్కకి తోసాడు. తాగి వుండడంతో సరయిన బాలన్స్‌లేక అతను పక్కకి పడిపోయాడు. పెద్దగా బూతులు తిట్టసాగాడు.

చుట్టుపక్కల వాళ్ళందరూ తమగోల వింటారేమోనన్న భయంతో తండ్రినోరు మూయించాలని మూడోకొడుకు వంటింట్లోకి వెళ్ళి మాంసం కొట్టే కత్తిని పట్టుకొచ్చాడు. అడ్డు రాబోయిన తల్లిని వంటగదిలో వేసి బయట గొళ్ళెం పెట్టాడు. ఆ కత్తితో తండ్రి తల నరికాడు.



తండ్రిని చంపిన తనయుడు

తండ్రి తల నరికినందుకు అతనికి వురిశిక్ష వేశారు. కానీ వయసు తక్కువ వుండడంతో, కుటుంబగౌరవం కాపాడుకోవాలనే తపనతో అలా చేయడంతో— వురిశిక్షని యావజ్జీవ కారాగారశిక్షగా తగ్గించారు. ఇప్పుడు హైద్రాబాద్ సెంట్రల్‌జైల్లో వున్నాడు.

"తండ్రిని ఎలా చంపగలిగావ్?" అని అతడిని అడిగినప్పుడు,

మా నాన్న బాగా తాగేవాడండి అంతేకాకుండా ఆడవాళ్ళందరితోను అసభ్యంగా ప్రవర్తించే వాడండి. చివరికి కోడలు, కూతురుతో కూడా అతడిని ఎలా కంట్రోల్ చెయ్యాలో అర్థమయ్యేదికాదు. కుటుంబగౌరవం రోడ్డున పడుతుందని భయం వేసేది. కేవలం అతడిని కత్తితో చిన్న గాయం చేసి భయపెట్టాలనుకున్నానండి. కానీ చిన్న దెబ్బ తగలగానే అతను తిట్టడం ప్రారంభించేసరికి తట్టుకోలేక తల నరికేసానండి...."

"మరి మీ అన్నదమ్ములు, తల్లి ఎవ్వరూ అడ్డురాలేదా?"

"అమ్మని వంటింట్లో పెట్టి బయట గొళ్ళెం పెట్టానండి. తల నరికేస్తానని నేనే అనుకోలేదండి. మిగతావాళ్ళు ఈపరిణామాల్ని ఎలా వూహిస్తారు. తండ్రి చనిపోగానే నేనే వెళ్ళి పోలీసులకి లొంగిపోయానండి...."

"మీ అన్నదమ్ములు ఇప్పుడు నిన్ను పలకరిస్తారా?"

"నామీద ఎవరికి కోపం లేదండి. ఎటువంటి పరిస్థితుల్లో నేనా హత్య చేసానో అందరికీ తెలుసు. కాకపోతే చిన్నతమ్ముడు "ఎంత పాపాత్ముడైనా తిండిపెట్టే నాన్నని చంపకుండా వుండాల్సింది. నువ్వేమో జైల్లో కూర్చున్నావ్. మేము ఆకలితో మాడిపోతున్నాం! అని అన్నప్పుడు నా కడుపులో దేవినట్లయిందండి.

నేను కుటుంబగౌరవం ఒక్కటే ఆలోచించానుగాని ఆయన చనిపోతే చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు ఎవరు చేస్తారు, మిగతా ఆరుగురు పిల్లలకి తిండి చదువు ఎలా అని నేను ఆలోచించలేదండి. వాళ్ళందరి బ్రతుకులూ నావల్ల రోడ్డున పడ్డాయి వాళ్ళకి ఏ సాయమూ చేయలేని పరిస్థితిలో నేను జైల్లో వున్నాను. అందుకనే దయగల వాళ్ళెవరైనా తమ తప్పులేకుండా శిక్షని అనుభవిస్తున్న నా తల్లి, తమ్ముళ్ళు చెల్లెళ్ళకి అండగా నిలుస్తే బాగుండునని రోజూ వేయిదేవుళ్ళకి మొక్కుకుంటూ వుంటాను" అన్నాడతను.

తర్వాత మళ్ళీ జైల్‌కి వెళ్ళినప్పుడు "సార్....నేను చెప్పిన విష

యాలన్నింటినీ రాసేయకండి. ఏ కుటుంబపరువు నిలపాలని నేనింత కిరాత కానికి పాల్పడ్డానో ఆ కుటుంబ పరువు కాస్తా బజారుపాలవుతుంది" అంటూ ప్రాధేయపడ్డాడు.

"నీ పేరూ వూరూ రాయను కాకపోతే నీ కథ నీ తండ్రిలాంటి వాళ్ళెవరయినావుంటే వాళ్ళకి కనువిప్పు కలిగిస్తుంది. అలాగే నీ తొందర పాటు మన స్తత్వం వున్నవాళ్ళని కాస్త అదుపులో పెడుతుంది కూడా!"

"సార్ పేరు లేకపోతే మా కుటుంబానికి సాయం చేయాలని ఎవ రైనా అనుకుంటే ...."

"హైద్రాబాద్ సెంట్రల్‌జైల్ సూపరింటెండెంట్‌గార్ని కలుసు కుని నీ వివరాలు తీసుకుంటారులే...." అన్నాను.

# ఆవేశమే అనర్థాలకు మూలం

అందరి ఆడపిల్లలకి లాగానే ఎన్నో ఆశలతో, కోరికలతో అత్తా రింట అడుగు పెట్టిందామె. అప్పుడు వయసు కేవలం ఇరవై సంవత్స రాలే!

వాళ్ళింట్లోనే ఒకావిడ పనిచేస్తూండేది. ఆమెకు, తన భర్తకుమధ్య అక్రమసంబంధం వుందనే విషయం ఆమెకు తెలీడానికి ఎక్కువకాలం పట్టలేదు. కానీ అప్పటికే ఆమె గర్భవతికూడా అయింది.

బాధపడింది. బ్రతిమాలింది. మొత్తుకుంది. అయినా భర్త చలించ లేదు. పెళ్ళయిన తర్వాతకూడా అతను తన పాత సంబంధాల్ని నిర్విఘ్నంగా కొనసాగిస్తూనే వున్నాడు.

నెలలు నిండుతున్నకొద్దీ ఆమెలో ఆవేదన పెరగసాగింది. మన

సుని పిండేసినట్లు బాధపడుతుండేది. ఎవ్వరూ ఆబాధని అంతగా పట్టించు కోలేదు.

ప్రసవించింది.

పచ్చి బాలింతరాలుగా వున్నప్పుడు కూడా తన ఆరోగ్యంకన్నా కూడా భర్తప్రవర్తన గురించి తెగ ఆలోచించసాగింది.

అతనికి చెప్పి లాభంలేదు. అతను అసలు పట్టించుకోడు. ఆమెను బెదిరిస్తే.... అనిపించిందామెకి.

ఆ రోజున ఆమె పదిహేనురోజుల పచ్చి బాలింత. ఆలోచనలతో వచ్చిన కోపానికి తట్టుకోలేక తన భర్తతో అక్రమ సంబంధం పెట్టుకున్న పనిమనిషిని నాల్గు దులిపేద్దామని ఇంట్లోంచి బయటికొచ్చింది. అప్పుడా పనిమనిషి ఎటో వెళ్ళింది. కనిపించలేదు. భర్త, అత్తగారుకూడా ఇంట్లో లేరు.

ఆరు సంవత్సరాల వయసున్న పనిమనిషి కొడుకు ఒక్కడే అక్కడ ఆడుకుంటూ కనిపించాడు.

ఆమె కోపమంతా ఆ కుర్రాడి మీదకి మళ్ళింది.

అతని తల్లిచేసే తప్పుడుపనికి ఆ కుర్రాడు ఎంతవరకూ బాధ్యుడనే ఆలోచన ఆమెకు అప్పుడు రాలేదు. ఆ ముక్కుపచ్చలారని కుర్రాణ్ని చంపితే తనభర్తలో ఎట్లా మార్పు వస్తుందని కూడా ఆమె ఆలోచించ లేదు. భర్తమీద, ఆ కుర్రాడి తల్లిమీదవున్న కోపాన్నంతట్నీ ఆ కుర్రాడి మీదకి మళ్ళించి, అతని దగ్గరకొచ్చింది.

అమాయంగా ఆడుకుంటున్న ఆ కుర్రాడు ఈమె దుర్మార్గపు ఆలో చనలను పసిగట్టలేదు. ఆనందంగా తన ఆటలో నిమగ్నమైపోయి వున్నాడు.

ఒక్కసారిగా అతడి నెత్తుకుందామె.

'ఎప్పుడూ కసురుకునే అమ్మగారు తననలా ఎందుకెత్తుకుందో వాడికి అర్థంకాక ఆమెవంక విచిత్రంగా చూడసాగాడు.

అ ఇంటి ఆవరణలో ఓ బావి వుంది.

పిల్లాణ్ని ఎత్తుకున్న ఆమె అటు నడవసాగింది.

ఆమె మనసు మొద్దుబారిపోయి వుంది. తనేమిచేస్తోందో ఆమెకే అర్థంకావడంలేదు....

బావి దగ్గరకు చేరుకోగానే చేతుల్లోని కుర్రాణ్ని దావిలో పడేసింది. ఇంట్లో ఎవ్వరూ లేకపోవడంతో ఆ కుర్రాడి ఆర్తనాదాలు ఎవరికీ వినిపించలేదు. ఆఖరికి అ బావిలో మునిగి చనిపోయాడు ఆ బాలుడు. ఆమె వచ్చి తన మంచంమీద పడుకుంది.

కొంతసేపయిన తర్వాత ఒక్కొక్కరే ఇంటికి రాసాగారు....



బావిలో తేలుతున్న కుర్రాడి శవాన్నిచూసి కెవ్వుమంది తల్లి. అందరూ వచ్చేసారు. ఆ కుర్రాడి శవాన్ని బయటికి తీసారు.

ఆడుకుంటూ బావిలో పడుంటాడని అందరూ అనుకున్నారు. ఎవరికీ బాలింతరాలిమీద అనుమానం కలగలేదు.

అసలే సున్నిత మనస్కురాలైన ఆమె తను చేసిన పాపానికి తనే మిన్నకుండలేకపోయింది. మనసులో బడబాగ్ని దాచుకోలేక జరిగిన విషయాన్నంతటినీ పూసగుచ్చినట్లు భర్తకు చెప్పేసింది.

అతను కోపంతో, వూగిపోయాడు. వెంటనే ఈ విషయాన్ని పోలీసులకు రిపోర్ట్ చేసాడు. పోలీసులువచ్చి అరెస్ట్ చేసారు కోర్టులో విచారణ జరిగింది. తనుచేసిన తప్పుని ఆమె వప్పుకుంది. యావజ్జీవ శిక్ష విధించారు.

భర్త మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడుట. ఆ పనిమనిషి ఎటుపోయిందో తనకు తెలీదంటోంది ఆమె.

అనవసరంగా ఆ కుర్రాణ్ని చంపినందుకు ఇప్పటికే ఆమె బాలా బాధపడుతోంది. మానసికంగా ఆమె పడుతున్న బాధని చూస్తుంటే చేసిన తప్పుకు రెట్టింపు శిక్షని అనుభవిస్తున్నట్లే అనిపిస్తోంది.

సాధారణంగా శిక్షపడ్డాకూడా ఖైదీలందరూ తాము తప్పుచేయ లేదంటూ ఏవేవో కథలు చెబుతుంటారు. ఈమె తాను చేసిన తప్పుని కోర్టులోను, ఇప్పుడూకూడా వప్పుకుంటోంది. పైగా తను చేసిన తప్పుకి విపరీతమైన మనస్తాపానికి గురవుతోంది కూడా.

తన సత్ప్రవర్తనతో హైదరాబాద్ ఆడవాళ్ళ జైల్ ఆఫీసర్లని కూడా ఆకట్టుకుంటోదీమె. అందుకన్ని డెప్యూటీ సూపరిండెంట్, మాట్రన్ మొదలయిన అధికారులు రిజిస్టర్లు అందించడం లాంటిపనులు ఆమెతో చేయించుకుంటున్నారు. ఎవరితోనూ ఎటువంటి తగాదాలు లేకుండా తన పనిని తను చేసుకుపోతుంటుందామె.

రెండేళ్ళకోసారి శలవు దొరికినప్పుడు ఇంటికెళ్ళి తల్లి, తన పిల్లతో ఆనందంగా గడిపివచ్చి, మిగతా కాలమంతా మళ్ళీ శలవు ఎప్పుడొస్తుందాని ఎదురు చూడటంలోనే గడిపేస్తోంది.

సరిగా నేను ఇంటర్వ్యూ కోసం జైలుకి వెళ్ళిన రోజునే ఆమెకు రెండువారాలపాటు ఇంటికివెళ్ళి రావడానికి శలవు గ్రాంట్ అయి వచ్చింది. ఆమె ఆనందం వర్ణనాతీతం....!

ఇప్పుడామె వయసు 26సం. కేవలం 6 సంవత్సరాల శిక్షని

మాత్రమే పూర్తిచేసింది. ఇంకా కనీసం 14 సం. అన్నా జైలులో గడపాలి....!

ఈమె ఎంత దురదృష్టవంతురాలు అంటే సరిగ్గా ఆమె శిక్షపడ్డ రోజుకు ముందురోజునుంచే యావజ్జీవ శిక్షని అనుభవిస్తున్న ఖైదీల నియమావళిలో మార్పువచ్చింది.

అంతకుముందు రెమిషన్స్‌తో కలుపుకుని ఏడు సంవత్సరాలు శిక్ష అనుభవిస్తే చాలు అడ్వయిజరీ కమిటీ ముందుకు రావడానికి వీలుండేది. ప్రవర్తన బాగుందని భావిస్తే అడ్వయిజరీ కమిటీ ఆ ఖైదీ విడుదలకు సిఫార్సు చేసేది.

రెమిషన్స్‌తో కలుపుకుని ఏడుసంవత్సరాలు అంటే అయిదు సంవత్సరాలు శిక్ష అనుభవిస్తేచాలు. ప్రవర్తన బాగావుంటే విడుదలవడానికి అవకాశముండేది. ఇప్పుడు రెమిషన్స్ కాకుండా 10సం. శిక్ష అనుభవిస్తే గాని అడ్వయిజరీ కమిటీ ముందుకు రావడానికి వీలులేదు. ఎంత ప్రవర్తన బాగున్నా! 21-12-79న ఆమెకు శిక్షపడింది. 20-12-79నుంచి కొత్త రూలు అమలులోకి వచ్చింది.

# తండ్రులారా! గుర్తుంచుకోండి!!

అతని పేరేదయితే మనకేమిటి అతని వయసుమాత్రం ముప్పై సంవత్సరాలుంటాయి కడపలో ఓ ప్రింటింగ్ ప్రెస్‌లో కంపోజిటర్‌గా పని చేస్తున్నాడు. ఇంటర్మీడియట్‌తో చదువాపేసి ఉద్యోగంలో చేరాడు. పెళ్ళి చేసుకోలేదు.

అతని తల్లితండ్రి అతి తరచుగా పోట్లాడుకుంటూ వుండేవారట.

పోట్లాడుకున్నప్పుడల్లా తండ్రికొట్టేవాడు. తల్లి పుట్టింటికి వెళ్ళిపోయి కొన్నాళ్ళుండి వచ్చేది. మళ్ళీ పరిస్థితులు మామూలే.

ఒకరోజున అతను స్నేహితుల్తో కలసి సినిమాకి బయల్దేరాడు. హడావిడిగా టైమైపోయిందని వెళుతున్న అతడిని తండ్రి ఆపాడు. అప్పుడు తల్లి అక్కడలేదు. తండ్రితో పోట్లాడి పుట్టింటికి వెళ్ళింది.

"బీడీలు తాగుతున్నావా?" కొడుకు జేబువంక చూస్తూ అడిగాడు తండ్రి.

కొడుకుకు చాలా కోపం వచ్చింది "అసలే సినిమాకి టైమైపోయిందని కంగారు పడుతుంటే ఈ ముసలాడు నస ఇప్పుడు మొదలెట్టాడు ఏమిటా?" అని.

"ఆ విషయం తర్వాత మాట్లాడుకుందాంలే ...." ముందుకు కదల బోయాడు కొడుకు.

"నేను పిలుస్తుంటే వినిపించదంటా ఆ వెధవ బీడీలు మానేయ్" తండ్రి వికటిపెట్టలేదు.

కొడుకులో అసహనం పెరిగింది.

"సినిమానుంచి వచ్చిన తర్వాత మాట్లాడుకుందాంలే ...."

"సినిమా నీకు అంత అర్జంటు అయిందా, అయినా అసలు నీకు భయం, భక్తిలేకుండా పోయింది. బీడీలు తాగవద్దని ఎన్నిసార్లుచెప్పాల్రా నీకు లంజకొడకా...." అంటూ తండ్రి బూతులు తిట్టసాగాడు.

కొడుకు కోపం తారస్థాయికి చేరుకుంది.

"నాన్నా! ఆఖరిసారిగా చెబుతున్నాను తిట్టకు"

"తిడితే ఏం చేస్తావురా?"

"చంపేస్తాను"

"చంపు చూద్దాం...."

మాటామాటా పెరిగింది. వెంటనే కొడుకు దొడ్లోకివెళ్ళి కట్టెలు

కొట్టే గొడ్డలిని పట్టుకొచ్చాడు. తండ్రి ఇంకా తిడుతూనే వున్నాడు. మంచంమీద కూర్చొని.

గొడ్డలితో తండ్రి మెడమీద ఒక్కవేటు వేసాడు. జివ్వున నాల్గు మూలలకీ చిందింది రక్తం. తండ్రి మెడ సగం వరకు తెగింది బాధతో కొట్టుకోసాగాడు.

"నా కన్నతండ్రి నాకంటి ముందు అలా నరకయాతన పడడం చూస్తూ భరించలేక పోయాను వెంటనే రెండో వేటు వేసాను. తల తెగి అవతల పడింది" అన్నాడు శిక్షని అనుభవిస్తున్న కొడుకు. తండ్రిని చంపి నందుకు అతనికి యావజ్జీవ ఖైదు విధించారు.



"మీ ఇద్దరిమధ్యా గొడవ జరుగుతున్నప్పుడు చుట్టుపక్కల ఎవ్వరూ లేరా?" అడిగాను.

"చుట్టుపక్కల ఇళ్ళ వాళ్ళందరూ వచ్చి చూస్తున్నారు చోద్యాన్ని. ఒక్కళ్ళూ నన్నాపడానికి కూడా రాలేదు. బహుశా నా చేతిలో గొడ్డల్ని చూసి భయపడుతుంటారు. ఆ తర్వాత నేనే వెళ్ళి పోలీసులకు లొంగి పోయాను" అన్నడతను.

అతని మానసిక స్థితి ఇంకా మెరుగు పడినట్టు లేదు. కదిలిస్తే చాలు ఏవేవో మాట్లాడేస్తున్నాడు. మధ్యలో ఇంగ్లీష్ పదాల్ని మేళవిస్తూ.

అబద్ధాలు చెప్పడం అసలతనికి పడదు.

"మీ నాన్నని నువ్వు చంపలేదని చెప్పు .... శిక్ష తప్పించుకో వచ్చు...." అని అయినవాళ్ళు చాలామంది నచ్చజెప్పినా అతను వినిపించుకోలేదట. తల్లి అంటే ప్రేమ ఎక్కువ. తిట్లని తట్టుకోలేడు. ముఖ్యంగా "లంజకొడకా" లాంటి పదాల్ని.

"అప్పటికీ నేనెన్నోసార్లు మా నాన్నకి చెప్పానుసార్ లంజ కొడకా అని తిట్టద్దని.... అయినా అతను వినిపించుకుంటేగా? నన్ను లంజ కొడకా అని తిడుతుంటే వింటూ ఎలా వూరుకొమ్మంటారు. అందుకే నరికేసాను" అన్నాడు ఖచ్చితంగా.

"తిడితే మాత్రం ఆయన మీ తండ్రికదా?"

"తండ్రి అయితేమాత్రం ఇష్టం వచ్చినట్లు తిడతాడా? పాండురాజు కొడుకులా నేనూ మా నాన్న చనిపోయిన తర్వాత ఆయన రక్తాన్ని తాగాను" అతనలా చెప్పుకుపోతుంటే అందరం అచేతనంగా వింటూ కూర్చుండి పోయాం.

"మేము బ్రాహ్మణులం సార్! అందుకే ఇప్పటికి నాకు అన్నం పెట్టగానే మొదటి ముద్దని కాకులకి పడేస్తాను, పితృపిండంగా ... అర గండి కావాలంటే ఎవరినయినా"

"అవున్సార్ ....అతను చెప్పింది నిజమే.... రోజూ అన్నం తినే ముందు కొంత అన్నాన్ని కాకులకేస్తుంటాడు" ప్రక్కనే వున్న మరో ఖైదీ అతని మాటలకు వత్తాసు పలికాడు.

"ఇప్పటికీ అతనికి ఫిట్స్ వస్తూనే వుంటాయట.... ఫిట్స్ వచ్చిన తరువాత కొంచెంసేపు అతనేమి చేస్తున్నాడో అతనికే అర్థంకాని స్థితిలో వుంటాడు. బీడీలు ఎక్కువగా తాగుతుంటాడు. ఆరోగ్య పరిస్థితి ఏమీ బాగున్నట్లులేదు.

"నువ్విక్కడ ఏమి చేస్తున్నావ్?" అడిగాను.

"బైండింగ్ పని చేస్తున్నాను"

"జీతం ఇస్తారా?"

"రోజుకి లెరూ. ఇస్తారు"

"ఆ పైసలేమి చేస్తావు?"

"మా అమ్మకి పంపిస్తాను...."

"ఎంత తిట్టినా నువ్వు తమాయించుకోవలసింది. తిట్టినవాడు నీ తండ్రేగా?" అన్నాను.

అంతవరకూ అతనిలో వున్న సహనం ఆ ఒక్క మాటతో నశించిపోయింది.

"ఏమిటిసార్ ఈసారిలా అంటాడు" నా పక్కనేవున్న వెల్ఫేర్ ఆఫీసర్‌వేపు తిరిగి అన్నాడు "నాన్నేకాదు ఎవరైనాసరే నన్నలాంటి తిట్లు తిడితే నేనుపడను...." అంటూ చరచరా వెళ్ళిపోయాడు.

"అతనికి కోపంవస్తే పూర్తిగా కంట్రోల్ తప్పుతాడు. అందుకని ఆ పరిస్థితి వస్తే గంజ్‌లోకివెళ్ళి ఓ గది లోపల కాసేపు ఒంటరిగా కూర్చుని, కోపం తగ్గిన తర్వాత ఇవతలికి వస్తాడు. ఇది అతని అలవాటు" నవ్వుతూ అన్నాడు వెల్ఫేర్ ఆఫీసర్ రామ్‌గోపాల్.

# అక్రమ సంబంధాలే అనర్థాలకు మూలం

ఉమ్మడి కుటుంబాలవల్ల మంచీ వుంది, చెడూ వుంది.

అందరి మధ్యా సరయిన అవగాహన వుంటే ఆ కుటుంబం ఆనందంగా ఉంటుంది. అలా కాకుంటే రోడ్డున పడుతుంది.

చదువుకున్న వాళ్ళయితే మనసులో ఏమున్నా సంఘానికి భయపడి అయినా కొన్ని అకృత్యాలకి పాల్పడరు. అందుకే కనీసం, కొంతవర

కయినా చదువు అవసరం. చదువు ఉద్యోగ సముపార్జనకి కాదు–యుక్తాయుక్తాలను తెలపడానికి.

అదొక పెద్ద ఉమ్మడికుటుంబం. ఆ కుటుంబంలో ఎవ్వరూ చదువుకోలేదు. పొలం పనులు చేసుకుని పొట్టనింపుకుంటూ ఉంటారు.

ఆరోజు అన్నదమ్ములు ముగ్గురూ పొలం వెళ్ళారు. రెండవవాడిని పొలంలో రాతితో తలపగలగొట్టి చంపారెవరో.

పదకొండు నెలలపాటు విచారణ సాగింది. ఆఖరికి భర్తని చంపిందంటూ భార్యకి యావజ్జీవ శిక్ష వేసారు.

"నీ భర్తని ఎందుకు చంపావమ్మా?" అడిగాను.



ఆమె పెదవి కదపలేదు. వయసు ముప్పై అయిదు సంవత్సరాలుండవచ్చు.

శిక్షపడడకూడా అయిపోయిందిగా....ఫర్వాలేదు అసలేమిజరిగిందో చెప్పు?" మళ్ళీ అడిగాను.

"నేను చంపలేదు బాబూ...." బిక్కమొహంవేసి అంది. ఏ ఖైదీ అయినా సాధారణంగా చెప్పే జవాబే ఇది. నేరం తాను చేయలేదంటూ

బుకాయిస్తూపోతే ఎప్పుడో ఒకప్పుడు ఏదైనా మేలు జరగవచ్చునేమోనని వాళ్ళ ఆశ! అందుకే శిక్షపడ్డా మేము నేరం చేయలేదనే వాళ్ళ సంఖ్య జైళ్ళలో ఎక్కువ.

"మరెవరు చంపారు?"

"ఆరోజు నేను పొలం వెళ్ళేసరికి మాబావగారు, మా ఆయన, మరిది—ముగ్గురూ కొట్లాడుకుంటున్నారు...."

"ఎందుకని?"

"ఆస్తి తగాదా వుందండి....మా బావగారు, మరిది నేను చూస్తుండగానే ఆయన తలని రాతితో పగలగొట్టారు. తర్వాత పక్కనున్న చెట్టు కొమ్మలు కొన్నింటిని విరిచి క్రిందపడేసారు "ఈ ఆయన ఈ చెట్టుమీద నుంచి క్రిందపడ్డాడని చెప్పాలి....లేకపోతే నిన్నూ చంపుతాము అంటూ బెదిరించారు....అంది

ఆ తర్వాత మళ్ళీ తనే "నాకు మా మరిదికి అక్రమ సంబంధం వుంది. అందుకని మేము ఇద్దరం కలిసి మా ఆయనని చంపామని కేసు పెట్టారు నేను చంపలేదు. మా బావగారే బెదిరించి అలా పోలీస్‌స్టేషన్‌లో చెప్పేట్లు చేసారు...." అంది.

"ఒకసారి చెప్పిన మాటకి, మరోసారి చెప్పిన మాటకి ఎంతో తేడా వుంది.

ఆ తర్వాత ఈమె కేసుతాలూకు కొన్ని కాగితాల్ని చదవగా అసలు విషయాలు బయటికొచ్చాయి.

మరిదితో ఈమెకు అక్రమ సంబంధం వున్నమాట వాస్తవమే! అతనితో ఆనందంగా గడపడానికి భర్తని అడ్డుతొలగించాలనుకుంది. తొలగించింది. ఆ నేరాన్ని మరిది మీదకితోసివేయాలని ప్రయత్నించింది. కుదరలేదు. ఆఖరికి ఆమెకే శిక్ష పడింది.

అక్రమసంబంధాలు ఎన్నో అనర్థాలకు మూలం. అందుకే "పెళ్ళి" పేరుతో "సెక్స్" వాంఛలను పరిమితం చేసారు ఒక మగాడికి ఒక ఆడదానితోనే కామ సంబంధాలుంటే ఏ గొడవా వుండదు. లేకుంటే గొడవలు తప్పవు!

# ఖైదీలను కలుసుకున్న గవర్నర్

అప్పుడు ఉదయం సరిగ్గా పదకొండు గంటలు.

తేదీ 6-7-86

గవర్నర్ కుముద్‌బెన్‌జోషి సికింద్రాబాద్ డిస్ట్రిక్ట్ జైలులోకి అడుగుపెట్టారు. అధికారులందరూ గౌరవంతో ఆవిడకు స్వాగతం పలికారు. తనకు వేసిన దండనుతీసి ఆవిడ ఓ ఖైదీకి వేసారు. చప్పట్లు మారుమ్రోగాయి.

సరాసరి గవర్నర్ జైలులోని బారెక్స్‌వేపు దారితీసారు. ఆఫీసర్లు ఆవిడని అనుసరించారు.

గవర్నర్‌గారు ముందుగా ఖైదీలకోసం వండిన వంటని రుచి చూశారు. తర్వాత ఖైదీలను కలుసుకుని వాళ్ళ సాధక బాధలను విచారించారు. తర్వాత జైలులోని స్టేజ్ దగ్గరకు వచ్చారు.

ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ సభ్యులతోను, పత్రికావిలేఖరులతోను, జైలు సిబ్బందితోపాటు మరికొంతమంది ముఖ్యులతోను ఆ ప్రదేశం కళ కళలాడుతోంది. ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ హైద్రాబాద్ జిల్లా శాఖ కలర్ టెలివిజన్ సెట్‌ని సికింద్రాబాద్ జైలుకి గవర్నర్‌గారిద్వారా అందచేయడానికి ఏర్పాటు చేసిన సభ అది.

జైలుగోడలలోపల ఏర్పాటుచేసిన సభ కావడంతో ఖైదీలందరూ కూడా ఆ ఉత్సవాన్ని కళ్ళారచూసి గవర్నర్, స్పీకర్ల సందేశాలను వినడానికి అవకాశం కలిగింది. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ స్పీకర్ శ్రీ జి. నారాయణరావు ఈ సభకు అధ్యక్షత వహించారు. ముషీరాబాద్ ఎమ్మెల్యే

శ్రీ నాయని నరసింహారెడ్డి జైళ్ళవిభాగం డైరెక్టర్ జనరల్ శ్రీ ఎమ్. ఎ. షఫియుల్లాఖాన్ కూడా వేదికని అలంకరించారు.

హైదరాబాద్ జిల్లాకలెక్టర్ మినీమాథ్యూస్ సభకి స్వాగతం పలికారు. డైరెక్టర్ జనరల్ శ్రీ షఫియుల్లాఖాన్ జైళ్ళవిభాగంలో జరుగుతున్న విస్తరణ సంక్షేమ కార్యక్రమాల్ని వివరించారు. సికింద్రాబాద్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ ఫిలిప్స్ తమ ప్రసంగంలో సికింద్రాబాద్ జైలు పరిస్థితుల్ని విశదీకరిస్తూ "పత్రికావిలేఖరులు జైళ్ళలో జరిగిన అవకతవకల్ని రాస్తున్నారేగాని మంచివిషయాల్ని ప్రజలకి తెలియజెయ్యడంలేదు" అన్నారు. (ఈ విషయంలో స్వాతికి మినహాయింపు వుంది)



ఖైదీలకు, ఆఫీసర్లకు మధ్య మంచి అవగాహన వుందనే విషయం చక్కగా సభని నిర్వహించిన తీరు చెబుతోంది.



అసెంబ్లీ స్పీకర్ శ్రీ జి నారాయణరావు విచారణ పూర్తి కాకుండా ముద్దాయిలను జైలుకి పంపడం మంచిపద్ధతికాదు. సికింద్రాబాద్ జైలు చాలా చక్కగావుంది అంటూ ఖైదీలలో మార్పు తీసుకురావడానికి జైలు అధికారులు చేస్తున్న కృషిని ప్రశంసించారు శాసనసభ్యుడు నరసింహారెడ్డి టెలివిజన్ సౌకర్యంతో ఖైదీలు ప్రపంచ విశేషాలు తెలుసుకోవడానికి వీలవుతుందన్నారు.



గవర్నర్ కుముద్‌బెన్‌జోషి మాట్లాడుతూ "ఈ నేరస్థులలో పరివర్తన తీసుకురావడానికి ప్రభుత్వం చేస్తున్న పనులకు ప్రజల సహకారం కూడా తోడైతేగాని నేరస్థుల్ని పూర్తిగా సంస్కరించడానికి వీలుకాదు. స్వచ్ఛందసేవా సంస్థలవాళ్ళు ఈపనికి పూనుకోవాలి. జైళ్ళకివచ్చి నేరాలు చెయ్యడంవల్ల కలిగే నష్టాలని వివరిస్తూ నేరస్థుల ఆలోచనలు సక్రమమైన మార్గంలోకి మళ్ళించడానికి ఖైదీల పునరావాసానికి పథకాలు రూపొందించడానికి ముందుకు రావాలి. జైలు అధికారులకు నేరస్థుల సంస్కరణలో తోడ్పడాలి" అన్నారు.

# పాపాన్ని అసహ్యించుకో! పాపుల్ని కాదు!

"పాపాన్ని అసహ్యించుకో.... కానీ ఆ పాపాన్ని చేసినవాణ్ణి మాత్రం అసహ్యించుకోకు.... వాళ్ళలో మార్పు తీసుకు రావటానికి ప్రయత్నించు...." అన్నారు గాంధీగారు.

ప్రస్తుత సమాజంలో పరిస్థితుల ప్రభావంవల్ల చేసే నేరాలే ఎక్కువవుతున్నాయి. అందుకే జైళ్ళని శిక్షా సంస్థలుగా కాక శిక్షణా సంస్థలుగా తీర్చిదిద్దుతున్నారు.

గాంధీ పుట్టినరోజుని ఖైదీల సంక్షేమ దినంగా రాష్ట్రంలోని జైళ్ళన్నింటిలోనూ ఘనంగా జరుపుకున్నారు.

1986 అక్టోబర్ 2న సికింద్రాబాద్ జైల్లోకూడా ఖైదీల సంక్షేమ దినం ఎంతో వైభవంగా జరిగింది.

ఆరోజు వేడుకల్ని హైద్రాబాద్ జిల్లా కలెక్టర్ మినీ మాథ్యూస్‌గారు ప్రారంభించారు. ఖైదీలతోపాటు జైలు సిబ్బందికూడా ఈ వేడుకల్లో ఎంతో వుత్సాహంతో పాల్గొన్నారు. సూపరింటెండెంట్ శ్రీ ఎమ్. ఆర్. అహమ్మద్ సికింద్రాబాద్ జైలుగురించి పరిచయ వాక్యాలు చెప్పారు.

ముఖ్య అతిథిగా వచ్చిన హైద్రాబాద్ మెట్రోపాలిటన్ సెషన్స్ జడ్జి శ్రీ పి. వి. విద్యాసాగర్ "కోర్టులు తక్కువ జనం ఎక్కువ వుండడంతో విచారణకు ఎక్కువకాలం పడుతోంది. ముందు ముందు ఇంకా త్వరిత గతిన విచారణ పూర్తయ్యేటట్లు చూస్తా"మని ఖైదీలకు హామీ ఇచ్చారు.

లయన్స్ డిస్ట్రిక్ట్ గవర్నర్ లయన్ జి. మనోహరరావు ఖైదీల సంక్షేమంకోసం ఓ క్రొత్త ప్రణాళికను రూపొందించాము. త్వరలో అమలు జరుపుతామని అన్నారు. సికింద్రాబాద్ జైలు ఖైదీలకు వాయి ద్యాలను బహూకరించారు. త్వరలో పుస్తకాలనుకూడా బహూకరిస్తా మన్నారు. ఖైదీల సంక్షేమంకోసం ఏ ప్రణాళికను చేపట్టడానికయినా లయన్స్‌క్లబ్ వెనుకాడదని ఆయన అన్నారు.

వారం రోజులపాటు జరిగిన ఆటల పోటీలలో బహుమతి పొందిన ఖైదీలకు కలెక్టర్ మినీమాథ్యూస్‌గారు బహుమతుల్ని పంచిపెట్టారు. తర్వాత శ్రీనివాస్ అనే ఓ ఖైదీ చక్కటి మిమిక్రీచేసారు. శంకర్ అనే మరో ఖైదీ నడకలలో రకాల్ని చూపించి అందర్నీ నవ్వుల్లో ముంచె త్తారు.

ఆఖర్న ఖైదీలకు ఆహ్లాదాన్ని పంచిపెట్టడానికి శ్రీ బి.వి. పట్టాభి రామ్ తన శిష్యులతో కలసి మాజిక్‌ని, శ్రీ జి.వి.ఎన్. రాజు మిమిక్రీని చేసి అందర్నీ ఆనందపరిచారు.

ఖైదీల సంక్షేమ కార్యక్రమాలతోపాటు ఖైదీలలో మానసిక పరి వర్తనని తెచ్చే కార్యక్రమాల్నీ అన్ని జైళ్ళలో చేపట్టాల్సిన అవసరం చాలావుంది.

# ధనమూలమిదమ్ జగత్

అక్రమ సంబంధాల వల్లనే నేరాలు చేసి జైలుకి వచ్చిన వాళ్ళ తర్వాత డబ్బుకోసం నేరాలుచేసి జైలుకి వచ్చిన వాళ్ళ సంఖ్య ఖైదీలలో ఎక్కువగా కనిపిస్తుంది.

అన్యాయంగా వదులపోమ్మో, ప్రభుత్వం సొమ్మో స్వార్జితం చేసు

కోవాలని ప్రయత్నించి జైలుకొచ్చిన వాళ్ళేకాదు తమ సొమ్ము తాము తీసుకోవాలనే తపనతో నేరాలు చేసిన వాళ్ళూ వున్నారు.

అతనికి యాభైనాలుగు సంవత్సరాలు వచ్చేసాయి. భార్య రోగిష్టిది. ఒక్కడే కొడుకు పది సంవత్సరాలుంటాయి. వాడికి బాగాచదువు చెప్పించి తనకు లాగా కాక మంచి బ్రతుకు బ్రతికేలా చూడాలనే తాపత్రయం ఆ తండ్రిలో పెరిగిపోయింది.

అందుకే వాచ్‌మన్ డ్యూటీని విడిచిపెట్టి సైకిల్‌మీద గుడ్డలుతీసు కెళ్ళి అమ్మడం ప్రారంభించాడు.

తన దగ్గరుంటే డబ్బు ఖర్చయి పోతుందని ఎప్పటికప్పుడు కొంత కొంత పైకాన్ని తను బట్టలు తెచ్చే సేఠ్ దగ్గర దాచుకోసాగాడు.

ఎంతో కష్టంతో తను నిల్వజేస్తున్న ఆ సొమ్ము తన కొడుకుచదు వుకు ఉపయోగపడుతుందని అతని ఆశ.

ఒకరోజున సేఠ్ దగ్గరకి వెళ్ళి అంతవరకూ నిల్వ చేసుకున్న సొమ్ము ఇమ్మని అడిగాడు.

"నువ్వు నా దగ్గర దాచినడబ్బేమిటి?" అమాయకంగా పెట్టిన సేఠ్ ముఖం చూసే సరికి అతనికి ముచ్చెమటలు పోశాయి.

బ్రతిమాలాడు....తనెంతో కష్టపడి సంపాదించుకున్న సొమ్ము వాపసు చెయ్యమని కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాడు.

నలభై సంవత్సరాలకే డబ్బాశతో కరడు గట్టుకుపోయిన శేఠ్ గుండెకరగలేదు.

"నువ్వు నాకేమీ ఇవ్వలేదు. పో...."అన్నాడు.

తన వయసేమో పెద్దదైపోయింది. చిన్న పిల్లాడు, రోగిష్టి భార్య ....తన కష్టార్జితం వాళ్ళ అవసరాలకు కాకుండా ఎవరో స్వార్ధపరుడి గల్లా లోకి పోయేసరికి అతను తట్టుకోలేక పోయాడు.... తల్లడిల్లిపోయాడు....

ఆఖరికి ఓ నిశ్చయానికొచ్చాడు.

ఇరవై రూపాయలు పెట్టి ఓ బరిసెని కొన్నాడు.

దాన్ని సైకిల్‌కి కట్టుకుని సేఠ్‌కోసం బయల్దేరాడు.

బెంజికంపెనీ సెంటర్‌కి కాస్త ఇవతలే రోడ్డుమీద సైకిల్‌పై వస్తూ సేఠ్ కనిపించాడు.

అతడి రక్తం వుడికిపోయింది.

చటుక్కున సైకిలుదిగి, అందరూ చూస్తుండగానే బరిసెతో సేఠ్ పొట్టలో పొడిచాడు. అతను కొద్దిగా పక్కకి తప్పుకోవడంతో ఆ పోటు మోకాలికి తగిలింది. వెంటనే సైకిల్‌మీదనుంచీ అతను క్రిందపడ్డాడు.



"నీ డబ్బులు నేను ఇచ్చేస్తానురా....చంపకు...." సేఠ్ బ్రతిమాల సాగాడు.

దాదాపు మూడు వందలమంది చుట్టూ మూగి చూడసాగారు.

సేఠ్ బ్రతికితే తన ప్రాణం ఎక్కడ తీస్తాడో అనే భయంతో వెన్నులో మరో పోటు పొడిచాడతను.

గిలాగిలా కొట్టుకుని చనిపోయాడు సేఠ్. పొడిచిన వ్యక్తి ఆ బరిసెతో సహా పోలీస్ స్టేషన్‌కి వచ్చి లొంగిపోయాడు. యావజ్జీవ శిక్ష

వేసారు హైద్రాబాద్ ఓపెన్ ఎయిర్‌జైల్లో శిక్షని అనుభవిస్తున్నాడు ఆరేళ్ళయింది. ఇంకా దాదాపు పద్నాలుగేళ్ళ శిక్షను అనుభవించాలి.

నాకిక్కడ రెండుపూటలా భోజనం పెడుతున్నారు. తింటున్నానండి. కానీ వాళ్ళక్కడ ఏమి తింటున్నారో? ఏమో? అదసలే రోగిష్టిది ఆ కుర్రాడికి పదిహేను, పదహారేళ్ళుంటాయి. ఎక్కడో పని చేస్తున్నాడట. రోజుకి రెండు రూపాయలిస్తారట. ఆ రెండు రూపాయలతో వాళ్ళు తిండే తింటారా, ఆమె మందులే కొంటారా....సొమ్ము పోయి శనీపట్టుకున్నట్లయింది నా పని. పోయిన డబ్బు ఎలానూ పోయింది. నేను ఈ ప్రతీకారం తీర్చుకోకపోతే నా భార్యాబిడ్డల కింత సంపాదించి పెట్టడానికయినా అవకాశముండేది....ఆ కోపంలో నా సొమ్ము పోయిందే అన్న బాధతో ఏదో చేసాను....ఫలితం నా భార్యాబిడ్డలు అనుభవిస్తున్నారు...." అతను తన బాధని వెళ్ళబోసుకున్నాడు.

"ఈమధ్య నేను శలవులో వెళ్ళినప్పుడు వాళ్ళుండడానికి చిన్న పాక వేసి వచ్చాను. మా ఆవిడ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. వాడి సంపాదన తినడానికే చాలదు....నా తప్పుకి వాళ్ళ శిక్ష అనుభవిస్తున్నారు. ఎవరైనా మహాప్రభువులు ఆదుకుని మా వాడికి ఉద్యోగమిచ్చి వాళ్ళింత తినడానికి సాయం చేస్తే బాగుండు...."అని తెగ వాపోయాడు.

ఈ విషయంలో అతని కుటుంబానికి సాయపడలనుకున్న వాళ్ళు ఓపెన్ ఎయిర్ జైల్ సూపరింటెండెంట్‌గార్ని సంప్రదించి ఆ ఖైదీ చిరునామా సంపాదించవచ్చు.

# తల్లులారా! పిల్లల్తో జాగ్రత్త!

పిల్లలు చాలా సున్నిత మనస్కులై వుంటారు. వాళ్ళతో చాలా జాగ్రత్తగా మాట్లాడాలి, ప్రవర్తించాలి లేకపోతే వూహించని పరిణామాలని ఎదుర్కోవలసి వస్తుంది.

ఆమెకు ముగ్గురు మగపిల్లలు ఒక ఆడపిల్ల. తల్లిదండ్రులిద్దరూ చనిపోయారు. తను భర్తి కష్టపడి పిల్లల్ని పెంచుకొస్తున్నారు.

పెద్దపిల్ల ఆడపిల్ల. ఏడవ తరగతి చదువుతోందిటప్పుడు వయసు 12సం. వుండొచ్చు.

ఎవరో పాపని కొట్టిందని వాళ్ళవాళ్ళు ఎక్కడనుంచో ఈ పాపని కొట్టుకుంటూ ఇంటిదగ్గరికి తీసుకొచ్చి తల్లిని నానామాటలు అని వెళ్ళిపోయారట.

తల్లి మనసుకి కష్టంగా అనిపించింది.



తనని తిట్టారనికాదు, కూతురుని రోడ్డుమీద కొట్టుకుంటూ తెచ్చారే అని!

ఆ బాధతో కూతుర్ని మరో రెండు దెబ్బలేసి కోప్పడిందట....

"అంతేసార్.... అంతకుమించి నేనేమీ చెయ్యలేదు...." అంటూ బావురుమందామె జైల్లో పలకరించగానే.

"కేవలం వాళ్ళు కొట్టారనే నువ్వు బాధపడ్డావా? ఇంకా...." అడిగాను.

"ఇంకేమీలేదు"

"అంటే మీ అమ్మాయి ప్రవర్తనమీద నీకేమైన అనుమానం వచ్చిందా?"

"అట్లాంటిదేమీ లేదు.... చనిపోయేప్పుడు దానివయసు పన్నెండేళ్ళే!"

"అయితే కేవలం నువ్వు తిట్టావనే ఆత్మహత్య చేసుకుందా?"

"అవును...." చేతిలోని పిల్లాడు జారిపోతుండడంతో వాణ్ని కిందకి దింపింది.

పిల్లలకి ఆరు సంవత్సరాల వయసు నిండేంతవరకూ తల్లితోపాటు జైలులోనే వుండనిస్తారు. ఆ తర్వాత వేరుచేస్తారు. ఆ వయసువరకూ తల్లికి దూరంచేస్తే వాళ్ళకి ఇబ్బంది వాటిల్లుతుందని, ఆ తర్వాత తల్లితో వుంచితే నష్టం వాటిల్లుతుందని ప్రభుత్వం భయం. అందుకే ఆరేళ్ళ వరకూ పిల్లలు తల్లితోపాటు జైలులో వుంచబడుతున్నారు. ఆ ఖర్చుని జైళ్ళవిభాగమే భరిస్తుంది.

చివరి కొడుకు ఆమెతోపాటు జైలులోవుంటే మిగతా కొడుకులిద్దరూ తండ్రితోపాటు వున్నారట.

ఈమె కోప్పడినప్పటినుంచీ కూతురిలో మార్పు వచ్చిందట. అదోలావుంటే బాధపడుతోందనుకుందిగాని మరోలా వూహించుకోలేకపోయిందిట.

ఆరోజు తను బయటకి వెళ్ళిందిట.

ఇంటికి వచ్చేసరికి కూతురు కిరోసిన్ వంటిమీద పోసుకుని అంటించుకుందిట.

తల్లి కేకలతో చుట్టుప్రక్కలవాళ్ళు వచ్చి ఆపాప ప్రాణాల్ని కాపాడ

ప్రయత్నించారు. గాని అప్పటికే శరీరం బాగా కాలడంతో ఆ పాప చని పోయింది.

ఆ పాప చనిపోవడానికి తల్లి ప్రవర్తనే కారణమని తల్లికి యావ జ్జీవ ఖైదు వేసారు.

"నాకు చచ్చిపోవాలనిపిస్తుంటుంది- జరిగింది గుర్తుకు వచ్చినప్పు డల్లా...." అంది బిక్క మొహంతో ఆమె.

# నేరస్థులుగా మారడానికి బాధ్యులెవరు?

డిస్ట్రిక్ట్ జైల్లో విచారణలోవున్న అన్నిరకాల ఖైదీలు వుంటారు. అందుకనే కొన్నాళ్ళు ఆ జైలులో ఎవరైనా వుంటే (మొదటిసారి తప్పు చేసయినా, తప్పుచేయకుండా పరిస్థితుల కారణాన జైలుకొచ్చినా) సావాస దోషంవల్ల తప్పకుండా అదే జీవితానికి అలవాటు పడుతుంటారు. దీనికి ముఖ్యకారణం రకరకాల నేరస్థుల్ని వేరు వేరుగా వుంచకుండా అందర్నీ కలిపేవుంచడం! ఈ విషయాన్ని జైళ్ళవిభాగంవారు గుర్తించాలి. లేక పోతే జైళ్ళు నేరస్థుల్ని సంస్కరించవు, నేరస్థుల్ని తయారుచేస్తాయి!

సికింద్రాబాద్‌జైల్లో ఓ ముప్పై అయిదు సంవత్సరాల వ్యక్తిని కలుసు కున్నాను. అతను నేరస్థుడుగా మారిన తీరు చాలా విచిత్రంగా అనిపిం చింది. ఇటువంటి నేరస్థులు తయారవడంలో ఎవరి బాధ్యత ఎంతవుందో మీరే ఆలోచించండి!

ఎయిర్‌ఫోర్స్ అకాడమీలో 4వ తరగతి ఉద్యోగిగా పనిచేస్తున్నా డతను. స్వతహాగా మెత్తని స్వభావం కలవాడు. ఆ స్వభావంతోనే అతని జీవితం దెబ్బతిన్నది.

అతని మంచితనాన్ని భార్యకూడా అసమర్థతగానే అర్థం చేసుకుంది. హద్దులుమీరి ప్రవర్తించడం ప్రారంభించింది. ఇతనిని లక్ష్యపెట్టేది కాదు.... అయినా అతను భరించాడు. కానీ ఒకరోజు ఆమె హఠాత్తుగా ఎవరితోనో లేచిపోయింది.

అందరూ హేళన చేశారు- ఆఖరికి ఆత్మీయులుకూడా! అతడి అంతరంగంలో భగ్గున మంటలు లేచాయి.... తనకి తెలియకుండానే పిచ్చి పిచ్చిగా ప్రవర్తించడం ప్రారంభించాడు.

ఆఫీస్‌కి వెళ్ళడం మానేసాడు. ఒకరోజు సికింద్రాబాద్ స్టేషన్ దగ్గర ఓ హోటల్ ముందున్న సైకిల్ని దొంగిలించి తీసుకుపోవాలనిపించింది అతనికి.

"అలా దొంగతనం చెయ్యాలనే ఆలోచన నీకెందుకు వచ్చింది?" అని అడిగితే-

"సైకిల్ కావాలనిపించింది. తీసుకొచ్చేసాను.... తర్వాత పట్టుకుని పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్ళారు కొట్టారు.... జైలుకొచ్చాను...." అన్నాడు అమాయకంగా.

మొదటిసారి జైలుకొచ్చిన తర్వాత అతనికి జైల్లో కొంతమందితో స్నేహమైంది.

"ఒకసారి దొంగతనంచేస్తే మనం పోలీసువాళ్ళ దృష్టిలోకి పోయినట్లే.... ఆ తర్వాత మనం దొంగతనం చేయకపోయినా ఏదో వంకతో వాళ్ళు మనల్ని పట్టుకుని అరెస్టు చేస్తూనేవుంటారు. కాబట్టి మనం మంచిగా బ్రతకాలనుకున్న బ్రతకలేం.... మాతో కలిసావంటే నీవు హాయిగా బ్రతకవచ్చు" అని అతని చెవిలో జోరీగల్లా వాళ్ళు హితబోధ చేయగా చేయగా అతను వాళ్ళతో కలవడానికి సరే" నన్నాడు

"మనందరం విడుదల కాగానే ఫలానచోట కలవాలి...." అని జైల్లోనే ప్లాన్ వేసుకున్నారు.

ఆ తర్వాత విడుదల కాగానే అతనూ వాళ్ళతోపాటు దొంగతనాలు చేయడం ప్రారంభించాడు.

"నువ్వెన్నాళ్ళనుండి ఈ చిల్లర దొంగతనాలు చేస్తున్నావు?" అడిగింది స్వాతి.

"పదకొండు సంవత్సరాలనుండి అండీ...."

"ఇంతవరకూ ఎన్నిసార్లు జైలుకొచ్చావ్?"

"ఇరవైసార్లండి...."



ఇలా విడుదలైన నెలరోజులలోపే జైలుకు చేరుకునే వాళ్ళు డిస్ట్రిక్ట్ జైళ్ళలో మనకి ఎందరో కనిపిస్తారు.

"దీనికి కారణం ఏవిటి?" అని ఆలోచిస్తే మనకి ఒకటే కనిపిస్తుంది-

నేరంచేసి దొరక్కపోతే లాభం పొందవచ్చు.... దొరికిపోతే 5, 6 నెలలు జైలుశిక్ష.... జైలులో వున్నన్నాళ్ళూ తిండి, నిద్ర పూర్తిగా

దొరికి విశ్రాంతి తీసుకున్నట్లుంటుంది. అందుకే జైలుకి రావడానికికూడా వీళ్ళు భయపడడంలేదు.

జైళ్ళంటే నేరస్థుల సంస్కరణకేంద్రాలు కాకపోయినా "నేరస్థులకి పునరావాసకేంద్రాలు" కాకూడదు కదా!

ఎంతవరకూ నిజముందోగాని అతనే మరో విచిత్ర విషయాన్ని కూడా చెప్పాడు.

"దొంగతనం చేయకూడదనుకున్నాను సార్.... ఒకసారి పోలీసులు వచ్చి పిలుచుకెళ్ళారు. వాళ్ళదగ్గర కొన్ని వస్తువుల్ని చూపించి వీటిని నువ్వే దొంగతనం చేసావని చెప్పు.... నీకు కొంత డబ్బునికూడా ఇస్తామన్నారండి.... అలాగేనని ఒప్పుకున్నాను"

"దొంగతనం చేయనప్పుడు ఎందుకు ఒప్పుకున్నావ్"

"మర్యాదగా ఒప్పుకుంటే వాళ్ళిస్తానన్న పదో ఇరవయ్యో దక్కుతాయి. తన్నులూ తప్పుతాయి.... లేకపోతే నాల్గుతన్ని దొంగతనం చేసినట్లు ఒప్పిస్తారండి" అన్నాడు.

తను జైలుకి వచ్చిన అన్నిసార్లూ తాను దొంగతనం చేసేరాలేదని, ఇలాంటి పరిస్థితుల్లోకూడా వచ్చానని అతను చెప్పాడు.

"మంచిగా బ్రతకాలని నీకులేదా?"

మౌనమే అతడి జవాబు.

"బయటికి వెళ్ళిన తర్వాత మళ్ళీ దొంగతనాలు చేస్తావా!"

మౌనమే అతడి జవాబు.

ఇటువంటివాళ్ళు ఈ సంఘంలో కోకొల్లలు.... వీళ్ళలో మార్పు తీసుకురావడానికి జైళ్ళ విభాగంద్వారా ప్రభుత్వం ఏవైనా కొత్త పద్ధతుల్ని అవలంబించాలి. లేకపోతే కోట్లాది రూపాయలు నేరస్థుల సంస్కరణ పేరుతో జైళ్ళమీద ఖర్చుపెట్టడం శుద్ధదండుగ!

# ప్రియుడిని హత్య చేసిన అ(స)బల

ఒక విధంగా చెప్పాలంటే పట్నాలలో కన్నా కూడా పల్లెలలోనే ప్రజలకు అక్రమ సంబంధాలు ఎక్కువ! ఎంత ఎక్కువమందితో అక్రమ సంబంధం కలిగివుంటే అంత గొప్పగా చెప్పుకునే వాళ్ళు మనకి పల్లెలో కనిపిస్తారు. ఇలా ఒకడు గొప్పలు చెప్పుకునే విషయాలు మరొకడిని బాధించవచ్చు.... నల్గురిలో అవమానాల పాలు చేయవచ్చు.... అతను కక్షతో మొదటివాడిని చంపడానికో, చంపించడానికో కూడా అవకాశం లేకపోలేదు.

కాకపోతే పల్లెటూళ్ళలో ఇటువంటి గొడవల్ని కూడా పొలాల తగాదాలనో, ముఠాల తగదాలనో రంగు పూసేస్తుంటారు. ఈ అనర్థాలన్నింటికి అసలు కారణం పల్లెటూళ్ళలో ప్రజలకి పట్టణాలలోని ప్రజలకి లాగా పూర్తి వ్యాపకం లేకపోవడమే అనిపిస్తుంది.

ఆమె వయసు ముప్పైఏడు సంవత్సరాలుంటాయి. పెద్ద అందగత్తెకాదు. పైగా ఇద్దరు కూతుళ్ళు ఒక కొడుకు వున్నారు. అయినా ఆమెలో విపరీత భావాలు ప్రజ్వరిల్లుతూనే వున్నాయి.

ఎవరితోనో అక్రమసంబంధం పెట్టుకుంది.

అక్రమ సంబంధాలు ఎన్నాళ్ళో దాగవు.... విషయం భర్తకి కూడా తెలిసిపోయింది. ముందు భార్యకి నచ్చచెప్పాలని చూసాడు. ఆమె వినలేదు.

ఒక రోజున ఊరిబయట పొలంలో ఇద్దరూ ఎదురయ్యారు.... తన భార్యతో అక్రమ సంబంధం పెట్టుకున్న అతడిని చూడగానే ఆ

భర్తకు వళ్ళు మండిపోయింది. చేతిలో వున్న కత్తితో అతనిమీదపడ్డాడు. సరిగ్గా ఆదే సమయంలో ఆమె అటువచ్చింది.

ఆమెప్రియుణ్ణి చంపేసి కత్తిని భార్య చేతిలోపెట్టి నలుగురినీ కేకేశాడట ఆ భర్త. దాంతో ఈమెను అరెస్ట్ చేశారుట....యావజ్జీవ శిక్ష విధించారు....ఈ విషయం ఆమె చెప్పింది. కాని అతనికి, తనకీ, అక్రమ సంబంధం వున్నట్లు చెప్పకుండా తన భర్తకూ అతనికి పొలం తగాదాలు వున్నాయంది.

"నువు ఎవర్ని చంపావ్?" అడిగాను.

ఆమె మాట్లాడలేదు



ప్రియుడిని హత్య చేసిన అబల

"శిక్ష కూడా పడింది కదా....చెప్పు...."

అతనికీ, మా ఆయనకి పొలం తగదాలుండేవి...."

"అతనెవరు?"

"మా వూళ్ళోనే వుంటాడు....నిజానికి నాకూ అతనికి ఏమీ సంబం

ధం లేదు....కాని ఏదో సంబంధం వుందని చాలమందికి అనుమానం.... ఆఖరికి నా భర్తకి కూడా!"

"అందుకని అతడిమీద శిక్ష తీర్చుకున్నాడా?"

"కాదు-వాళ్ళిద్దరికీ పొలం తగాదాలున్నాయి....అందుకని గొడవ పడి ఆరోజు మా ఆయనే అతడిని చంపాడు.. నేను చంపినట్లు చేసాడు ....దాంతో నాకు శిక్ష పడింది...."

శిక్ష పది సంవత్సరాలు అనుభవించిన వాళ్ళు కూడా-నేనేమి చేయలేదు. అనవసరంగా నాకు శిక్షవేసారు అనే చెప్తుంటారు.



ప్రియుడిని హత్య చేసిన అబల

జైలులో....ఇది చాలా విచిత్రంగా అనిపిస్తుంది. జైలులోకి వచ్చిన తర్వాత చుట్టుపక్కల వాతావరణాల్నిబట్టి ఇలాంటి మనస్తత్వానికి వస్తారు.... తమ నిర్దోషత్వాన్ని చాటుకోవడానికి చక్కటి కథను కూడా అల్లి చెప్తారు. కేస్ జడ్జిమెంట్ కాపీని చదవకుండా వాళ్ళ మాటల్నే వింటే జైళ్ళనిండా అమాయకులే తప్పుడు కేసులతో శిక్ష అనుభవిస్తున్నారనిపిస్తుంది.

అసలు విషయం ముందు తెలుసుకుని వాళ్ళతో మాట్లాడేటప్పుడు ఆ విషయాన్ని తరచి అడిగితేగాని వాళ్ళు కొంత యదార్థంతో నన్నా ముందుకు రారనే విషయం స్వాతికి ఖైదీల ఇంటర్వ్యూలు తీసుకోవడం ప్రారంభించిన రెండు మూడు రోజులలోనే అర్థమైంది.

"విచారణ పూర్తయి నీకు శిక్షపడి ఎన్నాళ్ళయింది?"

"ఆరు నెలలు...."

"ఎన్నాళ్ళు శిక్ష?"

"లైఫండి...."

"లైఫ్ విచారించకుండానే వేస్తారా?"

ఆమె మాట్లాడలేదు.

"శిక్షపడిన తర్వాత కూడా నిజం చెప్పవెందుకు?"

ఆ తర్వాత ఎన్ని ప్రశ్నలు వేసినా ఆమె సరయినజవాబియ్యలేదు.

అక్రమ సంబంధాలవల్ల జైలుపాలైనవాళ్ళ సంఖ్యే ఆడవాళ్ళ జైలులో ఎక్కువగా వుంది

మరొకామెకు ఎవరితోనో అక్రమ సంబంధం వుందనే అనుమానంతో భర్త కత్తితో ఆమెను చంపడానికి వచ్చాడు. ఇద్దరిమధ్యా పెనుగులాట జరిగింది. ఆ పెనుగులాటలో కత్తిదెబ్బ తగిలి భర్తే చనిపోయాడు. భార్యకు శిక్ష పడింది.

ఆమెను ఏమి అడిగినా జవాబియ్యకుండా సిగ్గుపడిపోయింది. ఫోటోని తీయబోయేప్పుడు కూడా గుడ్డని మొహానికి కప్పేసింది.

భర్తమీద హత్యా ప్రయత్నం చెయ్యబోయిన మరొకామెకి మూడు సంవత్సరాల శిక్ష వేసారు.

ఆమెను "భర్తని చంపడానికి ఎందుకు ప్రయత్నించావ్?" అని అడిగితే....

"నేను చంపబోలేదండి....అన్నదమ్ములిద్దరూ కొట్టుకున్నప్పుడు ఆయనకి గాయమైంది. అనవసరంగా నింద నా మీద వేసారు"అంది.

అక్రమ సంబంధాల్ని అరికట్ట గలిగితే చాలా నేరాలని అరికట్ట వచ్చామో!

# ఆశకం ఫలితం?

శ్రీతను ఆర్మీలో పనిచేస్తున్నాడు.

వచ్చే సంపాదనతో గుట్టుగా సంసారాన్ని వెళ్ళదీసుకోవచ్చు. కానీ అతను ఒకామెతో ప్రేమాయణాన్ని సాగించి మరొకామెను పెళ్ళి చేసు కొన్నాడు. దాంతో ఇద్దర్ని సమర్థించుకు రావాలనే తాపత్రయం అతనిలో పెరిగింది.

రెండో ఆమెను పెళ్ళి చేసుకున్నందుకు మొదటామెకు నష్టపరి హారాన్ని చెల్లించాడు.... రెండో ఆమె చాలా తెలివిగా అతడిని భ్రమలో వుంచి పెళ్ళి చేసుకుంది. ఆమె బాగా చదువుకుంది మద్రాసులో కెమిస్టుగా పనిచేస్తోంది. గత చరిత్ర పూర్తిగా అతనికి తెలీదు. తను ఎక్కడో జమ్మూలో వుంటాడు.

కొన్నాళ్ళ తర్వాత భార్యని కూడా జమ్మూ తీసుకువెళ్ళి కాపురం పెట్టాడు. కొడుకు, కూతురు పుట్టారు. ఆర్థిక ఇబ్బందుల కారణాన ఇద్దరి మధ్యా మనస్పర్థలు రాసాగాయి రాన్రానూ అవి విశ్వరూపం ధరించాయి.

ఒకరోజు-

"ఎట్లాగయినా డబ్బు సంపాదించడమే కదా నీకు కావలసింది?" అని అడిగాడు భార్యను.

"అవును...."

"అది ఎలా సంపాదించినా నీకు అభ్యంతరం వుండదుకదా"

"మనకి కావలసింది డబ్బు ...అదెట్లా సంపాదిస్తేనేం? నేనేమీ అటువంటి వాటిని పట్టించుకోను"

అతని మనసులో ఈ మాటలు నాటుకుపోయాయి. భార్య దగ్గ పరపతి పెరగాలంటే తను అర్జంటుగా డబ్బు సంపాదించాలి! ఎలా ఎలా?

అదే అతని ఆలోచన. భార్యని పిల్లల్తో పుట్టింటికి పంపేశాడు

ఒకరోజు కమాండర్ సంతకాల్ని ఫోర్జరీచేసి జమ్మూ స్టేట్ బాంక్‌లో రెండు లక్షల పాతికవేలని డ్రా చేసాడు.

అనేక తిప్పలుపడి ఆడబ్బుతో అక్కడనుంచి పారిపోయిఆంధ్రాకి వచ్చాడు. మద్రాసులో ఓ ఇల్లు కొన్నాడు. పాతికవేల రూపాయలు పెట్టి పెళ్ళాంకు నగలు కొన్నాడు. మరో పాతికవేలతో ఆమెకే రకరకాల



చీరలు కొన్నాడు. పిల్లలిద్దరి పేరనా మద్రాసులోని ఓ బాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్లు వేసాడు. భార్య కలలన్నింటినీ యదార్థాలు చేసాడు....

కానీ మిలట్రీ పోలీసుల బారినుండి తప్పించుకోలేకపోయాడు. దేశ మంతా గాలించి ఆఖరికి అతడిని మద్రాసులో పట్టుకుని అరెస్టు చేశారు.... జమ్మూ మిలట్రీ కోర్టులో విచారణానంతరం అతనికి పది సంవత్సరాలు కఠిన కారాగారశిక్ష విధించారు. హైదరాబాద్ సెంట్రల్ జైల్‌కి తరలించారు.

ఆ తర్వాత అనుకోని సంఘటనలు జరిగాయి.

అతని భార్యకి, ఓ వెటరినరీ డాక్టర్‌తో స్నేహమైంది. ఇద్దరి మధ్యా స్నేహం కొత్తరూపం దాల్చింది. అతనితో సంసార జీవితాన్ని గడపసాగింది.

"ఇక్కడే వుంటే నీ భర్త రిలీజ్ అయి వచ్చిన తర్వాత మనల్ని బ్రతకనివ్వడు....అందుకని గల్ఫ్ కంట్రీస్‌కి వెళ్ళిపోదాము...." అన్నాడట ఆ వెటరినరీ డాక్టర్.

ఆమె బాంక్‌లో వున్న డబ్బునంతటినీ తీసేసి, బంగారంతో పాటు దగ్గర పెట్టుకుంది.

ఆ రోజున స్నేహితుడితో కలిసివచ్చిన వెటరినరీ డాక్టర్ ఆమె వూహించలేని రీతిలో కిరోసిన్ పోసి తగిలబెట్టాడట....ఆ డబ్బంతటినీ, బంగారాన్ని తీసేసుకున్నాడు.

హాస్పిటల్‌లో ఏమీ స్టేట్‌మెంట్ ఇవ్వకుండానే ఆమె మరణించింది.

"వంట చేస్తూ చీర అంటుకుని ఆమె కాలిపోయిందని అందర్నీ నమ్మించి తనే భర్తగా డెత్ సర్టిఫికేట్ కూడా తీసేసుకుని ఆమె అంత్యక్రియలు కూడా చేసేడట.

ఆ తర్వాత ఎప్పుడోగాని జైలులో వున్న ఇతనికి విషయాలు తెలీ లేదు. పెరోల్ మీద మద్రాసు రాష్ట్రంలో ఆమె చనిపోయిన పట్టణం వెళ్ళాడు. కానీ అప్పటికే అతను ఆమె దగ్గరున్న డబ్బు, బంగారం సొంతం చేసేసుకున్నాడట. పైగా డెత్ సర్టిఫికేట్ ప్రొడ్యూస్ చేసి తనే ఆమె భర్తనంటూ లైఫ్ ఇన్సూరెన్స్ మొత్తానికి కూడా అప్లయ్ చేసాడట....

ఆమె నా భార్య అంటూ జైలునుంచి ఇతను కరస్పాండెన్స్ చేస్తున్నాడు.

"మరి నీ పిల్లలు ఎక్కడున్నారు?"

"మద్రాసులో నేను కొన్న ఇంట్లో వాళ్ళ అమ్మమ్మతో ఉంటు న్నారు. మైనర్ అకౌంట్లు కావడంతో వాళ్ళ ఫిక్స్‌డ్ డిపాజిట్లు కూడా క్లోజ్ చేసేసింది. ఆ డబ్బుని నేను కొన్న నగలనీ కూడా ఆ వెటరినరీ డాక్టర్ హస్తగతం చేసింది.... అదే నా బాధ వాడి దగ్గరనుంచీ వాటన్నిం టినీ వెనక్కి తీసుకుని నా పిల్లలకు చెందేట్లు చేయాలి. అదే నా ధ్యేయం ...." అన్నాడతను.

"నిన్ను పట్టుకున్న తర్వాత నువ్వెత్తుకొచ్చిన సొమ్ముని నీ దగ్గర నుంచీ రాబట్టుకోలేదా?"

"లేదండి నేను దొరికినప్పుడు జేబులో ఉన్న పైసల్ని మాత్రమే తీసుకున్నారు.... నా ఆస్తి స్వాధీనపరుచుకోలేదు. నేను నా జీవితాన్ని నాశనం చేసుకుని సంపాదించినదంతా నా పిల్లలకే దక్కాలి" మరోసారి అన్నాడతను.

"ఇదండి....నా కేసు తాలూకు ఫైలు అంటూ చక్కగా టైప్‌చేసి బైండు చేసిన ఓ పుస్తకాన్ని నాకందించాడు.

"ఇవన్నీ, నువ్వు టైప్ చేసినవేనా?"

"అవునండి! ఇవేకాదు. జైలులో చాలా టైపింగ్ వర్క్ నేను చేసి పెడుతుంటాను. పగలల్లా బిజీగానే ఉంటాను."

"నువ్వు డబ్బు ఎత్తుకొచ్చిన విషయం గుర్తుకొస్తే ఎలా అని పిస్తుంది?"

"చాలా థ్రిల్లింగ్‌గా అనిపిస్తుంది. ఇంతటి సాహసాన్ని నేనొక్క డినే ఎలా చేయగలిగాను అని!" అన్నాడు.

1986 డిసెంబరుతో అతని పది సంవత్సరాల శిక్షాకాలం పూర్తవు తుంది.

# నాపిల్లల్ని నాకు ఇప్పించండి!

ఆమెకు పాతిక సంవత్సరాలుండవచ్చు.

పచ్చటి శరీరఛాయతో చక్కగా వుంటుంది. భర్త హైద్రాబాద్‌లో ఓ పబ్లిక్ సెక్టార్ ఆర్గనైజేషన్‌లో పని చేస్తుంటాడట.

వాళ్ళ సంసారం చాలాకాలం సాఫీగా నడిచింది. అందుకు ఉదాహరణగా పిల్లలుకూడా వున్నారు.

హఠాత్తుగా భార్యాభర్తలమధ్య కలతలు ప్రారంభమయ్యాయి. అతను ఆమెని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టేసాడు. ఆమె విపరీతంగా కలత చెందింది.

ఆ తర్వాత ఆమెను వెనక్కి పిలిపించి పిల్లల్ని తీసేసుకుని తిరిగి భార్యను రోడ్డుమీదకి వెళ్ళగొట్టాడు భర్త. దాంతో మాతృహృదయం బ్రద్దలైంది.

పిల్లలకోసం ఏడ్చింది....

తిండిలేకుండా రోడ్లవెంట తిరిగింది.

యవ్వనంలో వున్న యువతి కావడంతో ఆమెకు ఏ ఆపద జరుగుతుందోననే భయంతో ఆమెను రెస్క్యూ హోమ్‌లో చేర్చారు. అప్పటికే ఆమెమనస్తత్వంలో విపరీతమైన మార్పువచ్చింది.

ఆ హోమ్‌లో ఓ తల్లి, పిల్ల వున్నారు. వాళ్ళతో స్నేహం చేయసాగింది ఈమె.... పిల్లని మరీ మాలిమి చేసుకుంది. దాంతో ఆపిల్ల తల్లితో సమానంగా ఈమెను నమ్మింది.

ఒకరోజు ఉదయం ముఖం కడుక్కోవడానికి వెళ్ళేప్పుడు పిల్లని కూడా తనతోపాటు ముఖం కడిగిస్తానంటూ బాత్‌రూమ్‌కి తీసుకు వెళ్ళింది.

అంతకు ముందే అక్కడ ఎప్పుడు పెట్టుకుందో ఓ బ్లేడ్‌ని దాచి పెట్టింది.

పాపని పడుకోబెట్టి ఆ బ్లేడుతో పొట్టని పరపరా కోసేసింది. పేగుల్ని బయటికి లాగింది. రక్తం ఆ ప్రదేశంలో భయంకరంగా ప్రవహించసాగింది. ఆ రక్తంలో వేళ్ళు ముంచి నా పిల్లల్ని నాకు ఇప్పించండి" అంటూ హిందీలో గోడమీద రాసింది....!

అప్పటికే ఆమెకు పూర్తిగా మతి స్థిమితం తప్పింది. ఇంకా విచారణ పూర్తికాకముందే ఆమెను కలుసుకోవడం జరిగింది.



"నా పిల్లలు నా దగ్గర వుండనప్పుడు ఏతల్లీ పిల్లలతో వుండడానికి వీల్లేదు" అంటూ ఆమె హూంకరిస్తుండడంతో గదిలో పెట్టి తాళం వేసారు.

నేను వెళ్ళేసరికి గదిమధ్య అన్నం పళ్ళెంవుంది. చీమలుపట్టి తింటున్నాయి ఆ అన్నాన్ని. ఎక్కడా ఆమె కనిపించలేదు.

"కుల్వంత్" పిల్చారు డెప్యూటి సూపరింటెండెంట్ సరోజినిగారు.
ఓ మూలనుంచి పలికింది.

"అన్నం ఎందుకు తినలేదు?" అప్యాయంగా అడిగారు సరోజిని గారు.

"నాకు వంట్లో బాగుండలేదు" అమూలనించే జవాబిచ్చింది.

"మందులిప్పిస్తా.... ఇలారా" అప్పుడు ఇవతలికి వచ్చింది.

"అలా అన్నం తినకుండావుంటే ఆరోగ్యం మరింత పాడవదూ" సరోజినిగారు మందలించారు.

చిన్నపిల్లలా తలూపింది ఆమె.

"నేను చంపలేదు అని చెప్పు శిక్ష తగ్గుతుంది" అని ఎందరో ఆమెకు చెప్పారట. మరికొందరు "ఆమె మతిస్థిమితం తప్పింది. అందుకే అలా చేసింది" అన్నారట. కానీ ఆమె అందర్నీ వ్యతిరేకించింది "నేను అబద్ధం చెప్పను. కానీ మతిస్థిమితం తప్పలేదు. నేను కావాలనే ఆ పిల్లను చంపాను. నా పిల్లలు నా దగ్గర వుండనప్పుడు ఏతల్లీ పిల్లా ఆనందంగా వుండడానికి వీల్లేదు" అంది.

"అనవసరంగా ఆ చిన్నపిల్లని చంపడం తప్పుకదూ.... ఆ తల్లి నీకేమి చేసిందని అంత బాధ కలిగించావ్?" అడిగాను.

"నేను ఎవరికి అపకారం చేసానని నాభర్త, నా పిల్లల్ని లాక్కుని నన్ను ఇంట్లోంచి బయటికి వెళ్ళగొట్టాడు. పస్తులే వున్నాను....రాత్రిళ్ళు బిక్కుబిక్కుమంటూ వీధుల్లో తిరిగాను. అప్పుడు నామీద ఎవరు జాలి తల్చారు. అందుకే నాకు ఈ సొసైటీమీద కచ్చ...." అంది ఖచ్చితంగా.

ఆ తర్వాత ఆమె విచారణ పూర్తయి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు.

ఒకరోజు జైలులో బాత్రూంకి పోవడానికో, మరెందుకో కొద్దిగా స్వేచ్ఛనిచ్చారు.

పోతూ పోతూ బట్టలుతుక్కోవడానికి పెట్టిన రాయిని పెళ్ళగించి ఓ సెల్‌లో తల్లి పిల్ల(ఆరేళ్ళు వచ్చేవరకూ పిల్లల్ని ఖైదీలతోనే వుంచుతారు) పడుకునివుంచే ఆ పిల్లమీద వేసింది.

అదృష్టవశాత్తు. శబ్దం కావడంతో ఆతల్లి పిల్లని గుండెల దగ్గరకి లాక్కుంది. రాయి పక్కనబడింది. పిల్లకి దెబ్బతగల్లేదు.

అప్పటినుంచీ ఆమెను పూర్తిగా కటకటాల వెనకేవుంచి ప్రత్యేక శ్రద్ధతో కాపలా కాస్తున్నారు.

# విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నా!

మిలట్రీ నుంచి పారిపోయి వచ్చినందుకు అతనికి మూడు నెలలు జైలు శిక్ష పడింది. జైలులో అతనికి కొత్త పరిచయాలు కలిగాయి. బయటికివెళ్ళిన తర్వాత కూడా అవి కొనసాగాయి. ఫలితంగా అతను దొంగగా మారాడు.

మామూలు దొంగకాదు. రైళ్ళ వాగన్లని దోచే దొంగ.

ఒక్కో ముఠాలోను, 12 మంది వుంటారట. "ఇలా మా బస్ దగ్గర 20, 30 గాంగులు వున్నాయి. అన్నాడతను.

ఏ రూట్‌లో ఏ గూడ్స్ వెళుతోంది: అందులో ఏ మెటీరియల్ ఎంతవుంది? మొదలయిన వివరాలన్నింటినీ రైల్వే పార్సిల్ ఆఫీసునుంచి వాళ్ళబాస్ ముందుగానే స్వీకరించి వీళ్ళకి తెలియజేస్తాడట. దాన్నిబట్టి వీళ్ళు ప్రోగ్రామ్ వేసుకుంటారు."

అందరూ దారిలోకాపి నిర్మానుష్య ప్రాంతంలో బండి మీద పడతారు.

ముగ్గురు వెళుతున్న బండిని ఎక్కితే మిగతావాళ్ళు వాహనంమీద ట్రాక్ పక్కనే బండిని ఫాలో అవుతూ వుంటారుట. ఆ ముగ్గురూ క్రిందికి విసిరేసిన వస్తువుల్ని కొంతమంది ఎరుకుంటూంటే మరికొంత మంది తమని ఎవరయినా గమనిస్తున్నారేమోనని కాపలా కాస్తుంటారట. ఇలా ఒక నెలలో ఒక్కో ముఠా పది వాగన్లదాకా కొల్లగొడుతుంటారట.

అతని పాదాల అడుగుభాగం గుంటలు గుంటలుగా వుంది.

"పాదాలు ఎందుకలా వున్నాయి" అడిగాను.



"బళ్ళ వెంట పరుగెడుతుంటాము. ఒక్కోసారి కదులుతున్న ట్రెయిన్‌లోంచి దూకుతుంటాము. అప్పుడు తగిలిన దెబ్బలండి ఇవన్నీ" అన్నాడు కాళ్ళవంక చూసుకుంటూ.

"ఎన్నాళ్ళనుంచి నువ్వీ వాగన్ల దొంగతనాలు చేస్తున్నావ్?"

"ఇరవై సంవత్సరాల నుంచీ అండీ...."

"ఎన్ని వ్యాగన్లని దోచుంటావ్?"

"అది చెప్పడం కష్టమండి...."

"అసలు నువ్వీ పద్మవ్యూహంలో ఎలా చిక్కుకున్నావ్?"

"మొదట్లో జైల్లో పడ్డ తర్వాత నాకు ఉద్యోగం పోయిందండి. భుక్తి గడవక చాలా ఇబ్బంది పడ్డానండి....అప్పుడు మా సేఠే ఆదు కున్నాడండి....ఆరు వేలు అప్పుగా ఇచ్చాడు. ఆ అప్పుతీర్చడానికి ముందు దొంగతనాలు చేసేవాణ్ణి. తర్వాత ఆదే అలవాటైపోయింది...." అన్నాడు

విడుదలయిన తర్వాత కూడా మళ్ళీ ఏదైనా దొంగతనం చేసి మళ్ళీ జైలుకి వస్తావా?" అడిగాను.

"ఇంక ఈ దొంగతనాలు మానేయదల్చుకున్నానండి.... ఓ ఇల్లు కట్టుకున్నాను. బాంక్ బాలన్స్ వుంది.... అందుకని ఈ పన్లుమానేసి క్షురకర్మ చేసుకుంటూ బ్రతుకుదామనుకుంటున్నానండి" అన్నాడతను చాలా తాపీగా.

# పంతాలకి పోకండి

అతనిది గుంటూరు జిల్లా 1964లో అతనికి పెళ్ళయింది.ముగ్గురు పిల్లలు పుట్టారు. గుంటూరులో ఓ కంపెనీలో పనిచేస్తూ హాయిగా బతుకు తున్నాడు. భార్యా పిల్లలంటే అతనికెంతో ప్రేమ.

హఠాత్తుగా 1981లో అతని బావమరిది చనిపోయాడు అత్తగారు వాళ్ళు కూడా అతనింటి దగ్గర్లోనే వుండేవారు. భార్య అతను ఆఫీసుకి వెళ్ళగానే తల్లిగారి ఇంటికివెళ్ళి ఓదారుస్తుండేది. వాళ్ళకి ఇద్దరే పిల్లలు- ఒక కూతురు, కొడుకు. కొడుకు చనిపోయాడు.

అందుకని కూతుర్ని వచ్చి తమతో వుండమన్నారు. భర్తని అడగమంది. అడిగింది ఆవిడ.

"పెళ్ళయి ఇంతకాలం అయిన తర్వాత నేను ఇల్లరికం రావడ మేమిటి?" అంటూ అత్తగారి మాటని కొట్టిపారేసాడు అతను.

కానీ రావలసిందేనని పట్టుబట్టింది అత్త.ఆ అడిగేదేదో సౌమ్యంగా అడిగినా బాగుండేది. ఆర్డరేసినట్లు అడగసాగింది. అతని కోపం తారా స్థాయికి చేరుకుంది.

"మీ ఇంటికి మేము రామంటే రాము" అని మొండికేసాడు.

"నా దగ్గరవున్న డబ్బుకోసం నువ్వేమిటి నీ బాబయినా వస్తా" డంది అత్త.

తల తిరిగిపోయింది అల్లుడికి.

"నన్ను ఇంతగా అవమాన పరుస్తుందా? నువ్వు మీ అమ్మా వాళ్ళింటికి వెళ్ళడానికి వీల్లేదు" అంటూ భార్యని కట్టుదిట్టం చేసాడు.

పాపం ఆమె భర్తని బాధించలేక, అమ్మని దూరం చేసుకోలేక అతను ఆఫీసుకి వెళ్ళిన తర్వాత తల్లిగారింటికి వెళ్ళి వస్తుండేది. అలా కూడా వెళ్ళడానికి వీల్లేదని అతను కట్టుదిట్టం చేసాడు.

ఒకరోజు అతను ఆఫీసుకి వెళ్ళినతర్వాత అత్తగారు వచ్చి కూతుర్ని తనింటికి తీసుకెళ్ళి పోయింది. పిల్లల్ని తీసుకెళ్ళలేదు.

కోపంతో అతను భార్యని తిరిగి వెనక్కి తీసుకురాలేదు. పిల్లలతో యాతనపడుతూ అలాగే గడపసాగాడు.

కానీ అతనిలో రోజు రోజుకీ కోపం పెరుగసాగింది. తనకి పిల్ల లకి భార్యని దూరం చేస్తున్న అత్తమీద పగ తీర్చుకోవాలనుకున్నాడు. అవకాశంకోసం ఎదురు చూడసాగాడు.

ఒక రోజున ఒక్కడికో వెళ్ళి వస్తున్న తల్లీ కూతుళ్ళని వూరు బయట నిలవేసాడు. మళ్ళీ మాటామాటా పెరిగింది. చటుక్కున దాచిన

కత్తిని బయటికిలాగి అత్తను పొడవబోయాడు. అంతకన్నా వేగంగా అతని భార్య తల్లికి అడ్డం వచ్చింది....

అంతే! అతని కత్తి ఆమె కడుపులో దిగబడింది.

బాధతో మెలికలు తిరుగుతూ ఆమె వెనక్కి విరుచుకుపడింది ఆ పొలాల్లోవున్న ఎండిపోయిన మ్రోడేదో ఆమె వెన్నులో దిగబడింది. గట్టిగా అరిచింది. వెంటనే ఆమె ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.



భార్యకి జరిగినదానికి నోటమాట రాక అతడలాగే నిలుచుండి పోయాడు. అత్త గట్టిగా కేకలు వేయడంతో జనం వచ్చారు. తర్వాత అతడిని అరెస్ట్ చేసారు. యావజ్జీవ ఖైదు శిక్ష విధించారు.

ఇప్పుడు ఓపెన్ ఎయిర్ జైల్లో వుంటున్నాడు. ఆరు సంవత్సరాల శిక్ష పూర్తయింది. దాదాపు నలభైఅయిదు సంవత్సరాల వయసుంటుంది. ముఖంలో విచార రేఖలు తాండవమాడుతుంటాయి. ఓపెన్ ఎయిర్ జైల్లో వున్న ఖైదీలందరూ కష్టపడి పనిచేసేవాళ్ళే! ఇతను కూడా రోజంతా ఏదో ఒక పని చేసి శ్రమిస్తూనే వుంటాడు. ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే వున్నట్లుంది. ట్రీట్ మెంట్ తీసుకుంటున్నాడు.

"ఇలా నువ్వు జైలుకి వచ్చేయడంతో నీ పిల్లలు ఎలా బతుకుతున్నారు?" అడిగాను

"అనుకోకుండా వాళ్ళమ్మ చనిపోయింది. నేను జైలుకొచ్చాను.... పిల్లల్ని వాళ్ళ అమ్మమ్మే తీసుకెళ్ళిందిటండి" అన్నాడు బాధగా.

"ఆ సఖ్యత ముందే వుంటే బాగుండేదికదా?"

"మా ఖర్మబాబూ....మా అత్త ఛాలెంజ్ చేసినట్లు మాట్లాడేసరికి నేను రెచ్చిపోయాను. ఆవిడా కచ్చపట్టింది. మా ఇద్దరిమధ్యా అది నలిగిపోయింది" అప్పటి పరిస్థితుల్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ చెప్ప సాగాడతను.

"నేను జైలుకొచ్చిన తర్వాత మా మామపోయాడు. అత్త పశ్చాత్తాప పడింది. కనీసం నేనయినా వుంటే కాస్తఅండగా వుండేవాడనని.... కానీ చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుని లాభమేముంది? పిల్లల్ని పెట్టుకుని తనే ఇబ్బంది పడుతోంది. అనవసరంగా మా పగల కారణంతో ఆ పిల్లల భవిష్యత్తు దెబ్బతింది" అన్నాడతను.

మనం ఏదైనా నిర్ణయం తీసుకునేప్పుడే మనమీద ఆధారపడి వున్నవాళ్ళకి దానివల్ల ఏమైనా ఇబ్బంది వుంటుందా అని ఆలోచించాలి. ఆ తర్వాత బాధపడి వుపయోగం వుండదు.

# ప్రాణంకన్నా విలువైనదా డబ్బు?

క్రామం తర్వాత డబ్బువల్ల జరిగే నేరాలే ఎక్కువ.

ఖమ్మం జిల్లాలో ఓ కుగ్రామం అది.

కులం పేరుతో గ్రూపులున్నాయి అక్కడ.

ఒక గ్రూప్‌లోని వాడు మరో గ్రూప్‌లోని వాడి దగ్గరనుండి వెయ్యి రూపాయలు అప్పుగా తెచ్చుకున్నాడు. ఆ తర్వాత ఎన్నాళ్ళు గడి

చినా డబ్బు తిప్పి ఇచ్చేయాలనే ధ్యాస అతనికి కలగలేదు....పైగా అవతలి అతను వచ్చి నా పైసలు నాకు ఇచ్చేయమని అడిగితే కోపంతో మండిపోయేవాడు. నానా మాటలూ మాట్లాడేవాడు.

తమ తండ్రి అప్పిచ్చి, చివాట్లు తినడం కొడుకులిద్దరికీ ఇబ్బందిగా వుండేది. అందుకే తండ్రికి వత్తాసుపలికి అవతలి అతడిని ఎదుర్కోవాలనుకున్నారు పగలు పెరిగాయి.

ఒకరోజు తండ్రి, పెద్దకొడుకు వస్తుంటే కాపు కాసున్న అప్పు తీసుకున్న వాడి వర్గం వారు బస్టాండు దగ్గర బరిసెలతో పొడిచి చంపే



సారు. అరుపులు విన్న చిన్నకొడుకు మరి కొంతమందితో అక్కడికి వచ్చేసరికే వాళ్ళు తండ్రిని, అన్నను చంపేయడం, పారిపోవడం జరిగింది.

సరిగా ఈ సంఘటన జరిగిన నెలరోజులకి అదే ప్రదేశంలో చిన్న కొడుకు మరికొంతమందితో కలిసి మాటేసి తన తండ్రిని అన్నను చంపిన మనిషిని చంపిపగతీర్చుకున్నాడు. ఇతనికి యావజ్జీవ కారాగారశిక్ష పడింది. ఓపెన్ ఎయిర్ జైల్లో వున్నాడు. ఏడు సంవత్సరాల శిక్ష పూర్తిచేసుకున్న అతనికి ఇరవైఏడు సంవత్సరాలకి మించి వయసుండదు.

"ఎందుకు ఈ మర్డర్ చేశావ్?" అడిగాను.

"మా అయ్యి డబ్బులు తీసుకుని చంపిన వాళ్ళమీద నాకు పగ వుండదాండీ...."

"వాళ్ళమీద కేసు పెట్టవచ్చుకదా?"

"కేసు పెట్టివుంటే జైలుకివెళ్ళి కూర్చునేవాడు. మరి, మా పగ తీరేదెలా? అందుకే వాడిమీద కేసుపెట్టలేదు"

"నువ్వు, మీ నాన్న ఏంపని చేస్తుండేవారు?"

కూలిపని.... అలా కష్టపడి సంపాదించిన ఆ డబ్బుని ఎవడో కాజేసుకుపోతే కడుపు మండదాండీ?" ప్రశ్నించాడు.

డబ్బు దాహంతో ఒకళ్ళని మోసం చేయాలని ప్రాణాలు పోగొట్టుకున్నవాళ్ళెందరో! వాళ్ళని చూసయినా ఆశని అదుపులో పెట్టుకోవాలి. ఇతరుల కష్టార్జితాన్ని ఆశించకూడదు.... డబ్బు తీసుకున్నాడుకదాని ప్రాణాలు తీసేయడమే? ప్రాణంకన్నా డబ్బు విలువైనదా? హత్య చేసిన తర్వాత ఇతను మాత్రం ఏమి సుఖపడ్డాడు- కసితీరడం తప్ప! ఈ విషయాలన్నింటినీ అందరూ ఆలోచించాలి.

# దొంగలేకాదు దొరలూ ఆలోచించాలి!

పిల్లల్ని కనగానే సరిపోదు. వాళ్ళని సక్రమమైన మార్గంలో పెంచాలి. లేకపోతే వాళ్ళ జీవితాలు నాశనమవడమే కాకుండా మరెందరి జీవితాలనో వాళ్ళు నాశనం చేయడానికి ప్రయత్నిస్తుంటారు.

16 సంవత్సరాల ప్రాయంలో ఆ కుర్రాడు ఇంట్లోంచి పారిపోయాడు. మూడు సంవత్సరాలపాటు నిజామాబాద్ ప్రాంతంలో ఆవారాగా తిరిగాడు. ఆ రోజుల్లో అతనికి పట్టుబడింది ఈ విద్య.

ముందు చిన్న చిన్న దొంగతనాలు చేసేవాడు. వయసుతోపాటు ఆ విద్యా పెరగసాగింది. క్రమంగా ఇళ్ళల్లో జొరబడి దొంగతనాలు చేయడం ప్రారంభించాడు. ఒకసారి ఓ ఇంట్లో జొరబడి గొలుసు దొంగతనం చేసుకొస్తుంటే పట్టుబడ్డాడు. అలా మొదటిసారి జైలుకెళ్ళాడు. తర్వాత అదీ అలవాటైపోయింది.

అతనికిప్పుడు 54సం॥లు. ఈమధ్య ఎన్నిసార్లు జైలుకొచ్చాడో అతనికే తెలీదు. విడుదలవడం ఆలస్యం మళ్ళీ చేతివాటం చూపడం....



దొరక్కపోతే రాజా, దొరికినా రాజానే ... జైల్లో కొన్నాళ్ళు విశ్రాంతి, తిరిగి చేతివాటం.... ఇలా గడిచిపోతోంది అతని జీవితం.

విచిత్రమేమిటంటే అతనికి 16సం. క్రితం పెళ్ళయింది. ముగ్గురు పిల్లలున్నారు. వాళ్ళెవ్వరికీ ఇతను దొంగని తెలీదట. జైలుకెళ్ళి వచ్చినప్పుడల్లా బట్టలు కొనడానికి బొంబాయి వెళ్ళి వచ్చానని బట్టలు వెంట తీసుకెళ్ళి ఇంట్లో చెబుతాడట. ఈమధ్య బండారం బయటపడింది. దొంగతనాలు చేసేట్లయితే ఇంటికి రావద్దని భార్య వార్నింగిచ్చింది.

అందుకని తనకి తగ్గ, చేతివాటంవున్న మరో ఆమెను వుంచుకున్నాడు. ఇప్పుడామె ఇతనికి అండ. రెండో భార్య ఆసరాతోనే ఈతను ఈ పన్లు చేస్తాడట.

"ఇంత వయసు వచ్చి ఎందుకయ్యా దొంగతనాలు చేస్తావ్?" అని అడిగితే-

"నిజంగా దొంగతనాలు చేసే రోజుల్లో మామూళ్ళు చెల్లిస్తుండేవాడిని కాబట్టి నన్ను పోలీసులు అంతగా వేధించేవారు కారు. ఇప్పుడు మామూళ్ళు ఇవ్వడంలేదు కాబట్టి నన్ను అరెస్ట్ చేస్తున్నారు" అన్నాడు.

చాలామంది ఖైదీలు పోలీస్ డిపార్ట్‌మెంట్ మీద మోపుతున్న అభియోగం ఇది. దీంట్లో నిజంకన్నా కల్పనే ఎక్కువగా వుందేమోననిపిస్తుంది. వాళ్ళ మాటలు వింటుంటే పోలీస్ డిపార్ట్‌మెంట్ మీద ఈ అభియోగంఎలానూ వుంది కాబట్టి దీనిని అడ్డం పెట్టుకుని తమ అమాయకత్వాన్ని నిరూపించుకోవాలని వాళ్ళ తాపత్రయం.... ఈ విషయాన్ని పోలీస్ డిపార్ట్‌మెంట్ వారూ గ్రహించి, మామూళ్ళు తమకి అలవాటు లేదు అని నిరూపించుకోవాలి అప్పుడే ఖైదీలలో వున్న ఈ దొంక తిరుగుడు ధోరణిని అరికట్టగలం.

"నీ పిల్లల్నికూడా నీకులాగానే తయారు చేస్తావా?"

"ఛ....ఛ....వాళ్ళని చక్కగా చదివిస్తాను సార్...."

"విడుదలవగానే మళ్ళీ కార్యక్రమ మేమిటి? ఏదోపిడి?"

"ఇంక ఈ పన్లు చేయనుసార్. అజ్మీర్ వెళ్ళి ఏదైనా వుద్యోగం చేసుకోవాలను కుంటున్నాను" అన్నాడు.

నేరాలు చేయడానికి, జైళ్ళకి రావడానికి అలవాటుపడిపోయిన వాళ్ళెందరో వున్నారు. వీళ్ళని వేరుగా వుంచి, వాళ్ళ మానసిక పరిస్థితులో మార్పు తీసుకురావడానికి జైలు అధికారులు ప్రయత్నించాలి. లేకపోతే వాళ్ళని జైలులోవుంచి లాభమేమిటి?

# యువకులారా! జాగ్రత్త!!

యౌవ్వనంలో ఉడుకు రక్తం పరుగులు తీస్తూ వుంటుంది. పెద్ద వాళ్ళు వాళ్ళని జాగ్రత్తగా గమనిస్తూ సరయిన గైడెన్స్ ఇవ్వకపోతే ఎవరి జీవన గమనం ఎటు మళ్ళుతుంతో చెప్పడం కష్టం.

అది కర్నూల్ జిల్లాలో ఓ పట్టణం- పట్టణమైనా, పల్లె అయినా నేస్తాలు జట్లుగాతిరగడంమామూలేకదా...అట్లాతిరిగేవాళ్ళలో ఏ ఒక్కడిలో విషపు ఆలోచన ఉదయించినా అది కడివెడు పాలలో ఓ మజ్జిగ చుక్క అవుతుంది. అందరి మనసులూ విరిగిపోయే ప్రమాదముంది. సరిగ్గా అక్కడా అలానే జరిగింది వాళ్ళు ఎనిమిది మంది ఓ జట్టు.

ఆ ఎనిమిది మందీ చదువుతున్నారు- ఇంటరు కొందరయితే డిగ్రీ కొందరు. వీరి తల్లిదండ్రులంతా ఉద్యోగాలు చేసి గౌరవంగా బ్రతుకు తున్నవారే! తమ పిల్లలు చక్కగా చదువుకుని, చేతి కందివస్తారని ఆశతో ఎదురుచూస్తున్న వాళ్ళే!

మరి. ఆ కుర్రాళ్ళలో ఎవరికి పుట్టిందోగాని ఆ బుద్ధి, అది మహ మ్మారిలా అందరినీ కమ్మేసింది.

చదువులు చక్కగా పూర్తిచేసినా వుద్యోగం దొరకడం కష్టం.... అందుకని కష్టపడకుండా డబ్బు సంపాదించడంఎలా? ఇదీవాళ్ళ ఆలోచన.

ఆలోచించారు....ఆలోచించారు....ఆఖరికి ఓ నిశ్చయానికొచ్చారు ఓ బాంక్‌ని కొల్లగొట్టాలని!

వాళ్ళలో ఎవరి వయసూ 25 సం॥లు దాటివుండదు. కానీ వాళ్ళం దరి మనసుల్లోనూ బాంక్‌ని దోచేసి, అర్జంటుగా డబ్బుని సంపాదించాలనే కోరిక ఉధృతమైంది.

ఓ ప్లాన్ ప్రకారం ఆరోజు ఎనిమిదిమందీ ఓ నేషనలైజ్డ్ బాంక్ దగ్గరకి చేరారు. సంవత్సరం ఆఖరు కావడంతో ఆఫీస్ టైమైపోయినా మేనేజర్‌తోపాటు కొందరు ఇంకా బిజీగానే పనిచేసుకుంటున్నారు.

ఇద్దరు ఎవరైనా వస్తున్నారేమోనని బయట కాపలాకాస్తుంటే ఆరుగురు లోపలికి వెళ్ళారు కత్తులతో. అనుకోని హఠాత్ సంఘటనకి బాంక్‌లోని వారంతా కంగారు పడిపోయారు.

ముగ్గురు మిగతావాళ్ళని కదలకుండా బెదిరిస్తూ కత్తులు చూపించి



నుంచుంటే మిగతా ముగ్గురూ మేనేజర్ దగ్గరకి వెళ్ళారు.

"సేఫ్ ఓపెన్‌చేసి వున్న డబ్బంతా మాకిచ్చేయ్...." అని గద్దించారు.

"తాళం చెవులు కాష్షియర్ దగ్గరున్నాయి. అతను వెళ్ళిపోయాడు" బిక్కు బిక్కు మంటూ జవాబిచ్చాడు మేనేజర్. ఆయన వయసు నలభై అయిదు సంవత్సరాలదాకా వుంటుందిట.

"మర్యాదగా బ్యాంక్‌లో వున్న డబ్బంతా తీసి ఇస్తావా? లేదా అంటూ అతడిని భయపెట్టడానికి కత్తితో కొన్నిగాయాలు చేసారట.

మేనేజర్ భయపడిపోయాడు. వెంట ముగ్గురూ వస్తుంటే తాళ(ం) చేవులకోసం మేడమీదవున్న తన ఇంట్లోకి వెళ్ళాడు అక్కడ మళ్ళీ ఘర్షణ అయింది. బలమైన కత్తిగాయాలతో మేనేజర్ మరణించాడు.

దావానలంలా ఈ విషయం గుప్పుమంది. పోలీసుల వేటలో వరుసగా అందరూ దొరికిపోయారు.

సెషన్స్ జడ్జీ ముగ్గురికి వురి శిక్ష విధించి, మరో ముగ్గురుకి యావజ్జీవ కారాగార శిక్ష, ఇద్దరికి మూడేసి సంవత్సరాల శిక్ష వేసారు. తర్వాత హైకోర్టు మొదటి ముగ్గురికి వురిశిక్షని యావజ్జీవశిక్షగామార్చింది.



ఇప్పుడు ముగ్గురూ రాజమండ్రి సెంట్రల్ జైల్లోవుంటే, ముగ్గురు హైద్రాబాద్ జైల్లో ఉన్నారు. ఇద్దరు తమ శిక్షని పూర్తిచేసుకొని విడుదల అయ్యారు.

వాళ్ళలో కొందరిని హైద్రాబాద్ జైల్లో కలుసుకోవడం జరిగింది.

"బాంక్ దోపిడీ ద్వారా తేలిగ్గా డబ్బు సంపాదించవచ్చునను కున్నాము గాని ఇన్ని అనర్థాలు జరుగుతాయనుకోలేదు సార్...." అన్నాడు వాళ్ళలో ఒకడు.

ఈ మాటలే చెబుతున్నాయి అతని అమాయకత్వాన్ని. నేటి సినిమాలు యువతరానికి వెర్రి తలపులు పుట్టిస్తున్నాయి. కత్తి చూపించి బెదిరించి తేలిగ్గా డబ్బు ఎత్తుకుపోవచ్చనుకున్నారు.... తీరా అక్కడికి వెళ్ళిన తర్వాత పరిస్థితులు ఎదురు తిరిగాయి. మేనేజర్ మొండికేసాడు.

"అంతదాకా వచ్చిన తర్వాత వెనక్కు తిరిగినా మేము నేరస్థులమే అవుతాము. అందుకని అతడిని భయపెట్టి డబ్బు సంపాదించాలని చూసాము....అంతేగాని హత్యచేయాలనే వుద్దేశంలో మేమెవ్వరమూ



అంతవరకూ లేము" అన్నాడు ఈ కేసులో శిక్ష అనుభవిస్తున్న మరో యువకుడు.

అనుకున్నా అనుకోకపోయినా దారుణం జరిగిపోయింది.... అటు ఆ మేనేజర్‌గారి కుటుంబం కష్టాలపాలైంది. ఇటు వీళ్ళు ఖైదీలయ్యారు. ఎవరు సుఖపడినట్టు? యువతరానికంతటికి ఓ హెచ్చరిక ఈ సంఘటన.

ఆ కుర్రావాళ్ళు ఇప్పుడు పశ్చాత్తాపంతో క్రుంగిపోతున్నారు.

తమ శిక్షని తగ్గించమని తమ జీవితాల్ని సక్రమ మార్గంలో మళ్ళిస్తామని సుప్రీమ్‌కోర్టుని ప్రాధేయపడుతున్నారు....వీళ్ళ మీద ఎన్నో ఆశలు పెట్టుకుని అష్టకష్టాలుపడి చదివిస్తున్న ఆ తల్లితండ్రులు ఎంతగా బాధపడ్డారో? తన బాంక్ సొమ్ము పోకుండా కాపాడడంకోసం ప్రాణాలర్పించిన ఆ మేనేజర్ కుటుంబం ఎంతగా తల్లడిల్లిపోయారో? అందరికీ మానసిక క్షోభే!

# పాలుతాగి రొమ్ముగుద్దే వాళ్ళుంటారా?

అప్పట్లో హైద్రాబాద్‌లో పెద్ద సంచలనాన్ని కలిగించిన కేసు ఇది.

అతని వయసు పదహారు లేక పదిహేడు సంవత్సరాలుంటాయి. ఎక్కడో గోదవరి జిల్లాలో వుండేవాడు. ఓ ధనవంతుల ఇంట్లో నమ్మకంగా పని చేయడానికి హైద్రాబాద్ తీసుకురాబడ్డాడు

ఆ ఇంట్లో భార్యాభర్తలతోపాటు ఇద్దరు కొడుకులు వుంటున్నారు. ఆ నల్గురికి ఈ కుర్రాడు నమ్మకంగా సేవలు చేస్తున్నాడు.

హఠాత్తుగా ఓరోజు ఆవిడ కనిపించలేదు. వయసు దాదాపు నలభై సంవత్సరాలుంటాయి. తర్వాత శవం ఆ మల్టీస్టోర్ బిల్డింగ్ అవతల ఓ మూల కనిపించింది. ఆ టైమ్‌లో ఇంటి యజమాని ఊళ్ళోలేడు. పోలీస్‌లు రంగంలోకి వచ్చారు. పరిశోధించారు. ఇంట్లో పనిచేసే నౌకరు కుర్రాడిని అరెస్ట్ చేసారు.

టీనేజ్‌లో వున్న ఈ కుర్రాడు సెక్స్‌బొమ్మల్ని చూసి ఆనంది

స్తుందే వాడని, అంతేకాకుండా అమ్మగారు స్నానం చేసేప్పుడు బాత్ రూమ్ తలుపు సందుల్లోంచి ఆవిడని చూసేవాడని అతడిమీద అభియోగం ఆరోపించబడింది ఆరోజు అతనే ఆవిడని చెరచి, బాత్‌రూమ్‌లో వున్న వెంటిలేటర్ గుండా కిందకి పడవేసాడని నిర్ధారించి అతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధించారు. ఇప్పుడు హైద్రాబాద్ సెంట్రల్ జైల్లో వున్నాడతను.

ఈ క్రయిమ్ గురించి అడగగానే బావురుమన్నాడతను.

"ఆయమ్మ మా తల్లిలాంటిది....తన పిల్లలతోపాటు సమంగాతిండి



పెట్టింది. గుడ్డలు కుట్టించింది. ఆవిడ నా తల్లిబాబూ...."అంటూ బాధ పడ్డాడు.

"మరి నీ దగ్గర ఏవేవో అర్ధనగ్న సినిమా బొమ్మలు దొరికాయంటున్నారు అవి ఎందుకుంచుకున్నావ్?"

"నా దగ్గర దొరికిన ఫోటోలు రామారావుగారివే బాబు. నేను ఆయన అభిమానిని. ఆయన రకరకాల ఫోటోలని దాచుకునే వాడిని....—అన్నాడు.

"అసలు నువ్వీ వూరు ఎన్నాళ్ళయింది వచ్చి?"

1980లో బాబు....1983లో ఈ గొడవ జరిగింది. మొదట్లో అయ్యగారే బెయిల్ ఇచ్చి విడిపించారు. ఆ తర్వాత ఆయన కూడా దూరమైపోయారు. నేనిక్కడ శిక్ష అనుభవిస్తున్నాను. నాకు శిక్ష పడటంతో మా అన్నయ్యని ఉద్యోగంలోంచి తీసేసాడు వాళ్ళ యాజమాని. అతనికి పెళ్ళి అయింది. ఉద్యోగం పోవడంతో మనసు చలించినవాడిలా ఎటో వెళ్ళిపోయాడట బాబూ.... మా చెల్లెలి పెళ్ళి ఆగిపోయింది.దాంతో మా వాళ్ళెవరూ నన్ను చూడటానికి రావడంలేదు ఉత్తరాలకి జవాబులు రాయడంలేదు. కన్నవాళ్ళు దూరమైపోయారు ఈ ఊరు తీసుకొచ్చిన వాళ్ళు దూరమైపోయారు. నిజంగా నేనే నేరమూ చేయలేదు బాబూ...." అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు, ఆ కుర్రాడు తనగాథ చెప్పుకుని.

"అప్పట్లో మా అయ్య జీతం పంపమని రాస్తుండేవాడు బాబూ. నేను అడిగితే నీకు డబ్బిస్తే మీ అయ్య పాడు చేసేస్తాడు, అందుకని నీపేరన బాంకులో వేస్తాములే....అంటుండేవాళ్ళు బాబూ పైసా ఇవ్వక పోయినా తిండిపెట్టి బట్ట ఇస్తున్నారు కదాని ఎంతో నమ్మకంగా పని చేస్తుండేవాడిని....ఇంటిపని, బజారుపని అంతా నేనే చేయకునేవాడిన.... అమ్మగారు కనిపించకుండా పోయిన రోజు ఉదయం ఎవరో ఇద్దరు వచ్చారు.బాబూ వాళ్ళని చూసి అమ్మగారు కంగారు పడిపోయారు.... నన్ను బయటకి పంపేసారు....ఈ విషయాలన్నీ పోలీసులకి చెప్పాను. నేను ఈ క్రయిమ్ చెయ్యలేదు. బాబూ....ఆమె నా తల్లిలాంటిది"అన్నాడు మళ్ళీ.

మూడు సంవత్సరాల శిక్షని పూర్తిచేసిన ఆ కుర్రాడిని చూస్తుంటే "ఈ కుర్రాడి వయసు ఈ జైల్లోనే వుడిగి ఎప్పుడోకదా బయటి ప్రపంచాన్ని చూసేది అని బాధేసింది. అతడినే కాదు, చిన్న తనంలోనే జైలు పాలై అక్కడ మ్రగ్గి గిడసబారిపోతున్న యువతరాన్ని చూస్తే ఎవరికి బాధనిపించదు.

# నేను చంపలేదు!

పల్లెటూళ్ళ కేసులలో అధికభాగం అక్రమ సంబంధాలవల్ల జరిగిన గొడవలు లేకపోతే పొలాల దగ్గర జరిగిన గొడవలు.

ఇప్పటికీ వ్యవసాయం చేసుకునే వాళ్ళలో చాలామంది ఉమ్మడి కుటుంబాలలోనే జీవిస్తుంటారు. అందరూ కలసివుంటే వ్యవసాయం చేసుకోవడం సులభమని వాళ్ళ వుద్దేశం.... వాళ్ళ పిల్లలు, వాళ్ళపిల్లలు పుట్టిన తర్వాత కూడా ఇలా కలసి వుండడం సంభవమా? ఇళ్ళు కూడా ప్రక్క ప్రక్కనే కాకుండా పొలాలు కూడా ప్రక్కప్రక్కనే వుంటాయి.అప్పుడు ఇంట్లోని తగాదాలు పొలాల్లోకి పాకవచ్చు. లేకపోతే పొలాలలోని తగాదాలు ఇళ్ళలోకి రావచ్చు.

హైద్రాబాద్ ఓపెన్ ఎయిర్ జైల్లో డయిరీ పని చూసుకుంటున్న ఓ నలభై సంవత్సరాల వ్యక్తిని కలిసింది స్వాతి. అతను పైన చెప్పిన తరహా గొడవలో ఇరుక్కుని జైలుకొచ్చాడు.

వీళ్ళ పొలం ప్రక్కనే పెదనాన్నగారి పొలం వుందిట. పెదనాన్నకొడుకు తన పొలంగట్టుని వీళ్ళ పొలంలోకి జరిపాడట. అంతే! అన్నదమ్ములిద్దరూ కలసి పెదనాన్న కొడుకుమీదకి పోట్లాటకి పోయారు. మాటమాట పెరిగింది.

ఇతను పెదనాన్న కొడుకుని కదలకుండా గట్టిగా పుచ్చుకుంటే అన్న కత్తితో పొడిచి చంపాడట.

సెషన్స్ కోర్టులో ఇద్దరికీ యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు.

హైకోర్టుకి అప్పీలు చేసుకున్నారు. అన్నకి అయిదు సంవత్సరాలకి తగ్గించారు. చనిపోయిన వ్యక్తి పారిపోవడానికి కూడా వీలులేకుండ పట్టుకున్నాడు కాబట్టి తమ్ముడికి శిక్ష తగ్గించలేదు. అన్న శిక్ష పూర్తి చేసుకుని వెళ్ళిపోయాడు. తమ్ముడు ఎనిమిది సంవత్సరాల శిక్షని పూర్తి చేసాడు.

"ఎంత గట్టు జరిపినా అతను మీ పెదనాన్న కొడుకుకదా ఎందుకు చంపారు"అని అడిగింది స్వాతి.

"నేను చంపలేదండి.... పట్టుకోనుకూడా లేదు.... అసలు ఆ సమయంలో నేను మా వూళ్ళోనేలేను అత్తగారింటికి వెళ్ళాను. కానీ మా



ఇద్దర్నీ కేసులో ఇరికించాలని వాళ్ళు- నేను మా పెదనాన్న కొడుకు కదలకుండా గట్టిగా పట్టుకున్నానని నామీద తప్పుడు కేసుపెట్టి నన్ను జైలుకు పంపారు అంటాడతను.

కానీ ఓపెన్ ఎయిర్ జైల్లో క్షణం తీరికలేకుండా గొడ్లపని చూసుకుంటున్నాడతను.... వాటికి మేత వేయడం, పాలు పిండడం- కొట్టం శుభ్రం చేయడం- పగలల్లా అతనికి ఈ పనులే సరిపోతాయి.

సిన్సియర్‌గా పనులు చేసుకుపోయే ఇటువంటివాళ్ళూ మనకి జైల్లో కనబడుతుంటారు. వాళ్ళని చూస్తూంటే శాపగ్రస్థులేమోననిపిస్తుంది. ఏవో కొన్ని బలహీన క్షణాల్లో ఆవేశానికిలోనై తమ జీవితాలని నాశనం చేసుకున్నవాళ్ళని చూస్తుంటే జాలేస్తుంది.

ఇటువంటి వాళ్ళు బయటికివస్తే వాళ్ళని రెచ్చగొట్టకుండా మామూలు జీవితాన్ని గడపడానికి మనందరం సాయం చేయాలి. తప్పు చేయడం మానవసహజం దానిని గుర్తించి మళ్ళీ ఆ తప్పు చేయకుండా జాగ్రత్త పడాలనుకునే వాళ్ళకి అటువంటి పరిస్థితుల్ని కల్పించాలి లేక పోతే మానదలుచుకున్న మనిషిని మృగంగా చేసిన వాళ్ళమవుతాం.

## ఇంటిదగ్గర భార్య ఆలోచనల్లో ఖైదీలు....

అర్ధరాత్రి—

అందరూ గాఢనిద్రలో వున్నారు—

రాజమండ్రి సెంట్రల్‌జైల్లో లైట్లువేసి పగలులావున్నా బారెక్స్‌లో ఖైదీలు నిద్రపోతున్నారు. కొందరు గార్డులు పహరా తిరుగుతున్నారు.

ఆ బారెక్స్‌లో అందరు ఖైదీలు నిద్రపోతున్నా అతనికి నిద్ర పట్టడంలేదు. అందుకే అటు ఇటు పొర్లుతున్నాడు. గార్డులెవరైనా అటు వస్తున్న అలికిడి అయితే కదలకుండా పడుకుంటున్నాడు

అతనివయసు ముప్పైరెండు సంవత్సరాలుంటాయి. మర్డర్‌ని చేయడానికి ప్రయత్నించాడన్న నేరంతో పది సంవత్సరాలు జైలుశిక్ష పడితే రాజమండ్రి జైలుకొచ్చాడు. ఆరుసంవత్సరాల శిక్ష పూర్తయింది.

హఠాత్తుగా అతనులేచి కూర్చున్నాడు.

చుట్టూ ఎవ్వరూ వస్తున్న అలికిడిలేదు. తలకింద పెట్టుకోడానికి అప్పట్లో జైల్లో చెక్కలిచ్చేవారు (1962 ప్రాంతంలో జరిగిన కేసు ఇది) ఆ చెక్కని తీసి ప్రక్కనున్న ఖైదీతలమీద గట్టిగా కొట్టాడు. ఆ తర్వాత అవతలవున్న మరో ఖైదీ తలమీదకూడా ఆ చెక్కతోనే గట్టిగా కొట్టాడు.

అరుపులు, కేకలు, గలాటాతో అందరూ మేల్కొన్నారు.

ఇద్దరు ఖైదీల తలలు పగలగొట్టిన ఖైదీని పట్టుకున్నారు.

బాగాదెబ్బలు తగలడంతో ఆ ఇద్దరూ మరణించారు.

జైలులో వున్నప్పుడు ఖైదీల నెవరినయినా చంపితే మరణశిక్ష విధించవచ్చు. అందుకని అతనికి మరణశిక్ష విధించారు.

ముందు మతిస్థిమితం తప్పి అతనలా చేసాడేమో అనుకున్నారు గాని తర్వాత అసలు విషయాన్ని అతనే బయట పెట్టాడు.

చనిపోయిన ఇద్దరిది, చంపినతనిది ఒకేవూరు. జైల్లో వున్నప్పుడు వాళ్ళిద్దరికి, ఇతనికి పడేదికాదట. చాలా విషయాల్లో కలహించుకునే వారట.

ఇతను విడుదల కావడానికి ఇంకా చాలా రోజులున్నాయిగాని వాళ్ళు విడుదలయ్యే రోజు దగ్గర కొచ్చింది.

"మేము విడుదల కాగానే మనవూరు వెళ్ళి మీ ఆవిడని చెరచక పోతే చూడు" అంటూ వాళ్ళిద్దరూ కోపంతో భయంకర శపథం చేసారట.

దానికి అతను కదిలిపోయాడు.

"వాళ్ళిద్దరూ చాలా భయంకరమైన మనుషులు సార్. అన్న ఘోరాన్ని తప్పకచేస్తారు అందుకే విడుదల కాకముందే వాళ్ళని చంపే సాను" అంటూ భోరుమన్నాడతను.

కారణాలు ఏవైనా అతను చేసింది భయంకరమైన తప్పు కాబట్టి ఉరి తీసేసారు. చాలా నిర్లిప్తంగా, నిర్వికారంగా అతను శిక్షని అనుభ వించాడట.

లక్నో మోడల్ ప్రిజన్‌లో మరో సంఘటన జరిగింది. అదీ పెళ్ళాం విషయంలోనే—

వ్యవసాయం చేసుకునే ఖైదీలకు రుణం ఇచ్చేవారు. వాళ్ళు బయటికివెళ్ళి తమకి కావలసిన వాటిని కొనుక్కొనివచ్చి జైలులోపల వ్యవసాయం చేసుకునేవారు. పంటపై వచ్చిన ఆదాయంలోంచి జైలు అధికారులిచ్చిన పెట్టుబడిని వాళ్ళకిచ్చేసి లాభాన్ని కష్టపడ్డ అందరూ సమంగా పంచుకుంటారు.

మోడల్ ప్రిజన్‌కి సత్ప్రవర్తనవున్నా వాళ్ళనే పంపిస్తారు.వాళ్ళకి మిగతా జైళ్ళ ఖైదీలకన్నా స్వాతంత్ర్యం పాలేఎక్కువ.

అతని వయసు ३౫సం. వుంటాయి. ప్రతీరోజూ బయటికి వెళ్ళి కావలసిన వాటిని కొనుక్కొని రెండు గంటలలోపు వెనక్కి వచ్చేస్తుంటాడు. అలా అతను ఎన్నిరోజులనుంచో వెళుతున్నాడు. మళ్ళీ వెంటనే తిరిగి వచ్చేసేవాడు.

కానీ ఆరోజు ఏవో వస్తువులు కొనుక్కొరావడానికి బయటికి వెళ్ళిన అతను ఆ రోజల్లా రాలేదు. ఎటో పారిపోయాడనుకున్నారు. మోడల్ ప్రిజన్‌లోంచి పారిపోవడానికి ప్రయత్నిస్తే అంతవరకూ అతను సంపాదించుకున్న గుడ్‌విల్ అంతా పోతుంది. రెమిషన్స్ అన్నీ కట్ అయిపోతాయి. మామూలు జైలుకి వెనక్కి పంపేస్తారు. ఇతనికీ అలాంటి ప్రాయశ్చిత్తమే చేయాలనుకున్నారు.

ఆశ్చర్యకరంగా మర్నాడు సాయంత్రం జైలుకి తిరిగి వచ్చేసాడతను. ఎంతో దిగులుగా వున్నాడు. అతను చెప్పిన విశేషాలు జైలు అధికారులను కూడా కదిలించి వేసాయి.

కొన్నిరోజుల క్రితం అతనికి వాళ్ళ వూరునుంచి ఎవర్నో కార్డు రాసారట— పలాన రోజున మీ ఆవిడ ఎవరితోనో లేచిపోతోంది వాళ్ళు కాన్పూరులో పలాన బండిఎక్కి, పలాన చోటికి వెళుతున్నారు అని.

ఆ రోజు నిన్న!

అందుకని బయటికి వెళ్ళిన అతను వుండబట్టలేక లక్నోనుంచి కాన్పూర్ వెళ్ళాడట.

అక్కడ బండిలో కూర్చుని భార్య, మరో పరాయివ్యక్తి కనిపించారట.

వెంటనే ఆతని రక్తం వేడెక్కింది కానీ వివేకం నశించలేదు.

'నేనొచ్చి జైలులో కూర్చున్నాను. ఆమె తన వయసంతటినీ వృధా చేసుకుని నాకోసం ఎదురుచూస్తూ వుంటుందని ఎలా అనుకోను. వెళ్ళిపోవాలనే అభిప్రాయం వచ్చినవాళ్ళని కొట్టి తిట్టికూడా ఆపలేం' అని పించి అతను కామ్‌గా వెనక్కి తిరిగొచ్చేశానని చెప్పాడు.

అటువంటి సందర్భాలలో ఎవరైనా రెచ్చిపోవడం సహజం. అలాకాకుండా ఎంతో ఉదాత్తంగా ఆలోచించి ఏ తప్పు చేయకుండా తిరిగి రావడమే అతను రిఫారమ్ అయినట్లు సూచిస్తోంది అని జైలు అధికారులు అతనిని క్షమించి రెమిషన్స్ ఏవీ కట్ కాకుండా కాపాడారు.

# నగ్నదేవత మహాడవ అవతారాన్ని

వ్రంగమ్మవ్వ కేసు అప్పట్లో చాలా సంచలనాన్ని రేకెత్తించింది. కాబట్టే ఆ కేసు గురించి మీకు నేను మళ్ళీ వివరంగా చెప్పాల్సిన అవసరం లేదు.

నగ్న దేవతగా ప్రసిద్ధి చెందిన మంగమ్మవ్వ తన అక్క, బావల సాయంతో భక్తుడైన రామకోటిరెడ్డిని చంపిందనే అభియోగంతో ముగ్గురికీ జీవిత ఖైదు విధించారు. మంగమ్మవ్వ, ఆవిడ అక్క హైద్రాబాద్

లోని ఆడవాళ్ళ జైలులో వుంటే వాళ్ళబావ మగవాళ్ళ జైలులో వున్నాడు. అక్కచెల్లెళ్ళిద్దరికీ రామకోటిరెడ్డితో అక్రమ సంబంధముందని, అతను పెళ్ళి చేసుకుని దూరమైపోతున్నాడనే సెక్సువల్ జెలసీతో అతణ్ణి చంపేసారని వాళ్ళకి శిక్ష విధించారు.

కేసు జరిగినప్పుడు మంగమ్మవ్వకి 22 సం. వాళ్ళక్కకి 25సం. సుమారుగా వుంటాయి. ఆరుసంవత్సరాల శిక్ష పూర్తి చేసారు. మంగమ్మవ్వ చిన్నప్పటినుంచీ అసలు బట్టలు ధరించేది కాదుట. కేసు విచారణ సమయంలోను, ఇప్పుడు జైల్లో కూడా అలాగే వుంటోంది. నగ్నదేవత మూడవ అవతారంగా తనకుతానే వర్ణించుకుందామె.

ఆడవాళ్ళ జైలుకి వెళ్ళినప్పుడు ఆవిడ దగ్గరకి వెళ్ళాను. సెల్‌లో ఓ మూల కూర్చుని ధ్యానం చేసుకుంటోంది. శరీరం ముందు భాగాన్నం తటినీ కప్పేస్తూ పెద్దజుట్టు, చూడగానే ఆకర్షించే పెద్దబొట్టు, రెండు చేతులకీ బోల్డు గాజులు, జైల్లో వున్న మిగతా ఖైదీలకు భిన్నమైంది ఆవిడ ప్రవర్తన.

నన్ను చూసి కూడా చూడనట్లు మళ్ళీ కళ్ళు మూసుకుంది.

అయిదు పది నిముషాలు గడిచాయి.

"మీతో మాట్లాడాలని వచ్చాను" మౌనాన్ని భంగపరుస్తూ అన్నాను

"నాతో ఏమి మాట్లాడతావ్ అందరూ నా గురించి నన్ను అడిగే రాస్తున్నారా? నన్ను చూడకుండా నా గురించి సరిగ్గా తెలీకుండా ఏవేవో వూహించుకుని ఎంతమంది రాయడంలేదు? అలాగే మీరు రాసుకోండి. దానికి నాతో మాట్లాడడం దేనికి! ఇలా రాసేవాళ్ళమీద నాకేమీ కోపం లేదు. వాళ్ళ బ్రతుకుతెరువుకోసం వాళ్ళు పడేపాట్లవి తల్లిగా తగదంటాను కాని కక్ష్య పెంచుకోను. ఈ మాటలు తప్ప మళ్ళీ ఆవిడ పెదాలు విడివడ పోవడంతో కాసేపుండి ఇవతలికి వచ్చేసాను.

ఆవిడ గురించి అడిగినప్పుడు డెప్యూటీ సూపరింటెండెంట్‌గారు

"ఇప్పటికీ ఆవిడని చూడడానికి భక్తులు వస్తూనే వున్నారు. ఆవిడ రోజూ పళ్ళు తప్ప మిగతా వాళ్ళలా భోజనం చేయరు. మొదట్లో సైకియాట్రిస్ట్ లని రప్పించి స్టడీ చేయించాము. తన పద్ధతుల్ని ఆవిడ మార్చుకోలేదు. చదువుకోకపోయినా ఎంతో తెలివిగా మాట్లాడుతుంది క్రమంగా భక్తుల రాకపోకలు తగ్గుతున్నాయి. ఈమధ్య ఎవరో వాళ్ళింటికి వెళ్ళి ముసలి తల్లితో మీ వాళ్ళకి బెయిల్ వచ్చే ఏర్పాట్లు చేస్తాము అని చెప్పి కొంత డబ్బుని తీసుకుని పారిపోయాడట." అని చెప్పారు.

ఆతర్వాత అంతకన్నా మరో ఉన్నత అధికారిని కలిసినప్పుడు "నేను ఇన్స్పెక్టర్ జనరల్‌గారు మంగమ్మవ్వని జైలుకి తీసుకొచ్చిన కొత్తలో వెళ్ళాము. మేము ఓ గదిలో కూర్చుని ఆవిడని అక్కడికి రప్పించాం. భుజంమీద ఓ చిన్న ఎర్రటవల్ తప్ప మరేమి లేకుండా వచ్చింది. ఎదురుగావున్న స్టూవ్‌మీద కూర్చోమన్నాము.

"మీ గురించి ఏవేమో విన్నాం...." అని ఇన్‌స్పెక్టర్ జనరల్ అనగానే ఏదో పాటపాడింది. చేతిలోంచి ఓ చిన్న బాటిల్‌ని తీసింది. దాంట్లో మెరిక్యూరివుంది. చేతిలో పోసుకుని మేమిద్దరం పరీక్షించాం.

మాతో మాట్లాడుతూనే మెరేక్యురి అంతా తినేసింది. ఏమీ కాలేదు అన్నారు.

"ఇదివరలో శివలింగాలు సృష్టించేది భజనలు చేసేది. అని ఒక రనగానే—

మరొకరు సూపరింటెండెంట్‌గారు ఆ శివలింగాన్ని తీసుకెళ్ళిని తర్వాత మళ్ళీ లింగాన్ని సృష్టించలేదే...." అన్నారు.

"ఆవిడ వీటిని రహస్యాంగంలో దాచిఇవతలికి తీసి తాను సృష్టించి నట్లు మోసం చేసేది అని ఓ జైల్ ఉద్యోగిని అంటే....

"రహస్యాంగంలో అంతంత పెద్దలింగాలు ఎలా దాచగల్గుతుంది? అదీ కాకుండా ఆమె భక్తురాలు దేవుడి లింగాన్ని అలా అపవిత్రం చేయ లేదు" అని మరో ఉద్యోగిని ఆ అభియోగాన్ని కొట్టేసింది.

సైకియాట్రిస్ట్‌ని కలిసినప్పుడు "షిజోఫ్రినియా అనే మానసిక జబ్బు వున్నవాళ్ళు తాము దైవాంశ సంభూతులమని, తమకు అతీంద్రియ శక్తులున్నాయని చెబుతుంటారు. అలాగే ప్రవర్తిస్తుంటారు" అన్నారు.

మొదట్లో ఆమెకు బెయిల్ ఇచ్చినప్పుడు ఆశ్రయమిచ్చిన కె.ఎల్.ఎన్. మూర్తిగార్ని కలిసినప్పుడూ "ఆమె పిచ్చిది. మర్డర్‌తో తనకేమీ సంబంధంలేదు కాకపోతే చూసిన నిజాన్ని చెప్పమంటే చెప్పలేదు. కేవలం ఆ మూర్ఖత్వంతో కేసులో ఇరుక్కుంది. రామకోటిరెడ్డి ఇద్దరు ఆడవాళ్ళ చేతుల్లో చనిపోయేంత బలహీనుడు కాడు. ధృఢమైనవాడు వూళ్ళో కులాల ప్రాతిపదికమీద రెండు గ్రూపులున్నాయి. రెండో గ్రూపు పెద్ద అఘాయిత్యం చేసాడనే కోపం వుండి, వాళ్ళు అతని కోసం కాపుకాచి వున్నారు. ఆరోజు పుల్లన్నతో కలసి వస్తున్న అతడిని చూడగానే దెబ్బతీసారు. పుల్లన్న ప్రత్యక్షసాక్షి మంగమ్మవ్వకి కూడా తెలుసు అసలు హంతకులెవరో. తనని అసలు ఏమిజరిగిందో చెప్పమంటే నోరు విప్పదు. అందుకని మొదట్లో ఎంతో అండగా నిలిచిన మేము విసుగేసి ఇప్పుడు మిన్నకున్నాము" అన్నాడు.

ఈ అభిప్రాయాలన్నీ సేకరించిన తర్వాత మళ్ళీ మంగమ్మవ్వని కలిసాను.

మళ్ళీ మౌనం.

"నేను మీరు ఏమి చెప్పదల్చుకున్నారు అని అడగడానికి వచ్చినప్పుడు మీరిలా మౌనంగా వుంటే ఎలా? మా మీదనే అభియోగం ఆరోపించబడింది. అది నిజమో అబద్ధమో చెప్పడం మీ కనీస బాధ్యత. మీరు అలా నోరు విప్పకుండా వుంటే అందరూ వినేదే యదార్థమనుకుంటారు. అవునా? అన్నాను ఆవిడ దగ్గరనుంచి విషయం రాబట్టాలని.

ఆ మాటలకి స్పందించిన ఆమె "మూర్ఖత్వంలో వున్నప్పుడు ఏమి చెప్పినా తలకెక్కదు. అందుకే అందరూ నేను దోషినని దూషిస్తుంటే మిన్నకున్నాను. సొంత తల్లి దండ్రులే తమ బిడ్డల్ని చంపలేరు. అట్లాం

టిది నేనువాడినెలా చంపగలను. ఇంతకుముందు ఎంతోమందితమకష్టాలను నా దగ్గరకే వచ్చి చెప్పుకునే వాళ్ళు....వాళ్ళకి కష్టం వచ్చినప్పుడే నా దగ్గరకు వస్తారు" అంది.

"మీరు నగ్నంగా వుండడం ప్రజల్ని ఆర్షించడం కోసమేనా?"

"నేను గుడ్డలతో పుట్టలేదు. గుడ్డలతో పోను. మధ్యలో ఈ గుడ్డలెందుకు అందుకే చిన్నప్పటినుండీ ఇలానే వుంటున్నాను.

ఒకసారి నన్ను వెక్కిరించడానికని ఓ యువకుడు, నగ్నంగా నా ముందుకొచ్చాడు నేను అతనితో అద్దముందు నగ్నంగా నిలబడితే నీ ప్రతిబింబాన్ని చూసుకుని నువ్వే సుగ్గుపడాలి గాని అద్దం సిగ్గుపడదు కదా అన్నాను.

"ప్రజలకి ఏమి బోధించాలని మీ వుద్దేశం?"

"నేనేమీ చెప్పాలని ఈ లోకంలోకి రాలేదు. నేనెక్కడో వూరుకు దూరంగా ఓ ఆశ్రమంలో వుండేదాన్ని ఆ ఆశ్రమంలో కూడా ఎప్పుడూ వుండేదాన్నిగాను స్వేచ్ఛాజీవిని కొండల్లో కొనల్లో తిరిగేదాన్ని....నా దగ్గరకి వచ్చి ఎవరైనా ఏమైనా చెప్పుకుంటే నాకు చెప్పాలనిపిస్తే ఏమైనా చెప్పేదాన్ని భక్తుల దగ్గరనుంచీ ప్రత్యేకంగా చందాలు వసూలు చేసే ఆచారం మా ఆశ్రమంలో లేదు.

"మీమీద ఆరోపించబడిన నేరం విషయంలో మీరేమైనాచెప్తారా?"

"నేను ఏమి చెప్పినా నన్ను సమర్థించుకున్నట్లు వుంటుంది. అందుకని నేనేమీ చెప్పను మీకు కొన్ని పేర్లు ఇస్తాము ఆ పరిసరాలకు వెళ్ళి వాళ్ళనే అడగండి అప్పుడు నిజం మీకే తెలుస్తుంది."

# మరణశిక్ష ఎలా పడుతుంది?

అప్పట్లో దొంగతనంచేస్తే చేతులు నరికేసేవారు. వ్యభిచారంచేసే ఆడవాళ్ళని రాళ్ళతో కొట్టి చంపేవారు.

మరి ఇప్పుడో?

దొంగతనం చేసినా, వ్యభిచారం చేసినా, మరి యే తప్పు చేసినా న్యాయస్థానంద్వారా విచారించి తగిన శిక్షని విధిస్తున్నారు.

పూర్వపు శిక్షలు మనిషిని బాధించేటట్లు వుండేవి. అప్పటి శిక్ష వుద్దేశమే వేరు।

శిక్ష అనడంకన్నా శిక్షణ అంటే బాగుంటుంది. నేరస్థుడి లేక నేరస్థురాలిలో మానసిక పరివర్తన తీసుకొచ్చి సన్మార్గంలోకి మళ్ళించడమే నేటి శిక్ష వుద్దేశం. అందుకోసమే జైళ్ళని ఏటా కనీసం కోటిరూపాల ఖర్చుతో ప్రతీ రాష్ట్రం నిర్వహిస్తున్నాయి. అన్ని రకాల నేరాలు చేసినవాళ్ళూ జైళ్ళకి వస్తారు. వీళ్ళందర్నీ సంస్కరించడమంటే ఒక యజ్ఞం. అందుకే జైళ్ళ విభాగ నిర్వహణ ఎంతో కష్టతరమైనది. ఖర్చుతో కూడుకున్నది, సంఘానికి అత్యంత అవసరమైనది.

సంస్కరణ అని తల పెట్టినప్పుడు అందరి నేరస్థుల్ని సంస్కరించాలి. కొందరికి ఆ అవకాశం ఇవ్వకుండా మరణశిక్షవిధించి ప్రాణాలు తీయడం ఎంతవరకు సబబు?

ఒక మనిషిని చంపాడని అతడిని చంపడం ఎంతవరకు సమంజసం? అతను చేసిన తప్పునే శిక్షగా చేసి చూపిస్తున్నారు! ఇది ప్రతీకారం తీర్చుకోవడం అవుతుందిగాని సంస్కరించడంకాదు. ఇతర నేరస్థుల్ని భయపెట్టడంకాదు. ఉరిశిక్షవల్ల నేరస్థుల చేతుల్లో చనిపోయిన వారి బంధువులు ఆనందిస్తారు. అంతే! అంటే కక్ష ధోరణిని సమర్థిస్తున్నారు.

జీవించడం మనిషి ప్రధానహక్కు. దాన్ని కాపాడుకోవడానికే రకరకాల శాసనాలు. అటువంటప్పుడు ఆ హక్కునే కబళించే శాసనాలని ఏమనాలి? ఎంతో అభివృద్ధిని సాధించామనుకుంటున్న ఈ రోజుల్లోకూడా ప్రాణానికి ప్రాణం తీసుకోవడం అనాగరికం కదా.

ఎంతోమంది తీవ్రకృషి ఫలితంగా ఈ మరణశిక్షని అమలుపరచే ధోరణిలో కూడా క్రమంగా ఎన్నో మార్పులు వచ్చాయి.

1955కు ముందు సాధారణంగా హత్యచేసిన వాళ్ళందరికీ మరణ శిక్ష విధించేవారు. ఒకవేళ యావజ్జీవ కారాగార శిక్షవేస్తే, శిక్షని ఎందుకు



ఉరితీయడానికి వుపయోగించే 'మనిల్లా రోప్'

తగ్గించాల్సి వచ్చింది న్యాయాధిపతులు వివరించాల్సి వచ్చేది. 55నుండి పరిస్థితులు కొద్దిగా మారాయి. హత్యచేసిన వాళ్ళకి మరణశిక్ష లేక యావజ్జీవ శిక్ష- న్యాయాధిపతికి ఏది సబబు అనిపిస్తే అది ఇచ్చేవారు. 1976 తర్వాత పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. తప్పనిసరి పరిస్థితుల్లోనే మరణశిక్ష విధించాలి. లేకపోతే యావజ్జీవ శిక్షవేయాలి. మరణశిక్ష వేస్తే అందుకు కారణాలనీ న్యాయాధిపతి వివరించాలి. ఇలా మరణశిక్ష విష

యంలో అప్పటికన్నా పూర్తి వ్యతిరేక ధోరణిని ఇప్పుడు అమలు పరుస్తున్నారు. ఏమాత్రం కారణంలేకుండా కేవలం స్వార్థంకోసం భయంకరమైన హత్యలు చేసినవాళ్ళకే మరణశిక్ష వేస్తున్నారు. ఈ మార్పులు ఎలా వచ్చాయో పరిశీలిద్దాం!

స్వాతంత్ర్యానికి ముందు జైళ్ళ పరిస్థితులు చాలా అధ్వాన్నంగా వుండేవి. ఖైదీలను హింసించడమే శిక్షగా భావించేవాళ్ళు.

ఉరిశిక్షకన్నా ఆ శిక్ష కోసం ఎదురుచూస్తూ మానసిక క్షోభని ఎక్కువగా అనుభవిస్తారు. అది చాలా అమానుషం!

ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో ఉరుగ్వేకి చెందిన తేబెరా "మరణశిక్షని ఈ ఇరవయ్యోవ శతాబ్దంలో కూడా విధించడం చాలా అనాగరిక చర్య మనిషిలో మరుగుపడ్డ మానవత్వాన్ని బయటికి లాగాలి కాని చంపకూడదు ఐక్యరాజ్యసమితికి ఈ దురాగతాన్ని ఖండించాల్సిన బాధ్యత వుంది" అంటూ వాదించాడు.

ఆయన వాదనతో చాలామంది ఏకీభవించారు.

1948లో ఐక్యరాజ్యసమితి 217 ఎ తీర్మానాన్ని ప్రతిపాదించింది.

"పుట్టిన ప్రతీమనిషికి బ్రతికే హక్కు వుంది. ప్రాణాలు తీసే అధికారంగాని, మనుషుల్ని హింసించే అధికారం గాని ఎవ్వరికీ లేదు"

అప్పటినుండే మరణశిక్షకి వ్యతిరేకంగా ఆలోచించసాగారు.

1966లో ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ మరో తీర్మానాన్ని [2200 (XXI) ] కూడా ప్రతిపాదించింది.

"మరణశిక్ష సాధారణంగా వెయ్యకూడదు. చాలా అరుదుగా తప్పనిసరి పరిస్థితుల్లోనే విధించాలి. అలా విధించాలి అంటే నేరం పూర్తిగా రుజువవ్వాలి. 18సం. లోపు వాళ్ళయినా, గర్భం ధరించిన స్త్రీలయినా మరణశిక్ష విధించకూడదు. ఏ నేరస్థుడినీ హింసించకూడదు. క్షమాభిక్ష కోరుకునే హక్కు మరణ శిక్ష విధించబడిన వాళ్ళకి వుంటుంది"

ఉరిశిక్షని పూర్తిగా రద్దు చేయాలంటూ 1975లో నాల్గవ నివేదిక, 1980లో అయిదవ నివేదిక ప్రతిపాదించారు. తర్వాత స్టాక్‌హోమ్‌సభ

అన్ని దేశాల ప్రభుత్వాలనీ మరణ శిక్షని రద్దు చేయమని కోరింది.

ఆస్ట్రేలియా, బ్రెజిల్, కొలంబియా, కోస్టారికా, డెన్మార్క్, డొమినికన్ రిపబ్లిక్, ఈక్వేడార్, ఫిజి, ఫిన్లాండ్, ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ, అయిస్‌లాండ్, లక్సెంబర్గ్, నార్వే, పోర్చుగల్, ఉరుగ్వే, వెనిజులా మొదలయిన దేశాల్లో మరణశిక్షని పూర్తిగా రద్దుచేసారు.



ఉరితీసేప్పుడు తలకి తగిలించే ముసుగు. దీన్ని సెల్‌లోనే తగిలించి గాలోస్ దగ్గరకి తీసుకొస్తారు.

---

కెనడా, ఇటలీ, మాల్టా, నెదర్లాండు, పనామా, పెరు, స్పెయిన్, స్విట్జర్లాండ్ దేశాలలో మామూలు పరిస్థితుల్లో మరణశిక్షని రద్దుచేసారు. కానీ యుద్ధపరిస్థితుల్లో మరణశిక్ష వుంటుంది.

అల్జీరియా, బెల్జియమ్, గ్రీస్, జెనీవా, అయివరీకాస్ట్, సేచెల్లస్, అప్పర్ ఓల్టాలలో నామమాత్రంగానే మరణశిక్ష అమలులో ఉంది.

1973 నుంచి ఆ ప్రదేశాలలో మరణశిక్ష విధించడంలేదు.

జనరల్ అసెంబ్లీ థర్డ్ కమిటీ సమావేశంలో మరశిక్ష వుండాలంటూ మనదేశం వాదించింది. మనదేశ ప్రతినిధిగా వెళ్ళిన ఎస్. పి. కాప్లివాల్ అందుకు మూడు కారణాలని వివరించారు. సంస్కరణకోసం జైలులోవుంచిన నేరస్థుడు జైలు అధికారులను చంపితే, చిన్న పిల్లల్ని అమానుషంగా హతమారుస్తే, డబ్బుకోసం దేశద్రోహం తలపెడితే వాళ్ళని తప్పక మరణదండనకి గురి చేయాలని ఆయన వాదించారు.

మరణశిక్ష పూర్తిగా రద్దుచేయకూడదని వాదించేవాళ్ళు అందుకు సాధారణంగా మూడు కారణాలు చెబుతారు. ఈ శిక్ష వుంటే భయపడి హత్యలు చేయరని, హత్య చేసినందుకు మరణశిక్ష దైవదండన అని, మళ్ళీ అతను బయటికివచ్చి మరికొంతమందిని చంపకుండా కాపాడవచ్చునని అంటారు.

ఏ మనిషిలోనూ మానవత్వమనేది. లేకుండా పూర్తిగా పశుత్వం వుండదు. అతడు చేసే నేరాలకి పూర్తి బాధ్యత చుట్టు పక్కల వాతావరణందే।

మరణ శిక్షని తప్పించుకుని యావజ్జీవ ఖైదుని అనుభవించి బయటకి వచ్చి సమాజానికి ఉపయోగపడే జీవితాన్ని గడుపుతున్న వాళ్ళెందరో వున్నారు. కాబట్టి మరణశిక్ష విధించినంత మాత్రాన అతను బయటికి వచ్చి మరికొన్ని హత్యలు చేస్తాడనుకోవడం వూహాగానం మాత్రమే:

ఒకళ్ళకి ఉరిశిక్షవేస్తే మరొకళ్ళకు భయం కలిగిస్తుందనుకోవడం కూడా సరయిన ఆలోచనకాదు. సాధారణంగా హత్యలు చేసేవాళ్ళలో 90% మొదటగా నేరం చేసినవాళ్ళే! ఏవో కొన్ని వూహించని పరిస్థితుల ప్రభావంతో వాళ్ళా తప్పులు చేశారు. క్షణికమైన ఉద్రేకంలో వళ్ళుమరచి

హత్యలు చేసేవాళ్ళు ఆ సమయంలో హత్యచేస్తే కలిగే అనర్థాలు, మరణ శిక్ష గురించి ఆలోచిస్తారా?

ఒకడిని చంపాడంటూ అతడిని చంపడం ప్రభుత్వం చేయాల్సిన పనా? చనిపోయిన వ్యక్తితాలూకు వాళ్ళని తృప్తి పరచడానికే ఈ శిక్ష విధిస్తున్నారా? కేవలం నేరస్థుడిని ఉరితీసినంత మాత్రాన మరణించిన మనిషి తిరిగిరాడు కదా?

ఒక నేరం చేసిన తర్వాత అతడిని అతను సంస్కరించుకోవ డానికి ఒక్క అవకాశమైనా ఇవ్వాలి గదా?

నేరస్థుడిని సంస్కరించడానికి యావజ్జీవ ఖైదులో వుంచడానికి ఎంతో ఖర్చవుతుంది. కాబట్టి అతడిని ఉరితీసేసి ఆ సొమ్మును ప్రజోప యోగ ప్రాజెక్టులకోసం ఖర్చుపెట్టాలని వాదించే వాళ్ళూ వున్నారు. శిక్ష ఉద్దేశం మనిషిలో మార్పు తీసుకు రావడం కాని అతడిని హింసిం చడంకాదు. మనిషిలో మానసిక పరివర్తన తీసుకురావడం మహత్తర కార్యక్రమం! దానికి వెచ్చించేధనము దుబారా కాదు!

బహిరంగంగా ఉరి తీయడంవల్లకూడా ప్రజలలో ఎటువంటి మార్పూ తేలేరని ఎన్నో సంఘటనలు రుజువు చేసాయి.

"ఉరి బహిరంగంగా తీసినప్పుడు కొంతమంది చేతివాటు తనం వున్న కుర్రకారుని చూసాను. వాళ్ళలో ఎటువంటి భయం కలుగలేదు" అన్నాడు చార్లెస్ డికెన్స్.

1831లో ఓ సంపాదకుడు తన సంపాకీయంలో ఇలా రాసాడు.

"ఒక బహిరంగ ఉరి జరపడం కొంత ఆలశ్యమయ్యేసరికి కొంత మంది చూడడానికి వచ్చినవాళ్ళు అసహనంతో ఈలలు కేకలు వేసారు. ఇంతకన్నా రాక్షసత్వం మరొకటుంటుందా? మరోసారి ఒక బహిరంగ ఉరిని చూడడానికి ఎక్కడెక్కడనుంచో జనం వచ్చారు. తీరా వాళ్ళు అక్కడికి వచ్చిన తర్వాత ఆ ఉరితీత ఆగిపోయిం దని తెలిసింది. దాంతో అనవసరంగా ఈ పబ్లిసిటీ ఎందుకిచ్చారని వాళ్ళం

దరూ విరుచుకు పడ్డారు. మనిషిలో ఎటువంటి మార్పుని బహిరంగ ఉరులు తెస్తాయో చెప్పడానికి ఈ రెండు ఉరులు చాలు.

"మనమీద మనకే నమ్మకంలేని సంఘంలో మనం వున్నాం. అందుకే మనుషుల్లో మార్పురాదు అనే దృఢ విశ్వాసంతో వాళ్ళని ఉరి తీస్తున్నాం" అంటూ వాపోయారు కెనడా ప్రధానమంత్రి ట్రూడియన్.

మరణ శిక్ష రద్దు చేసినందువల్ల నేరాల సంఖ్య పెరిగిపోయినట్లు ఎక్కడా ఆధారాలు లేవు ట్రవాన్‌కూరో కొచ్చిన్‌లలో 1944 నవంబరులో ఉరిశిక్ష రద్దుచేసి తిరిగి 1951లో ప్రవేశపెట్టారు. ఆ రెండు ప్రాంతాల్లో



సికింద్రాబాద్ జైల్లో ఒకేసారి నలుగురిని ఉరి తీయవచ్చు.

1945నుండి 1950 వరకు 962 హత్యలు జరిగితే మరణశిక్ష ప్రవేశపెట్టిన తరువాత 1951 నుండి 1956లోపు 967 హత్యలు జరిగాయి. అంటే మరణశిక్ష అమలులో వున్నప్పుడే ఎక్కువ హత్యలు జరిగాయన్న మాట.

"ఒక దశలో నేను మరణశిక్షకి పూర్తిగా వ్యతిరేకిని. కానీ కొంత మందిని పూర్తిగా తొలగించకపోతే దేశం బాగుపడదు. అటువంటి వాళ్ళని

తొలగించడానికి మరణశిక్ష వుండాలి"అన్నారు ఓ సందర్భంలో నెహ్రూ గారు.

"నేనూ వ్యక్తిగతంగా మరణశిక్షకు వ్యతిరేకిని, కానీ కొన్ని నేరాలు చాలా హేయమైనవి. ఆ నేరాలు చేసిన వాళ్ళకి మరణశిక్షే సరయిన శిక్ష"మరణశిక్షపై శ్రీమతి ఇందిరాగాంధి అభిప్రాయం ఇది.

హత్య చేస్తే భారతీయ శిక్షాస్మృతి 302 ప్రకారం ఉరిశిక్ష లేక యావజ్జీవశిక్ష విధించాలి. అంతకన్నా తక్కువ శిక్ష విధించకూడదు. సెక్షన్ 302లో మార్పు తీసుకువచ్చే బిల్లుని 1976లో రాజ్యసభలో ప్రవేశ పెట్టారు. 1978లో బిల్లు అనుమతి పొందింది.

ముందుగా ఓ పథకం ప్రకారం కాకుండా కొన్ని కారణాలవల్ల ఆవేశంలో చేసిన హత్యలకి, కిరాతకంగా చేయని హత్యలకి ఉరిశిక్ష విధించకూడదు.

హంతకుడు మైనరైనా, చాలా ఎక్కువ వయసున్న వాడైనా, అతనిమీద ఆధారపడి వున్నవారు వున్నా, తను నేరం చేయడానికి రెచ్చగొట్టిన బలమైన కారణాలను రుజువు చేసినా, అలాగే నేరస్థుడి ఆరోగ్య పరిస్థితి అంతగా బాగుండకపోయినా ఆత్మరక్షణ కోసం హత్య చేసినా, ఉరిశిక్షని సడలించి యావజ్జీవ శిక్ష విధిస్తారు.

వయసు, ముందు పరిస్థితులు, ప్రవర్తన, కుటుంబం గురించి, నేరాన్ని ఎలా చేసారు, ఏ ఆయుధం వాడాడు, నేరం చేయడానికి కారణం, చచ్చిపోయినవాడు నేరస్థుడ్ని ఏమి చేసాడు, చుట్టుప్రక్కల పరిస్థితులు మొ॥ పరిశీలిస్తారు. ఉరిశిక్షను యావజ్జీవ శిక్షగా సడలించడానికి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధాన్ని లేవదీయడానికి ప్రయత్నించినా (సెక్షన్ 121) రక్షక దళాలలో వున్న వారిని హత్యచేసినా (సెక్షన్ 135) తనిచ్చిన తప్పుడు సాక్ష్యానిబట్టి ఓ అమాయకుడు ఉరి తీయబడ్డా (సెక్షన్ 194) హత్య చేసినా (302) యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్నవాడు హత్య చేసినా (303) 18సం. లోపు కుర్రాడుగాని మత్తు పదార్థాలు తీసుకున్న వాడుగాని ఆత్మహత్య చేసుకోవడానికి పురిగొల్పినా (305), బందిపోటు దొంగతనం చేసి హత్య చేసినా (396) ఉరిశిక్ష విధించవచ్చు.

# ఉరిశిక్ష

భయంకరమైన నేరాలు చేసిన ఖైదీలకు మరణశిక్ష విధిస్తుంటారు. ఖైదీలకు మరణశిక్ష అమలుపరిచే వీలు మన రాష్ట్రంలో సికింద్రాబాద్, రాజమండ్రి జైళ్ళతో మాత్రమేవుంది.

ఒక ఖైదీకి సెషన్స్ కోర్టులో మరణశిక్ష విధిస్తే అతను హైకోర్టుకి అప్పీలు పెట్టుకోవచ్చు.

హైకోర్టుకూడా శిక్షని నిర్ధారిస్తే అప్పుడు సుప్రీమ్ కోర్టుకి వెళ్ళవచ్చు. సుప్రీమ్‌కోర్టూ మరణశిక్షని ధృవీకరిస్తే రాష్ట్ర గవర్నర్ ద్వారా రాష్ట్రపతికి "దయ" చూపించమని పిటిషన్ పెట్టుకోవచ్చు. రాష్ట్రపతికి ఆర్డినెన్స్‌మీద సంతకం చేసిన తర్వాతే ఏ ఖైదీకయినా మరణశిక్ష అమలు పరిచేది.

ఉరితీయ బోయేముందు ఆ ఖైదీ తాలూకు వాళ్ళకి తెలియజేస్తారు. కానీ వాళ్ళనెవర్నీ ఉరితీసేప్పుడు వుండనివ్వరు. ఉరితీసిన తర్వాత శవాన్ని వాళ్ళకి అందజేస్తారు. ఖైదీకి మాత్రం ఉరితీయడానికి 24 గంటలు ముందు చెబుతారు. ఇంకా ముందేచెబితే అతను మానసికంగా ఎక్కువ ఆందోళన చెందుతాడనే అలా చేస్తారు.

ఉరిశిక్షని రాష్ట్రపతి కూడా ధృవీకరించినట్లు తెలియగానే ఆఖైదీల మానసిక పరిస్థితిలో విపరీతమైన మార్పు వస్తుంది. కొందరు పూర్తిగా కృంగిపోయి సైలెంట్ అయిపోతే మరికొందరు బాగా రెచ్చిపోతారు. అందుకనే ఉరిశిక్ష విధించిన ఖైదీలను మిగతా ఖైదీలతో కలవనివ్వరు. వాళ్ళకోసం ప్రత్యేక "సెల్స్" వుంటాయి. వాటిలో ప్రత్యేక సిబ్బంది నిఘా కింద వుంచుతారు.

ఉరి తీయడానికి ముందురోజు అతని ఆఖరి కోరికను అడిగి, తీరు స్తారు. (హద్దుమీరని కోరికలయితేనే తీరుస్తారు.) జైల్లోనే అతని చేతుల్ని వెనుక కలిపి కట్టేస్తారు. ఖైదీ ప్రవర్తన మరింత ఇబ్బందికరంగా వుంటే కాళ్ళకి గొలుసులు వేసి ముందు ఇద్దరు గార్డులువుండి, అతడిని సెల్‌నుండి ప్రత్యేక మార్గంగుండా ఉరితీసే స్థలంకి తీసుకొస్తారు.

ఖైదీని బయల్దేరతీసేముందు సూపరింటెండెంట్ అతను లేక ఆమెకి ఎందుకు వురిశిక్ష విధించిందీ చదువుతాడు వెంటనే మేజిస్ట్రేట్ అతని మాటలు రికార్డుచేసి సంతకం తీసుకుంటాడు



మిగతా ఖైదీలకు దూరంగా ఉరితీసే ఖైదీలను ఈ కండెమ్డ్ సెల్స్‌లో వుంచుతారు.

---

ఉరిశిక్ష అమలుపరిచేప్పుడు ఆ జైలు సూపరింటెండెంట్, డాక్టర్, మాజిస్ట్రేట్ అక్కడ వుంటారు. సికింద్రాబాద్ జైలులో ఒకేసారి నలుగు రిని వురితీసే వీలుంది. పైనున్న రింగులనుండి గట్టి తాళ్ళని వేళ్ళాడదీసి, వాటి ద్వారా ఉరితీస్తారు. ఆ తాళ్ళ గట్టిదనాన్ని పరీక్షించడానికి అంతకు

ముందురోజు ఉరితీసే ఖైదీ బరువుకి $1\frac{1}{2}$ రెట్లు బరువుండే ఇసుక బస్తాలను వేళ్ళాడదీస్తారు. దాంతో ఆ తాడు గట్టిదనం తెలుస్తుంది.

తెల్లవారుఝాము అయిదుగంటలలోపే ఉరితీస్తారు. ఉరికంబం దగ్గరికి రాగానే తలని నల్లటి గుడ్డతో కప్పేసి, మెడకి వుచ్చు బిగిస్తారు. సరిగ్గా టైమ్ కాగానే వురిని అమలుపరచే అతను అక్కడున్న లివర్‌ని లాగుతాడు. వెంటనే ఖైదీల కాళ్ళక్రింద నున్న తలుపులు తెరుచుకుని వాళ్ళు వేళ్ళాడతారు. క్రమంగా మెడకివున్న వుచ్చు బిగుసుకుంటుంది. ప్లాట్‌ఫారమ్‌కన్నా కింది లెవెల్‌కి ఖైదీలను జారుస్తారు. అంటే బయట నున్న వారికి ఆ తాడు అటుఇటు కదలడాన్ని బట్టి క్రింద గుంటలో ఖైదీ వూపిరాడక తన్నుకుంటున్నాడని తెలుస్తుంది. రెండు నిముషాలలోపే ఆ తాడు కదలడం ఆగిపోతుంది. అంటే కిందమనిషి కదలిక ఆగిపోయిందన్న మాట!

వెంటనే క్రిందకి దిగివెళ్ళి వెనుకనున్న తలుపుల్ని తెరిచి వురితీసిన ఖైదీ శవాన్ని క్రిందకి దించుతారు. డాక్టర్ పరీక్ష చేసి అతను లేక ఆమె చనిపోయినట్లు నిర్థారించడంతో వురిశిక్ష పూర్తవుతుంది.

నేరస్థులలో పరివర్తన తీసుకురావడమే శిక్ష విధించడంలో ప్రధాన వుద్దేశం అయినప్పుడు అతడిని లేక ఆమెను వురి తీసేస్తే ఆ వ్యక్తిని సంస్కరించే ప్రశ్నే వుండదుకదా! అందుకే చాలా భాగం వురిశిక్షలని తగ్గించి యావజ్జీవ కారాగార శిక్షలుగా మారుస్తున్నారు దాదాపు 28 దేశాలలో వురిశిక్షను పూర్తిగా నిషేధించారు. 1985-86లో ప్రపంచం మొత్తంమీద వెయ్యి వురిశిక్షలని మాత్రమే అమలు పరిచారు.

మన రాష్ట్రంలోని సికింద్రాబాద్ జైల్‌లో 1965లో ఎక్కువ ఉరిశిక్షలను అమలు పరిచారు. ఆ సంవత్సరంలో ఆరుగురిని వురితీసారు. క్రమంగా తగ్గిపోయాయి. 1978లో ఆఖరి వురి....ఆతర్వాత ఇంతవరకూ మళ్ళీ సికింద్రాబాద్ జైల్‌లో వురిశిక్ష ఎవరికీ అమలు పరచలేదు.

ఉరిశిక్ష విధించడంవల్ల ఆ వ్యక్తిలో మార్పు రావడానికి అవకాశం లేదుగానీ, ఆ శిక్షని చూసి మరికొందరు నేరస్థులు నేరాలు చేయడానికి

భయపడతారు అని కొందరు వాదం. అందుకే వురిశిక్ష అమలు పరచాలని కొందరు, పూర్తిగా నిషేధించాలని ఇంకొందరు భావిస్తున్నారు.

ఈ వురిశిక్ష అమలు పరచాలా? వద్దా? అని జంటనగరాలలో వున్న మూడు జైళ్ళ సూపరింటెండెంట్‌లనీ అడిగాను.

"ఉరిశిక్షల వల్ల నేరస్థుల ప్రవర్తనలో ఎటువంటి మార్పూ తీసుకు రాలేము. ఇదివరలో ఓ జేబు దొంగతనం చేశాడన్న నేరంమీద ఓ ఖైదీని ప్రజల సమక్షంలో వురి తీశారు. ఆవురి తీసేప్పుడు గుమికూడిన జనంలో ముగ్గురు జేబుల్ని ఎవరో కొట్టేసారు. దీనివల్ల మనకి ఎంత బహిరంగ వురిని అమలు పరచినా భయపడనివాళ్ళు భయపడరని అర్థమవుతోంది. అదీ కాకుండా అరెస్ట్ చేసిన తర్వాత డబ్బున్న వాళ్ళు బెయిల్ మీద బయటికొచ్చి శిక్షని తప్పించుకోడానికి ప్రయత్నాలు చేస్తారు. డబ్బులేని వాళ్ళు అలాగే జైళ్ళలో మగ్గి, శిక్షని అనుభవిస్తారు. మెర్సీ పొందడానికి నిర్దుష్టమైన నిబంధనలేవీ లేవు. అందుకని రాజకీయ పలుకుబడినో, లాబీ క్‌నో వుపయోగించి కొందరు మాత్రమే ఉరిశిక్షను తప్పించుకో గలుగుతారు. ఎటొచ్చీ బీదవాళ్ళు, దిక్కులేని వాళ్ళు మాత్రం వురికి గురవుతారు" అంటారు. సికింద్రాబాద్ జెయిల్ సూపరింటెండెంట్ శ్రీ పి. వి. టి. ఫిలిప్స్.

"వురిశిక్షలు వుండాలి. పూర్తిగా రద్దు చేయగూడదు. రిఫారమ్ చెయ్యడానికి వీలుకాని ఖైదీలు వుంటారు. వాళ్ళని ఇవాళ కాకపోతే రేపయినా విడుదల చేసామూ అంటే సొసైటీకి చేటు. అటువంటివాళ్ళను తప్పక ఉరితీయాలి" అంటారు మౌలాలి ఓపెన్ ఎయిర్ జెయిల్ సూపరింటెండెంట్ శ్రీ టి.వి రామనరసయ్య.

ఇదే అభిప్రాయంతో ఏకీభవించారు విజయవాడ డిస్ట్రిక్ జెయిల్ ఇన్‌ఛార్జ్ సూపరింటెండెంట్ శ్రీ అనంతరావు "అసలు వురిశిక్షను రద్దు చేయకూడదండి. సొసైటీకి తలనొప్పిగా తయారై, వాళ్ళ పద్ధతుల్లో ఎటువంటి పరిస్థితుల్లోనూ మార్పు తెచ్చుకొని వాళ్ళు కొందరుంటారు. వాళ్ళని వురితీయాలి తప్పదు!"

హైద్రాబాద్ సెంట్రల్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ ఐ. ఆర్. జోషిగారు కూడా ఉరిశిక్షను రద్దు చేయకూడదు అంటారు. ఉరిశిక్షని పూర్తిగా రద్దుచేస్తే కొందరు మితిమీరిపోయి అసలు కొరకరాని కొయ్యలుగా తయారవుతారు అంటారాయన.

14 ఉరిశిక్షలను చూసిన సాదత్ అలి "ఆఖరి క్షణంలో అందరిలోనూ పరివర్తన వచ్చింది. తాము చేసిన పాపానికితగ్గ శిక్షే అనుభవిస్తున్నాము అని వాళ్ళు కృంగిపోయారు"అంటారు.

హైద్రాబాద్ ఆడవాళ్ళ జైలులో మాట్రన్ లిల్లీరాజన్‌గారు 1957లో భువనగిరిలక్ష్మి అనే ఆమెను, 1959లో శాంత అనే ఆమెను ఉరితీయడం తమకి తెలుసని చెప్పారు.

శనగపప్పు అమ్ముకుంటూ, ఆ ఆశ చూపించి పిల్లల్ని తీసుకెళ్ళి, వాళ్ళవంటి మీద బంగారం కోసం చంపేసేది భువనగిరిలక్ష్మి. అలాగే ముగ్గురు పిల్లల్ని చంపింది. ఆమెకి ఉరిశిక్ష వేసారు.

మరో స్నేహితురాలితో కలిసి కేవలం బంగారంకోసం దారుణంగా మరో స్త్రీని చంపి పాతేసింది సావిత్రి. ఈవిడకీ ఉరిశిక్ష విధించారు.

"ఈ ఇద్దరూ సికింద్రాబాద్ జైలుకి తరలిస్తున్నామని తెలియగానే ఆరోజల్లా ఎంతో దారుణంగా ఏడ్చారు"అన్నారు లిల్లీరాజన్‌గారు.

# గొంతు కోసుకున్నా తప్పని ఉరి

అర్ధరాత్రి దాటింది.

అయినా సికింద్రాబాద్ జైలులోని ఖైదీలలో చాలా మందికి నిద్ర పట్టడంలేదు. అవునుమరి....తెల్లవారేలోపు ఓ ఖైదీ ప్రాణాలు గాలిలో కలిసిపోబోతున్నాయి.

అందరి మనస్సుల్లోనూ ఆదోవిధమైన గుబులు!

దైవప్రార్థనలు చేస్తూ కొంత సేపు గడిపారు. తర్వాత ఒక్కొక్కళ్ళే నిద్రలోకి జారుకోసాగారు.

జైలులోపల అన్ని షిఫ్టులకీ చెందిన సిబ్బంది వచ్చివున్నారు. వాళ్ళే కాకుండా కొంతమంది పోలీస్ సిబ్బంది కూడా వచ్చివుంది. ఇందరి బందోబస్తుమధ్య ఓవ్యక్తి ప్రాణం గాలిలో కలిసిపోబోతోంది.

కండెమ్డ్ సెల్స్ ముందు ప్రత్యేక గార్డులు కాపలా కాస్తున్నారు.

కండెమ్డ్ సెల్స్‌లో పెట్టినప్పటి నుండి ప్రతీక్షణం కంటిముందు నిలుచుని మృత్యుదేవత విలయతాండవం చేస్తుంటే భయంతో రోజు రోజుకీ కృంగిపోతుంటారు ఉరిశిక్షపడిన ఖైదీలు.

తిండి సయించదు....నిద్ర పట్టదు....

ఉరికన్నా కూడా రాష్ట్రపతి దగ్గరనుండి ఆర్డర్ వచ్చేవరకూ ఈ కండెమ్డ్ సెల్‌లోవుండే ఖైదీలు అనుభవించే మానసికవేదన వర్ణనాతీతం!

ఎక్కడ ఆత్మహత్యకు పాల్పడతారోనని ఏమీ అందకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేస్తారు.... ఆఖరికి మొలత్రాడు లాంటివి కూడా!

ప్రత్యేకంగా గార్డులు ఆ సెల్ దగ్గర కాపలా కాస్తుంటారు.

ఆరోజు ఓ సెల్ ముందు కాపలా కాస్తున్న ఇద్దరు గార్డులు వచ్చే నిద్రని ఆపుకుంటూ కునికిపాట్లు పడుతున్నారు.

లోపల ఓ నలభై సంవత్సరాల వ్యక్తి వున్నాడు. మర్డర్ చేసిన అతనికి ఉరిశిక్ష ఖాయమైంది. తెల్లవారేలోపు ఉరి తీసేస్తారు.

అతని తాలూకు బంధువు లెవ్వరూ లేకపోవడంతో ఎవరికి ముందు తెలియజెప్పాల్సిన అవసరం లేకుండా పోయింది. ఒకవేళ ఉరితీయబోయే వ్యక్తి, బంధువులుంటే వాళ్ళు ఇరవైనాల్గు గంటల ముందు ఆ వ్యక్తిని చూసిపోవడానికి వీలుగా టెలిగ్రాములు పంపిస్తారు. ఉరితీయబోయేవ్యక్తికి కూడా ఇరవైనాల్గుగంటల ముందే చెప్తారు. తనని ఉరితీయబోతున్నట్లు! అంతకు ముందు చెప్పరు.

అతనూ సెల్‌లో అశాంతితో కొట్టుకుంటున్నాడు. మరికొన్ని గంటల్లో ఉరితీయబోతున్నారు.

సెకండ్లు నిముషాలుగా మారుతున్నాయ్. చీకటి భయంకరంగా వుంది.

సెల్ బయట కాపలాకాస్తున్న గార్డు కూలబడి బీడీ అంటించాడు.

అతనికి ఎంతో బాధగా వుంది. కొన్ని నెలలుగా తమకి నమస్కారాలు పెడుతూ ఇక్కడ వుంటున్న ఓ నిర్భాగ్యజీవి మరికొన్ని గంటల్లో మృత్యువాత పడబోతున్నాడు....!

కాళ్ళకింద ఏదో చల్లగా తగిలినట్లనిపించి చేతితో తడిమి చూసాడు.

తడి....!

"ఇక్కడికి తడి ఎలా వచ్చిందబ్బా!" అనుకుంటూ ఆ చేతిని ఇవతలికి తీసి చూసాడు.

చేతినిండా రక్తం!

అతని వళ్ళు జలదరించింది.

ఈ రక్తం ఎక్కడ నుండి వచ్చింది?

తక్కున అతని చూపులు మరికొన్ని గంటల్లో ఉరితీయబడే ఖైదీ గదివేపు మళ్ళాయి. ఆ గదిలో నుండే రక్తం కాలువకట్టి బయటికొస్తోంది.

అదిరిపడి అటు పరుగెత్తాడు.

గదిమధ్యలో ఖైదీ పడివున్నాడు. మెడమీద ముందుభాగం బాగా గాయమైవుంది. చుట్టూ రక్తమయం....

బ్లేడుతో బలవంతాన గొంతు దగ్గర కోసుకున్నాడు. ఉరి తీయబోతున్నారనే భయాన్ని తట్టుకోలేక.

అందరూ అతడిని అప్రమత్తంగా కాపాలా కాస్తూనే వున్నారు. అయినా అందరి కళ్ళూ కప్పి అతను ఓ బ్లేడుని సంపాదించి, సెల్ లోపల దాచుకున్నాడు.

ఈవార్త దావానంలా వ్యాపించింది. అందరూ అక్కడికి పరుగెత్తు కొచ్చారు.

డాక్టర్ కూడా వచ్చాడు....

గాయంతుడిచి, కుట్లువేసారు. బాండేజ్ కట్టారు.

అప్పటికి రెండు గంటలు కావస్తోంది. కోసుకున్నందువల్ల ఆరోజు తన ఉరి ఆగిపోతుందనుకున్నాడు ఆ అమాయకుడు.

మేజిస్ట్రేట్, సూపరింటెండెంట్, డాక్టర్ అందరూ వచ్చేసారు.

ప్రథమ చికిత్స పూర్తికాగానే ఉరికంబానికి బయల్దేర తీసే ప్రయత్నాలు ప్రారంభించారు.

అతనింతకష్టపడ్డా ఉరి ఆగడంలేదని తెలిసేసరికి భయంతో మాట పడిపోయింది.

మవునంగా వాళ్ళు చెప్పిందల్లా చేయసాగాడు. డాక్టర్‌గారు అతను కొద్దిగా కోలుకున్నట్లు గుర్తించారు.

సూపరింటెండెంట్‌గారు అతనిమీద అభియోగాన్ని, శిక్షని చదివారు. 'నువ్వు చెప్పేదేమైనా వుందా?' అని అడిగారు మేజిస్ట్రేట్‌గారు.

అన్నింటికీ మవునమే అతని సమాధానం.

ముందు కొందరు, వెనుక, కొందరు గార్డులు నడుస్తుంటే ఉరి కంబంవేపు బయల్దేరాడతను.

అప్పటికే ఆ ప్రదేశమంతా స్టాఫ్‌తో గట్టిబందోబస్తు చేయబడి వుంది.

గాలోస్‌దగ్గరకి చేరుకున్నారు.

చెక్క తలుపులమీద వణికే కాళ్ళతో నిలుచుని వున్నాడతను.

"నువ్వు ఇంకేమైనా చెప్తావా?" అతని తలమీద ముసుగువేసేయబోయేముందు మరోసారి అడిగారు సూపరింటెండెంట్.

"గొంతుకోసుకున్నా కూడా ఉరి వేస్తారంటే అనవసరంగా గొంతు కోసుకుని ఇంతబాధని అనుభవించేవాణ్ణి కాదుగదా సార్...." బొంగురు పోయింది అతనిగొంతు.

అక్కడున్న అందరి కళ్ళు బాధతో చెమర్చాయి.

అతని తలమీద ముసుగు పడింది.

తాడు తగిలించారు.

సూపరింటెండెంట్ గారి సిగ్నల్ని గమనించి తలారి లివర్ని లాగాడు.

చటుక్కున ఖైదీ నుంచున్న ప్రదేశం క్రింద తలుపులు లోపలికి తెరచుకున్నాయి. ఆ గోతిలోకి పడిపోవడంతో అతని మెడకివున్న త్రాడు బిగుసుకుంది. సన్నని లోహపు రింగులా ఆ తాడుకి అమర్చి వున్నది మెడమీద వత్తుకోవడంతో క్షణాల్లో అతని ప్రాణాలు గాలిలో కలసి పోయాయి. కొద్దిగా అటు ఇటు వూగినత్రాడు నిశ్చలంగా వుండిపోయింది.

దాదాపు 16 సం॥ క్రితం జరిగిన సంఘటన ఇది.

# కళ్ళుగప్పిన కామం

అతను హైద్రాబాద్లో ఉద్యోగం చేస్తున్నాడు. తనకన్నా, భార్య కన్నా కూడా చిన్నవాడైన ఓ మిత్రుడు అతనికున్నాడు. ఇద్దరిదీ ఒకే ఆఫీసు కావడంతో వాళ్ళిద్దరిమధ్యా స్నేహం పెంపొందింది. తరచు స్నేహితుడు వీళ్ళింటికి వచ్చిపోతుండేవాడు.

ట్రయినింగ్కోసం అతను బెంగుళూరు వెళ్ళాల్సి వచ్చింది. వెళుతూ వెళుతూ అతను అప్పుడప్పుడు వచ్చి భార్య, పిల్లలు ఎలావున్నది చూసి వెళ్ళమని మిత్రుడ్ని కోరాడు.

అలాగేనని హామీ ఇచ్చాడు మిత్రుడు.

అతను బెంగుళూరు వెళ్ళిపోయాడు, ట్రయినింగ్ కోసం.

మిత్రుడు రోజూ వచ్చి అతని భార్య, ఇద్దరు కొడుకులు ఎలా వున్నది కనుక్కొని వెళ్ళేవాడు.

ఎలా ప్రారంభమైందో వాళ్ళిద్దరిమధ్యా ఆకర్షణ ప్రారంభమై, అది అతి త్వరలోనే శారీరక సంబంధం దాకా వెళ్ళిపోయింది.

భర్త ఎక్కడో బెంగుళూరులో వుండడంతో తామిద్దరి ప్రేమకలాపాలు అవిచ్ఛిన్నంగా సాగిపోతాయనుకుందామె.

కానీ ఆమె పెద్ద కొడుక్కి తొమ్మిది పదేళ్ళుంటాయి. అతను తల్లి, మరో మగాడితో చనువుగా వుండడం భరించలేకపోయాడు.

ఎదురు తిరిగాడు.

ఊహించని ఈ పరిణామానికి ప్రేయసి ప్రియులిద్దరూ కంగు తిన్నారు.

తండ్రి బెంగుళూరునుండి రాగానే ఈవిషయాన్ని చెప్పేస్తానని తల్లిని బెదిరించాడు ఆకుర్రాడు.

ఆమె వణికిపోయింది.

భర్తకి ఈ విషయం తెలిస్తే అతను తమను బ్రతకనీయడని కంగారు పడింది.

తల్లిప్రేమని అక్రమసంబంధ భయం మ్రింగేసింది.

తన ప్లాన్‌ని ప్రియుడికి వివరించింది.

ఆకుర్రాడు తమ సంబంధాన్ని పసిగట్టి బెదిరించి నప్పటికన్నా కూడా మిన్నగా బెదిరిపోయాడతను. వద్దని వారించాడామెని.

కానీ అతని సలహాలని పట్టించుకునే స్థితిలో లేదామె.

భర్త రాగానే కొడుకు తమ సంగతి చెప్పేస్తాడు! అదే ఆమె భయం.

ఒకరోజు ప్రియుడువచ్చేసరికి కొడుకుని ముక్కలు ముక్కలుగా నరికేసింది. ప్రియురాలి అఘాయిత్యానికి నోటమాటరాలేదు అతనికి. ఆమెని రక్షించాలంటే వెంటనే ఆ ముక్కల్ని మాయం చేయాలి.

ఆ ముక్కలన్నింటినీ ఓ గోతంలో వేసి మూటగట్టాడు. రక్తం లేకుండా ఇంటిని శుభ్రంగా కడిగాడు.

తెల్లవారేలోపే ఆ ముక్కల్ని ఎవ్వరూ పసిగట్టని ప్రాంతంలో పారేయాలని సైకిల్‌కి ఆ మూటని కట్టుకుని బయల్దేరాడు ప్రియుడు.

తెల్లవారుఝామునే సైకిల్ మీద వెళుతున్న అతడినిచూసి బీట్

కానిస్టేబుల్స్ విజిల్ వేసారు.

అతను మరింతగా కంగారుపడి పోయాడు. సైకిల్ వేగం పెంచాడు. పోలీసులకు అనుమానం పెరిగింది.

వెంబడించి పట్టుకున్నారు. 'సంచీలో ఏముందో'నని పట్టుకునేసరికి వాళ్ళ వళ్ళు ఝల్లుమంది. కాళ్ళు, చేతులు తగిలాయి!

అనుమానంతో ఆ మూటని విప్పి చూడగానే అందులో చనిపోయిన కుర్రాడి అవయవాలు వున్నాయి.

తక్షణం అతడిని అరెస్ట్ చేసారు.

విషయానంతట్నీ రాబట్టారు.

అతడి ప్రియురాలిని అంటే కామంతో కళ్ళకి మైకం కమ్మి కన్న కొడుకునే కిరాతకంగా హత్యచేసిన ఆ తల్లినీ అరెస్ట్ చేసారు.

ఆమె ప్రవర్తన బాగుండడంతో జైలు అధికారులు ఆమెచేత రిజిస్టర్లు ఇటు, అటు చేర్చడంలాంటి చిన్న చిన్న పన్లు చేయించుకునేవారు.

కరెంటు పోయినప్పుడు జైల్లో కిరసనాయిల్ దీపాలు వెల్గించేవారు. ఆ పనిని ఆమే చేసేది. ఈ విషయం అందరికీ తెల్సుగాని తిరిగి కరెంట్ రాగానే ఆ దీపాలలో మిగిలిన కిరోసిన్‌ని ఆమె ఒకచోట జమ చేసుకుంటోందని ఎవ్వరూ గమనించలేదు.

విచారణ పూర్తయింది.

ఆమెకు యావజ్జీవశిక్ష, ప్రియుడికి ఉరిశిక్ష విధించారు. (ఆడ, మగ కలిసి ఒక హత్యని చేస్తే ఆడమనిషిని మగమనిషే ఉత్తేజపరచి వుంటాడని అతనికే అధిక శిక్ష విధిస్తుంటారు....)

శిక్ష పడగానే జైలు యూనిఫారమ్ వేసుకోవాలి అంతవరకూ అండర్ ట్రయిల్‌గా వున్నప్పుడు తమ సొంత దుస్తుల్ని వేసుకోవచ్చు.

ఆరోజు ఆదివారం.

ఆమె జైలు వాళ్ళిచ్చిన కొత్త యూనిఫారమ్ వేసుకుంది.

ఆదివారం పూట అందరూ డ్యూటీలో వుండరు. కొందరు మాత్రమే వుంటారు.... ఈ విషయాన్ని కొన్ని నెలలుగా గమనిస్తున్న

ఆమె ఆరోజే అనువైన రోజుగా ఎన్నుకొంది.

ఆమె గదిలోనుండి పెద్ద ఎత్తున పొగలు వస్తుండడంతో అను మానం వచ్చి ఓ వార్డర్ అక్కడికి పరుగెత్తుకొచ్చింది.

సెల్ లోపల గడియ పెట్టుకుంది.

వంటినిండా కిరసనాయిల్ పోసుకుని నిప్పంటించుకోవడంతో భగ్గున మండిపోతోంది.

ఆనందంగానే దగ్ధమైపోతోంది. గాని "అబ్బా...." అని బాధగా మూల్గడం కూడా ఆమె చేయలేదు. అంటే ఆమె తాను చేసింది ఎంత పెద్ద తప్పనే మానసిక వేదనకి గురైందో వూహించుకోవచ్చు.

తలుపులు పగలగొట్టి ఆమెను బయటికి లాగేసరికి చాలా భాగం కాలిపోయింది. తర్వాత మరణించింది ఆమె. ఎంతో మానసిక వేదనని అనుభవించిందని అప్పటి హైద్రాబాద్ జైలర్, నేటి సీకా ప్రిన్సిపాల్ క్రిష్టోఫర్‌గారు చెప్పారు.

ఉరిశిక్ష విధించబడ్డ ఆమె ప్రియుడు కూడా దాదాపు అంత వేదనకీ గురయ్యాడు.

జైలులో అతని ప్రవర్తన బాగుండేదని అప్పటి సూపరింటెం డెంట్ ఇప్పుడు డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ సుబ్బారెడ్డిగారు చెప్పారు.

అంత చిన్నవాడు ఉరితీయబడుతున్నాడని జైలు అధికారులు కూడ కొందరు బాధపడ్డారట.

అతను మాత్రం "నేను హత్య చేయకపోయినా, ఆ చిన్నపిల్లా డిని హత్యచేసిన మనిషికి తోడ్పడి ఆ ముక్కల్ని పారేయడానికి దోహ దం చేయడం దారుణం. ఆమె మీదున్న అభిమానంతో అలా సహకరించక తప్పలేదు" అంటూ వాపోయాడట.

ఆరోజు తెల్లవారుఝామున మేజిస్ట్రేట్, డాక్టర్, జైల్ సూప రింటెండెంట్ అతడిని వుంచిన కండెమ్డ్ సెల్ దగ్గరకి వచ్చారు.

ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయ్యాయి.

దిగులు పడిపోయివున్న ఆ పాతిక సంవత్సరాల యువకుడిని

చూసేసరికి వాళ్ళకి ఎంతో జాలేసింది.సూపరింటె

నీళ్ళుకూడా వచ్చాయట

"అదేమిటిసార్....మీరలా బాధపడతారు.

ఇది తగిన శిక్షే. అనవసరంగా నాకోసం

సూపరింటెండెంట్ గారి కన్నీళ్ళని అత

మవునంగా అందరూ ఉరికంబం

"సార్....నా చేతుల్ని మీరు క

కౌగిట్లోకి జారిపోతున్నావని తెలిసినా అ

వెంటనే అతడి చేతుల్ని కలిపి

చుట్టూ బిగంతో అతను ఉరిక

1978లో సికింద్రాబాద్ జైల్లో

క్షణికోద్రేకంలో కొన్ని తప్పు

త్తాపం ఎంతగా క్రుంగదీస్తుందో వీళ్ళద్ద

# ఉరితీయబడిన ఖైదీ కంటిదానం

పల్లెటూళ్ళలో పొలాల దగ్గర తగాదాలు ఎక్కువగా వుంటాయి. దాంతో రెచ్చిపోయి కొందరు కొట్టుకోవడం, చంపుకోవడం కూడాచేస్తుంటారు.

మెదక్ జిల్లాలో ఓ గ్రామంలో చిన్న రైతు మల్లయ్య. అతని పొలం ప్రక్కనే ఓ కామందు పొలం వుంది. ఆ కామందుకి ఈ చిన్న రైతు అంటే ఎంతో చిన్న చూపు వుండేది. అతని పొలాన్ని కూడా తన పొలంలో కలిపేసుకోవాలనే ఆతృత వుండేది. దాంతో గట్టుని మల్లయ్య పొలంలోకి జరిపేసాడు.

కోపం వచ్చిన మల్లయ్య ఎదురు తిరిగాడు. పట్టించుకోకుండా అత డిని ఇష్టం వచ్చినట్లు తిట్టాడు కామందు ఆ రోజు, ఆ తిట్లలో ఇంటి వాళ్ళని కూడా కించపరచడంతో భరించలేక కోపంతో ముల్లుకర్ర తీసు కుని కామందుని కొట్టాడు మల్లయ్య.

కణతమీద తగలడంతో ఆ కామందు అక్కడికక్కడే చనిపో యాడు. వెంటనే మల్లయ్యని అరెస్ట్ చేసారు. సెషన్స్ కోర్టులో వురిశిక్ష వేసారు. హైకోర్టు, సుప్రీంకోర్టు ఆ శిక్షని ధృవపరిచాయి. అతనికి రాష్ట్ర పతి క్షమాభిక్ష కూడా దొరకలేదు. దాదాపు సంవత్సరంపాటు సికింద్రాబాద్ జైల్లోని కండెమ్డ్ సెల్స్‌లో మ్రగ్గిన అతను 1969లో ఉరి తీయబడ్డాడు.

ఈ సంవత్సరంపాటు అతనికి కంటిముందు మరణం కనిపిస్తుండ డంతో ఎంతో కృంగిపోయాడట. తనకెలాగూ మరణం తప్పదనే నమ్మ కంతో దైవప్రార్థన చేసుకుంటూ జైల్లో గడిపేవాడట. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే తన వాళ్ళని కామందు తిట్టాడన్న కోపంతో అతను హత్యచేసి జైలు పాలైతే ఉరి తీయబడేంత వరకూ అతడిని చూడడానికి అతని వాళ్ళెవరూ రాలేదట. ఇది అతడిని మానసికంగా మరింత కృంగ దీసింది. బహుశా కామందు తాలూకువాళ్ళు దౌర్జన్యంతో తన వాళ్ళని చూడడానిక్కూడా రానివ్వకుండా అరికట్టి వుంటారని అతను తలపోసే వాడు.

దాదాపు నలభై సంవత్సరాల వయసు ఉన్న అతనికి ఒక్కటే కన్ను ఉండేది. వురి తీస్తారని తెలిసి తన ఒక్క కంటినీ కూడా తను చని పోగానే తీసేసుకొమ్మని సరోజినీదేవి కంటిహాస్పిటల్ వారికి రాసిచ్చాడట.

ఉరి తీయబోయేముందు దగ్గిర బంధువులకి టెలిగ్రామ్ ద్వారా విష యాన్ని తెలియజేస్తారు. మల్లయ్య ఉరి గురించి ఇంటికి టెలిగ్రామ్ ఇచ్చి నప్పుడు భార్య, పిల్లలు ఎవ్వరూ రాలేదు. ఎవ్వరో ఓ దూరపు బంధువు వచ్చి పలకరించి వెళ్ళాడు.

మరణ సమయం దగ్గర పడుతున్న కొద్దీ మల్లయ్యతో దైవభక్తి పెరిగి భజనలు చేసుకుంటూ వుండేవారు.

తెల్లవారుఝాము అయిదుగంటలకి మల్లయ్యని ఉరి తీసేస్తారు.

రెండున్నర ప్రాంతంలో మాజిస్ట్రేట్, అప్పటి డెప్యూటీ జైలర్ ఇప్పుడు హైద్రాబాద్ ఓపెన్ ఎయిర్ జైల్ సూపరింటెండెంట్ శ్రీరామ నరసయ్య అతని దగ్గరకి వెళ్ళారు.

భగవత్ ప్రార్థన, చేసుకుంటున్న మల్లయ్య భయంతో వణికిపోతున్నాడు.

తను చనిపోయిన తర్వాత భార్య మళ్ళీ పెళ్ళి చేసుకోకుండావుంటే తనకున్న కొద్దిపాటి పొలం, ఆమెకే చెందేటట్లు, ఒక వేళ ఆమె మళ్ళీ పెళ్ళి చేసుకుంటే తన పొలం పిల్లలకి చెందేటట్లు చూడమని అతను మాజిస్ట్రేట్‌కి మనవి చేసుకున్నాడు.

మూడున్నర ప్రాంతంలో స్నానం చేయించారు. కొత్త గుడ్డలు కట్టించారు (జైల్‌డ్రస్సు) డాక్టర్ వచ్చి పరీక్ష చేసాడు.

రంగం సిద్ధమైంది.

బందోబస్తుతో జైలర్ వచ్చి, అతనున్న సెల్ తలుపు తెరిచాడు. వెంటనే డెప్యూటీ జైలర్ అతడి చేతుల్ని వెనక్కి కట్టేసాడు. సూపరింటెండెంట్, మాజిస్ట్రేటు మొదలయిన వాళ్ళు కూడా వెంట వస్తుంటే అతడిని గాలోస్ మీదకి తీసుకొచ్చారు.

మల్లయ్య మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. దైవనామాన్ని జపించుకుంటూనే వున్నాడు. ఆఖరికి గాలోస్‌మీద కూడా!

తలమీద ముసుగు వేసేసారు. అతనిలో వణుకు పెరిగింది. తాడుని మెడకి తగిలించారు. భజన చేసుకుంటూనే వున్నాడు గాని గొంతులో వణుకు....శరీరమంతా వణుకు- విపరీతమైన భయంతో.

సూపరింటెండెంట్ ఆర్డరివ్వడం తలారి లివర్ని లాగడం కనురెప్పపాటులో జరిగిపోయింది.

కాళ్ళక్రింద తలుపులు తెరుచుకోవడంతో అతను క్రిందకి జారిపోయాడు. మెడకి కట్టిన తాడు బిగుసుకుంది. ఆ తాడు మొదలు మాత్రమే

బయటికి కనిపిస్తోంది. అతనిలోని వణుకంతా ఆ తాడులోకి వచ్చిందా అన్నట్లు ఓ నిముషంపాటు ఆ తాడు కదిలి ఆగిపోయింది.

అంటే క్రిందనున్న మనిషిలోని ప్రాణం గాలిలో కలసిపోయిందని అక్కడున్న వాళ్ళందరికీ అర్థమైపోయింది.

ఓ అయిదు నిమిషాలాగి డాక్టర్, సూపరింటెండెంట్ వెనుకకొచ్చి తలుపులు తెరిచారు. డాక్టర్ మల్లయ్య కాలిదగ్గర నాడిని పట్టుకుని చూసి అతను మరణించినట్లు ధృవీకరించాడు.

వెంటనే అతని శవాన్ని కిందికి దింపిమార్చురీ రూమ్‌లోకిచేర్చారు. దొనేట్ చేయడంతో ఒక్క కంటిని తీసేసారు.

తెల్లవారేలోపే ఉరి తీసిన మనిషి శరీరాన్ని బయటికి పంపేస్తారు. ఆ మనిషి తాలూకు వాళ్ళు ఎవరైనావస్తే వాళ్ళకి ఆ శవాన్ని అప్పజెబుతారు. మల్లయ్యకోసం ఎవ్వరూ రాకపోవడంతో జైలుసిబ్బందే అతని అంత్యక్రియలు జరిపించారు.

మరణించిన అతను ఏ మతం వాడయితే ఆ పద్ధతిలో అతని అంత్యక్రియలు జరిపిస్తాడు. మల్లయ్య హిందూ కావడంతో అతని శరీరాన్ని తగులబెట్టారు.

# చివరి క్షణాల్లో వణుకుగా మారిన ధైర్యం

**1972** జనవరి 19 తెల్లవారుఝాము సికింద్రాబాద్ జైల్లో చాలా హడావిడిగావుంది. జైలుసిబ్బంది యావత్తూ వచ్చివుంది. కొంతమంది పోలీసులుకూడా వచ్చారు. గాలోస్ ప్రాంతంలో బందోబస్తు మరీ ఎక్కువగా వుంది.

ఇంత హడావిడి మధ్య కండెమ్డ్ సెల్స్‌లోవున్న ఆ యిద్దరు ఖైదీలు ఎంతో మవునంగా వున్నారు.

హనుమంతరావు వయసు ముప్పైరెండు సంవత్సరాలు. పోలీస్ కానిస్టేబుల్‌గా పనిచేస్తుండేవాడు. అతను పనిచేసే పోలీస్‌స్టేషన్ సబ్ ఇన్‌స్పెక్టర్‌కి, అతనిమధ్య సత్సంబంధాలు వుండేవి కావట. ఒకసారి హనుమంతరావు క్యాజువల్ లీవ్ పెట్టాడు. దాన్ని గ్రాంట్ చేయలేదు సబ్ ఇన్‌స్పెక్టర్.

ఆ కోపంతో యూనిఫారంమీదే తుపాకీ తీసుకుని సబ్ ఇన్‌స్పెక్టర్ ఇంటికివెళ్ళి కిటికీలోంచి ఆయన్ని కాల్చివేశాడు. అందుకని వంగారెడ్డి సెషన్స్ జడ్జి హనుమంతరావుకి మరణశిక్ష విధించాడు.

హైకోర్టు, సుప్రీంకోర్టు కూడా అతను వేడుకున్నా క్షమాభిక్ష పెట్టలేదు. అతడిని ఉరి తీయమని 7-1-72న రాష్ట్రపతినుండి ఆర్డర్ వచ్చింది.

రెండో ఖైదీ అందం వెంకన్న. ఇతను ఓ భూస్వామి దగ్గర అప్పు తీసుకున్నాడట తీర్చకపోవడంతో అతను అడగసాగాడు. అది భరించలేక ఒకరాత్రి వెంకన్న అతనింటికి వెళ్ళి చంపేసాడట. వరంగల్ సెషన్స్ జడ్జి కేసుని విచారించి మరణశిక్ష విధించాడు. అతను కోరుకున్నా హైకోర్టు, సుప్రీంకోర్టు క్షమాభిక్షకి నిరాకరించాయి. భారత రాష్ట్రపతి నుంచి ఇతన్ని కూడా ఉరితీసివేయమని 7-1-72 తేదీతో ఆర్డర్ వచ్చింది.

సెషన్స్ కోర్టులో వురిశిక్ష పడిన తర్వాత వాళ్ళు హైకోర్టు సుప్రీంకోర్టు, గవర్నర్, రాష్ట్రపతిలను క్షమాభిక్ష కోరుకోవచ్చు. ఎక్కడ క్షమాభిక్ష దొరికినా అతను ప్రాణాలతో బయటపడతాడు. వీటన్నింటికీ దాదాపు రెండు సంవత్సరాలు పడుతుంది. ఈరెండు సంవత్సరాలు ఖైదీ ఆశనిరాశలమధ్య ఎంతో మానసిక వేదనతో కొట్టుకుంటూ వుంటాడు. రాష్ట్రపతి ఆర్డర్ వచ్చిన తర్వాత మాత్రం ఆలస్యం చేయరు. వెంటనే హోమ్‌డిపార్ట్‌మెంట్, హైకోర్టులకు ఎప్పుడు ఉరితీయబోతున్నది తెలియజేస్తారు జైల్ సూపరింటెండెంట్ ఖైదీ ఇంటికికూడా టెలిగ్రామ్ ఇస్తారు. ఉరితీసేముందు రోజు అతడిని చూడనిస్తారు. ఖైదీకి కూడా కేవలం ఇరవైనాల్గు గంటలముందే చెప్తారు ఉరితీయబోతున్నట్లు. అతను ఆత్మహత్యకు కాని, మరే ఘాతుకానికి పాల్పడకుండా వేయికళ్ళతో సెక్యూరిటీ గార్డులు

గమనిస్తుంటారు.

1970లో ఉరిశిక్షపడిన హనుమంతరావు, వెంకన్నల ఉరితీత 72లో జరిగింది వీళ్ళిద్దర్నీ చూడడానికి ఉరికి ముందు ఎవ్వరూ రాలేదుట. హనుమంతరావు వురిశిక్ష పడ్డ తర్వాతగాని, రెండేళ్ళపాటు కండెమ్డ్ సెల్సులో వున్నప్పుడుగాని, ఏ మాత్రం బెదురు భయం లేకుండా వున్నాడట ఎంతో ధైర్యంగా వున్న అతడిని చూస్తుంటే అందరికీ ఆశ్చర్యంగా వుండేదట. వెంకన్న మాత్రం తెగ భయపడిపోతుండేవాడట.

ఆ రోజు అంటే 19-1-72 తెల్లవారుఝాము ఉరిశిక్షలను అమలు పరచడానికి ఎంతోమంది సమాయత్తమయ్యారు వారిలో ఇప్పటి హైద్రాబాద్ జైలు సూపరింటెండెంట్ శ్రీ పి. వి. టి. ఫిలిప్స్ కూడా వున్నారు. ఆయన దయనీయంగా వున్న అప్పటి వాళ్ళ మానసిక పరిస్థితుల్ని వివరించారు.

తెల్లవారుఝాము ఇద్దర్నీ స్నానం చేయించి జైల్ డ్రస్ కొత్తది వేసారు తను చనిపోయిన తర్వాత శవాన్ని తమవూరు పంపవద్దని జైలు సిబ్బందే హిందూ పద్ధతి ప్రకారం అంత్యక్రియలు జరిపాలని ఇద్దరూ మేజిస్ట్రేట్‌కి విన్నవించుకున్నారట.

చేతుల్ని వెనక్కి కట్టేసి కడెమ్డ్ సెల్సులోనే తలకి ముసుగు తగిలించేసారట, చుట్టూ బందోబస్తులతో వాళ్ళని తీసుకుని బయల్దేరారు గాలోస్‌వైపు సూపరింటెండెంట్, మేజిస్ట్రేట్, డాక్టర్.

ముసుగు వేసివుండడంతో ముఖ కవళికలు తెలీవుగాని వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటున్న ఎక్కిళ్ళు మాత్రం చుట్టుపక్కల వాళ్ళకి స్పష్టంగా వినిపిస్తున్నాయట, అంతవరకూ ఎంతో ధైర్యంగా వున్న హనుమంతరావు విపరీతంగా వణికిపోతుంటే అంతవరకూ ఎంతో అధైర్యంగా వున్న వెంకన్న అడుగులు నిర్భీతిగా గాలోస్ వేపు పడుతున్నాయిట.

హఠాత్తుగా హనుమంతరావు కాళ్ళలో వణుకు పెరిగి నిలబడను కూడా నిలబడలేకుండా కూలబడి పోతుంటే పక్కనున్న జవాన్లు పట్టుకుని

బలవంతాన గాలోస్ మీదకు తీసుకువచ్చారు. వెంకన్న మాత్రం ధైర్యం గానే గాలోస్ మీదకివచ్చాడు. అక్కడ హనుమంతరావులో వణుకు ఇంకా పెరిగింది. మెడకివుచ్చు బిగించగానే దాదాపు స్పృహ తప్పిపోయాడట. క్రిందనున్న తలుపులు తెరుచుకోకముందే కాళ్ళు ముడుచుకుపోయి తాడుకి వ్రేలాడుతున్నట్లుగా వ్రేలాడసాగాడట.

సూపరింటెండెంట్ సిగ్నల్ ఇవ్వగానే లివర్ లాగాడు తలారి. వెంటనే ఇద్దరూ క్రిందనున్న బిలంలోకి జారిపోయారు. మెడ వుచ్చు బిగుసుకుంది. కొన్ని క్షణాల్లో వాళ్ళ శరీరాలు కొట్టుకోవడం ఆగిపో యాయి.

డాక్టర్ వచ్చి పరీక్షించి ఇద్దరు ప్రాణాలూ పోయాయని నిర్ధారిం చారు. తర్వాత వాళ్ళ శరీరాలను మార్చురీ రూమ్‌నుండి తెల్లవారేలోపే జైలు బయటికి చేర్చి వాళ్ళు కోరిన విధంగా హిందూ పద్ధతుల ప్రకారం అంత్యక్రియలు జరిపించారు జైలు అధికారు.

# వచ్చేజన్మలో బుణం తీర్చుకుంటాను!

అండం వెంకటరెడ్డి అనే ఇరవైరెండు సంవత్సరాల యువకుడు 19-1-72న సికింద్రాబాద్ జైల్లో ఉరికి గురయ్యాడు. ఆ సమయంలో సికింద్రాబాద్ జైలు సూపరింటెండెంట్ శ్రీ ఖురుదుకర్.

ఆయన కండెమ్డ్ సెల్‌లో ఆ యువకుణ్ణి చూడగానే షాక్ తిన్నా రట. కారణం అతను చిన్నవాడుకావడమే కాకుండా చెరగని చిరునవ్వుతో కనిపించడం!

ఆ ముఖం చూస్తుంటే ఇతను మరణశిక్ష విధించేంత ఘోరమైన నేరం చేసాడా? అనే అనుమానం కూడా ఖురుదుకర్ గారికి వచ్చిందట.

అందుకే అతడిని "నువ్వేమి నేరం చెసావు?"అని అడిగారు.

"నేను ఖూనీ చేసాను"

"ఎవర్ని?"

"ఓ వడ్డీ వ్యాపారిని...."నిశ్చలంగా అన్నాడట. సాధారణంగా నేరస్థులు నేరం రుజువైనా కూడా తామే నేరమూ చేయలేదని వాదిస్తుంటారు. కానీ ఈ కుర్రాడు చేసిన నేరాన్ని నిర్భయంగా వప్పుకోడం ఆయనని ఎంతో ఆశ్చర్యపరచింది.

రెడ్డికి మూడెకరాల పొలం వుందిట. దాన్ని సాగుచేయడం కోసం అతను ఓ కామందు దగ్గర కొంత అప్పు చేసాను. సేద్యానికి అవసరమై ఆ అప్పు తీర్చకుండా నే మరికొంత అప్పు కావాలంటూ ఆ పెద్ద భూకామందు దగ్గరకి మళ్ళీ వెళ్ళాడట

"పాత అప్పు వడ్డీ ఏమీ తీర్చకుండా మళ్ళీ డబ్బు అడగడానికి, రావడానికి సిగ్గులేదూ?"అంటూ అతడిని నానామాటలు అన్నాడట. రెడ్డి మాట్లాడకుండా వున్నకొద్దీ వడ్డీ వ్యాపారం చేసే ఆ కామందు రెచ్చిపోయాడట ఇష్టం వచ్చిన పదజాలంతో రకరకాలుగా అవమానించాడట ఏమీ చేయలేని రెడ్డి మనసులో ప్రతీకారజ్వాలరేగింది.

బయట వర్షం పడుతుండడంతో ఈ రాత్రికి ఇక్కడే వరండాలో పడుకుని మర్నాడు వుదయం వెళ్ళిపోతానని ఆ కుర్రాడుకోరాడు, ఆయన అంగీకరించాడు.

అర్ధరాత్రి లేచి అతి దారుణంగా కామందుని చంపి తన కక్షని తీర్చుకున్నాడు రెడ్డి.

వరంగల్ సెషన్స్ కోర్టులో అతనికి మరణశిక్ష విధించారు.

సికింద్రాబాద్ జైలుకి తరలించారు.

మరణశిక్షని ధృవపరుస్తూ, 12-10-70 తేదీతో హైకోర్టునుంచి 20-11-70తేదీ సుప్రీంకోర్టు నుంచి ఆర్డర్లు వచ్చాయి. 7-1-72 తేదీన భారత రాష్ట్రపతి నుంచి క్షమాభిక్ష కోరికను త్రోసి పుచ్చుతూ, మరణశిక్షని అమలు పరచడానికి ఆర్డర్ వచ్చింది.

అతను జైలులో వున్నప్పుడు చూడవానికి ఎవ్వరూ రాలేదు. అయినా అతను చెరగని చిరునవ్వుతోనే ధైర్యంగా వున్నాడు. రాష్ట్రపతి ఆర్డర్ రావడంతో సూపరింటెండెంట్ మీ ఇంటికేమైనా కబురు చేయాలా అంటే వద్దని వారించాడట. కాకపోతే వాళ్ళకి పంపించమని ఓ ఉత్తరాన్ని రాసి ఇచ్చాడట.

ఆ వుత్తరంలో "తల్లిదండ్రులారా! ఈ జన్మలో మీకు నేను ఏమీ సేవచేయలేకపోయాను.... క్షమించండి. వచ్చే జన్మంటూ ఉంటే తప్పకుండా మళ్ళీ మీ కొడుకుగా పుట్టి మీ ఋణం తీర్చుకుంటాను" అని రాసాడట. సూపరింటెండెంట్‌గారికి ఆ వుత్తరం చూసేసరికి కళ్ళవెంట నీళ్ళు వచ్చాయట, వెంటనే ఆ వర్తమానాన్ని వాళ్ళింటికి పంపాడు. అది చూసిన తర్వాత కూడా అతడిని చూడడానికి వాళ్ళ వాళ్ళెవరూ రాలేదట. అయినా అతను అంతగా బాధపడలేదట.

1972 జనవరి 19 తెల్లవారుఝాము అతనికి స్నానం చేయించి క్రొత్త జైలు డ్రస్ వేసి-ఉరి తీయబోతున్న రెండో ఖైదీతోపాటు ఉరి కంబంమీదకి తీసుకొచ్చారు.

"చివరిగా నువ్వేమైనా చెప్పదల్చుకున్నావా?" సూపరింటెండెంట్ శ్రీ ఖురుదుకర్ అడిగారట.

"నెత్తిన ముసుగువేసి, చేతుల్ని వెనక్కి కట్టివేసి నా ఆఖరి కోరికని చెప్పమంటే ఎలా చెప్పగలను?" అన్నాడు అతను.

ఆ గొంతులోని సిన్సియారిటీ ఖురుదుకర్‌ని కదిలించింది.

"వెంటనే అతనితలమీద ముసుగుని ఒకసారి తీసి, చేతుల్ని కూడా విప్పండి" అని ఆయన జైలర్ని కోరారు.

"సారీ సర్ .... ఈ సమయంలో అలా చెయ్యడం రూల్స్‌కి విరుద్ధం. పైగా అతను తప్పించుకోవడానికి ప్రయత్నించవచ్చు కూడా!" అంటూ జైలర్ సూపరింటెండెంట్ అభిప్రాయంతో ఏకీభవించలేదు.

"ఏమైనా జరగకూడనిది జరిగితే దాని బాధ్యత నేను వహిస్తాను" అని ఆయన గట్టిగా పట్టుబట్టడంతో జైలర్ అతని తలమీద ముసుగుతీసి,

చేతులు కట్టు విప్పారట.

రెడ్డి చెరగని చిరునవ్వుతో ఖురుదుకర్ వంక చూస్తూ "మిమ్మల్ని చివరిసారిగా చూడాలని, కరచాలనం చేయాలని నేనీ కోరిక కోరాను" అంటూ ఖురుదుకర్ గారి చేతులతో చేతుల్ని కలిపాడట.

నిశ్శబ్దం కొన్ని క్షణాలు భయంకర నృత్యం చేసింది.

ఖురుదుకర్‌గారి కళ్ళ వెంట నీళ్ళ ధారలు కరుతున్నాయి.

కర్తవ్యం వెన్ను చరిచింది.

తిరిగి అతడి చేతుల్ని వెనక్కి కట్టేసారు. ముఖాన ముసుగు వేసేసారు. మెడకి తాడు పడింది.

సూపరింటెండెంట్ సిగ్నల్‌తో తలారి లివర్‌ని లాగాడు. ఉరి కంబం మీద నిల్చున్న ఇద్దరూ కాళ్ళక్రింద తలుపులు తెరుచుకోవడంతో క్రిందనున్న గదిలాంటి మృత్యు గహ్వరంలోకి జారిపోయారు. క్షణాల్లో వాళ్ళ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

# ఉరికి గురయిన ఆడ నేరస్తురాలు

1957లో భువనగిరికి చెందిన లక్ష్మి అనే ఆమెకి ఉరిశిక్ష విధించారు. పల్లీలు మొదలయినవి అమ్ముకునే ఆమె చిన్నపిల్లలు బంగారు, వెండి ఆభరణాలతో కనిపిస్తేచాలు.... నెమ్మదిగా వాళ్ళని చేరదీసేది. పల్లీలు పెట్టేది, ఆప్యాయంగా పలకరించేది. అన్నెం పున్నెం ఎరుగని ఆ పిల్లలు ఆమెను నమ్మి, ఇంకా ఇస్తాను నాతో రమ్మంటే ఆమె వెంట వెళ్ళేవారు.

వాళ్ళని ఇంటికి తీసుకు వెళ్ళగానే తలుపులు వేసేసుకుని, ఆ పిల్లల ప్రాణాల్ని తీసి ఆభరణాలని స్వంతం చేసుకునేది. అలా ఆమె నల్గురు అయిదుగురు పిల్లల్ని పొట్టనబెట్టుకుంది.

ఒకసారి ఓ పిల్ల ఆమెవెంట వెళ్ళడం గమనించిన వారెవరో ఆ విషయాన్ని వెలుగులోకి తెచ్చారు. పిల్ల మాయమవడంలో ఆమె చెయ్యి వుందని అనుమానించారు. కానీ విషయాన్ని బయటికి లాగడం ఎలా?

ఆమెకు నాల్గు సంవత్సరాలు నిండిన కొడుకున్నాడు. అతనిద్వారా అసలు విషయాన్ని కూపీ లాగి లక్ష్మిని అరెస్టు చేసారు. ఉరిశిక్ష విధించారు.

జైలులో ఆమెతోపాటు వున్న పిల్లాడిని కసురుకునేది కొట్టేదట. ఆమె బారినుండి రక్షించడానికి ఆ పిల్లాడని వేరేచోట (జైలులోనే) వుంచేవారట. ఆఖరికి ఆమెను వురి తీసేసిన తర్వాత కూడా ఆమె శరీరం కోసం ఎవరూ రాలేదట. జైలుఅధికారులే ఆమెకి అంత్యక్రియలు జరిపి, పిల్లాడిని ఓ అనాధాశ్రమంలో చేర్పించారట.

ఆ తర్వాత 1959లో శాంత అనే మరోకామెను ఉరితీసారు.

శాంతకు సిగిరెట్లు తాగడం, సారా తాగడం, తెగ సినిమాలు చూడడం అలవాటు. భార్య చనిపోయి ఓ ఆరేళ్ళ కొడుకున్న ఓ వ్యక్తి ఆమెను చేరదీసాడు. అతను అతని తల్లికూడా పనిచేస్తుండేవారు. వాళ్ళ సంపాదనతో తిండికి గడవడమే అంతంతమాత్రం. అట్లాంటప్పుడు ఈమె దురలవాట్లన్నీ నిర్విఘ్నంగా కొనసాగడం ఎలా?

అందుకే తెగ అప్పులు చేసేది. ఆమెకి ఓ స్నేహితురాలుండేది. ఆమె ఇదే జాతి మనిషి కావడంతో అగ్నికి ఆజ్యం తోడైనట్లయింది.

ఇద్దరూ కలసి డబ్బుని సంపాదించడం ఎలా అని తెగ ఆలోచించారు.

తమ ఇంటి ముందు నుంచి వెళుతున్న ఓ యువతిని చూడగానే వాళ్ళిద్దరి కళ్ళూ తళుక్కుమన్నాయి. ఆమె కూడా లోయర్ మిడిల్ క్లాస్‌కి చెందినదే. అయినా తల్లిదండ్రులకు ఒక్కర్తె కావడంతో వంటిమీద కొద్దిగా బంగారముంది. ఏదోవంకన ఆమెవంటి మీదనున్న బంగారాన్ని కాజేయాలని శాంత, ఆమె స్నేహితురాలు మైసమ్మ ఆలోచించారు.

ఆమెతో మాటలు కలిపి ఇంట్లోకి తీసుకొచ్చారు. లోపలికి వచ్చిన తర్వాత కల్లులో మత్తు పదార్థం కలిపి ఆమెకిచ్చారు. ఆ యువతి స్పృహ కోల్పోయింది. వెంటనే ఛాతీమీద కూర్చుని ఆమె గొంతుపిసికేసిందట శాంత. ఆ యువతి కదలకుండా కాళ్ళు, చేతులు పట్టుకుందిట మైసమ్మ. క్షణాల్లో ఆ యువతి నిర్జీవిగా మారిపోయింది. వంటిమీదున్న నగలని వలిచేసుకున్నారిద్దరూ.

సాయంత్రమైతే అత్త, భర్తవచ్చేస్తారేమోననే భయంతో శవాన్ని ఓ గోనెసంచీలో కట్టి జాగ్రత్తగా ఓ మూలనుంచారు. మైసమ్మ నగల్ని పట్టుకెళ్ళి సికింద్రాబాద్‌లో అమ్మి, శాంత భాగాన్ని శాంతకిచ్చేసి తన భాగాన్ని తను తీసుకుంది. మర్నాడు భర్త, అత్త పనికి వెళ్ళిన తర్వాత వంటింట్లోనే తవ్వి శవాన్ని పాతేయాలనుకున్నారిద్దరూ.

పక్కింటికెళ్ళి శాంత త్రవ్వడానికి అవసరమైన పరికరాల్ని తెచ్చిందిట. ఇంట్లోవున్న కొడుకుని బయటికి తరిమేసి, తలుపులేసుకుని ఇద్దరూ నేలని తవ్వి శవాన్ని అందులోపెట్టి పైన మట్టివేసి దిబ్బగాచేసారట. ఆ దిబ్బని వంట చేసుకునే ప్రదేశంగా మార్చేసారట.

బయటికి నెట్టివేయబడిన ఆచిన్న కుర్రాడు తలుపు సందుల్లోంచి ఈ విషయాలన్నింటిని చూసాడు. అతడిని పోలీసులు బుజ్జగించి వాళ్ళ పిన్ని గురించి అడగ్గా ఆ కుర్రాడు ఈ విషయాలన్నింటినీ చెప్పేసాడట.

ముందు శాంతని అరెస్ట్‌చేసి, ఆ తర్వాత వనవర్తి పారిపోయిన మైసమ్మని కూడా అరెస్ట్‌చేసారు. సరయిన సాక్ష్యం లభించకపోవడంతో మైసమ్మ శిక్షని తప్పించుకోగలిగింది. శాంతకి ఉరిశిక్ష వేసారు.

శిక్షపడిన తర్వాత భర్తరావడం కూడా మానేసాడు. విపరీతమైన పశ్చాత్తాపంతో క్రుంగిపోయిందని అప్పటి అసిస్టెంట్ మాట్రన్ లిల్లీ రాజన్‌గారు చెప్పారు.

కాకపోతే ఈమె భువనగిరి లక్ష్మిలా తన రహస్యాన్ని బయటపెట్టిన కొడుకుమీద కోపం తెచ్చుకోలేదట. పసివాడు కావడంతో నిజాన్ని బయటికి చెప్పేసాడు. నేను చేసింది చాలా అమానుషం అని జైలు అధి

కాపల ముందు ఎన్నోసార్లు వాపోయిందిట.

సికింద్రాబాద్ జైలుకి ఆడవాళ్ళ జైలునుండి తరలిస్తున్నారని తెలియగానే తనకి రాష్ట్రపతి దయాభిక్షకూడా దొరకలేదనే విషయం అర్థమైపోయి, ఏడుస్తూ ఆడవాళ్ళ జైలుని విడిచిపెట్టింది.

సికింద్రాబాద్ జైల్లో ఉరివేయబోయే ముందురోజు "మీ వాళ్ళనెవరినైనా పిలిపించమంటావా?" అని అడిగిన ప్రశ్నకు జవాబుగా "నాకు ఉరిశిక్షపడిందని తెలిసి ఎవరూ రాలేదు కదా.... వాళ్ళనిప్పుడు చూడాలని నేను అనుకోవడంలేదు. నేను చనిపోయిన తర్వాత నా శవానికి అంత్యక్రియలు కూడా మీరే చేయండి" అంది ఏడుస్తూనే. ఉరిశిక్ష ఖాయమని తెలిసినప్పటినుంచీ భయంతో ఆమెకు రక్త విరేచనాలు కాసాగాయి.

"ఆఖరి కోరిక ఏమైనా వుందా?" అని అడిగితే "కాఫీ, సిగరెట్లు ఇవ్వండి చాలు" అందిట. తెల్లవారుఝాము ఉరితీస్తారంటే ఆ రాత్రంతా ఆమె నిద్రపోలేదట. కాఫీ, సిగరెట్లు తాగుతూ ఎంతో అశాంతితో గడిపింది.

శాంత తర్వాత మరే స్త్రీ ఉరితీతకి లోనుకాలేదు.

ఆ తర్వాత మరో ఇద్దరు స్త్రీలకి సెషన్స్ కోర్టు ఉరిశిక్ష విధించినా వయసు తక్కువ కావడం, చిన్న పిల్లలుండడం, కొన్ని బలమైనకారణాల వల్ల మనసు చెదిరి ఆ మర్డర్స్ చేసారనే వుద్దేశంతో వాళ్ళిద్దరి మరణశిక్షలనీ హైకోర్టు యావజ్జీవ కారాగార శిక్షలుగా మార్చింది. విచిత్రమేమిటంటే ఆ ఇద్దరూ- భర్తమరొకరితో అక్రమ సంబంధం పెట్టుకోవడం వల్ల రెచ్చిపోయి హత్యలు చేసినవారే!

# ఎనిమిదిమందిని ఉరితీసిన మరణశిక్షావ్యతిరేకి!?

**1953** నుంచి ప్రొబేషన్ సర్వీసెస్‌లో వుండి 1969లో జైల్ సూపరింటెండెంట్‌గా మారి ఖైదీల సంక్షేమం కోసం ఎంతో సేవని అందించిన ఖురుదుకార్ గార్ని స్వాతి ఇటీవల కలుసుకోవడం జరిగింది.

సైకాలజి, క్రిమినాలజీలో శిక్షణపొంది ఉద్యోగ ప్రవేశం చేసిన శ్రీ ఖురుదుకార్ జపాన్ వెళ్ళి అక్కడకూడా జైళ్ళలో నేరస్థుల స్థితి గతుల గురించి తెలుసుకుని వచ్చారు. సికింద్రాబాద్ జైల్లో పది సంవత్స రాలపాటు సూపరింటెండెంట్‌గా పనిచేసి ఆ తర్వాత వరంగల్ ట్రాన్స్ ఫర్ అయ్యారు. ఈయన కాలంలో సికింద్రాబాద్ జైల్లో ఎనిమిది మందిని ఉరితీయడం జరిగిందని చెప్పారు. అన్నిసార్లూ జంటలేనని కూడా ఆయన అన్నారు.

ఎక్కువమందిని ఉరి తీయించిన ఈయన వ్యక్తిగతంగా మరణ శిక్షకి వ్యతిరేకి కావడం ఆశ్చర్య పరచింది.

"అలవాటుగా నేరాలు చేసే వాళ్ళలో మోసప్రవృత్తి ఎక్కువగా వుంటుంది. కాని, పెద్ద శిక్ష పడ్డవాళ్ళు ఆలా వుండరు. వీళ్ళు ఏవో కార ణాలవల్ల భయంకరమైన తప్పుచేసి జైలుకి వచ్చి వుంటారు. మరణశిక్ష విధింపబడిన వాళ్ళు హింసాప్రవృత్తితో రెచ్చిపోతారు. అని కొంతమంది పుస్తకాలలోరాస్తే చదివాను. కొన్ని సినిమాలలో చూసాను.

కానీ వాస్తవానికి మరణశిక్షవిధించబడిన వాళ్ళు కండెమ్డ్‌సెల్స్‌లో వున్నవాళ్ళూ మానసికంగా నరకయాతనని అనుభవిస్తారు. రోజు రోజుకి

కృశించిపోతారు. ఆ యాతనతో ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించిన వాళ్ళూ వున్నారు. మరణశిక్షని అనుభవించడంకన్నా దానికోసం ఎదురు చూస్తూ ఇంకా ఎక్కువ శిక్షని అనుభవిస్తారు. కొంతమందిని ఉరికి గురిచేసేప్పుడు నాకు కళ్ళవెంట నీళ్ళు వచ్చేవి. ఎంతగానో చలించి పోయేవాణ్ణి" అన్నారు మరణశిక్షపై తన అభిప్రాయాన్ని చెబుతూ శ్రీ ఖురుదుకర్.

తర్వాత జపాన్‌లో జైళ్ళని కూడా తాను సందర్శించానని చెబుతూ అక్కడి పరిస్థితుల్ని వివరించారాయన.

"జపాన్ జైళ్ళలో కండెమ్డ్ ప్రిజనర్స్ పరిస్థితి మరీ దారుణంగా వుంది. ప్రతీ నాల్గు సంవత్సరాలకి అక్కడి పాలకులు మారుతుండడంతో ఎవరికివారే తర్వాతి వాళ్ళే మరణశిక్షని అమలు పరుస్తారులే అనుకుని తమ కాలంలో మరణశిక్షని వాయిదా వేస్తూపోయేవారు. దాంతో మరణ శిక్షకోసం ఎదురుచూస్తూ కండెమ్డ్ సెల్స్‌లో క్రుంగిపోతూ ఇరవై సంవత్సరాలు గడిపిన వారూ వున్నారు. వాళ్ళలో చాలా మంది మానసిక వత్తిడులకు తట్టుకోలేక పిచ్చివాళ్ళు అయిన వాళ్ళూ వున్నారు" అన్నారు ఖురుదుకర్.

మామూలు నేరస్థుల్ని ఎంత మందినయినా జైళ్ళలో కంట్రోల్ చేయవచ్చు కానీ రాజకీయ ఖైదీలుంటే మాత్రం చాలా ఇబ్బందులు పెడ్తారు. అంటారు ఖురుదుకర్. తెలంగాణా, ఆంధ్రా ఉద్యమాలు జరిగినప్పుడు ఎమర్జెన్సీరోజుల్లో ఆయన సికింద్రాబాద్ జైలుకి సూపరింటెండెంట్‌గా వున్నారు. ఎన్నో విపత్కర పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు. ఎమర్జెన్సీలో ఎక్కువమంది. రాజకీయ ఖైదీలనుంచింది సికింద్రాబాద్ జైల్లోనే. దాదాపు 270 మంది డిటెన్యూస్ అప్పట్లో అక్కడే వుండేవారట వాళ్ళ వల్ల తనకి ఎన్నో చేదు అనుభవాలు ఎదురయ్యాయని చెబుతూ ఆయన "రాజకీయ నాయకులు ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో వుండే సౌకర్యాలన్నీ జైళ్ళలో వుండాలంటారు. అందుకోసం నాతో పోట్లాటలు పెట్టు

కున్న వాళ్ళూ వున్నారు. ఒకసారి ఓ రాజకీయ ఖైదీ నన్ను నానా దుర్భాషలతో తిడుతుంటే విన్న కొంతమంది ఖైదీలు వాళ్ళని కొట్టడానికి తయారయ్యారు. వాళ్ళని శాంతింపజేసేసరికి నా తల ప్రాణం తోకకొచ్చింది. అంటే మామూలు ఖైదీలకన్నా కూడా అధ్వాన్నంగా ప్రవర్తించే వాళ్ళు రాజకీయ ఖైదీలు" అన్నారు గతాన్ని నెమరు వేసుకుంటూ.

ఈ విభాగంలో పనిచేయడం కత్తిమీద సాములాంటిది. వివిధ మనస్తత్వాల ప్రజలని ఎదుర్కోవాలి. వాళ్ళలో మానసిక మార్పు తీసుకురావడాకి ప్రయత్నించాలి. మంచికిమెప్పు లభించకపోయినా ఏ మాత్రం కాస్త అటుఇటు అయినా దుర్భర పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వస్తుంది ఈ జైళ్ళ విభాగంలో పనిచేస్తుంటే అంటారాయన.

"నేను సికింద్రాబాద్ జైల్లో పని చేసిన రోజుల్లో ఎనిమిది మంది ఉరి దగ్గరుండి జరిపించాను. అందరూ ఎటువంటి ప్రతిఘటనా లేకుండా శిక్షకి లోనయ్యారు. మానసికంగా మరణశిక్షకి ముందు నలిగిపోయారు. వాళ్ళ కన్నీళ్ళు నింపుకోవడమే కాకుండా మమ్మల్నీ కన్నీళ్ళకి లోనుచేసి మరీ ప్రాణాలు కోల్పోయారు. ఒక్కో ఉరి పూర్తయిన తర్వాత మళ్ళీ మామూలు పరిస్థితులకి చేరుకోవడానికి ఎంతో కాలం పట్టేది. వాళ్ళ దీన ముఖాలు, సెంటిమెంటల్ ప్రవర్తన కళ్ళముందు ఇప్పటికీ మెదుల్తూనే వున్నాయి" అన్నారు. శ్రీ ఖురుదుకర్.

# ఆఖరి నిమిషంలో తారుమారు

అతనికి డబ్బుంది కానీ మనసులేదు. ఆ డబ్బుని ఇంకా ఇంకా సంపాదించాలనే తపనతో ఎందరో అమాయకుల్ని మోసం చేసాడు. ఇతరుల అవసరాలతో ఆడుకుని వాళ్ళకి కొంత అప్పుగా ఇచ్చినట్లు ఇచ్చి వాళ్ళ దగ్గరనుంచీ అంతకు కొన్నిరెట్లు నిర్దాక్షిణ్యంగా రాబట్టేవాడు.మానవ

త్వం మరుగున పడిపోయిన అతనిలో ఎవరి పరిస్థితిని చూసినా జాలి కలిగేదికాదు. అతనివల్ల మోసపోయిన వాళ్ళెందరో వాళ్ళలో కొందరు కలసి ఓరోజున పువ్వెత్తున కామందు ఇంటిమీద కెగిసి చంపారు.

ఈ మర్డర్ కి కారణభూతులంటూ ముగ్గురుకి అదిలాబాద్ సెషన్స్ జడ్జి మరణశిక్ష విధించారు. ఇద్దరు దొరికారు. ఒకతను దొరకలేదు. ఆ ఇద్దర్నీ మరణశిక్ష అమలుపరచడం కోసమని సికింద్రాబాద్ జిల్లా జైలుకి తరలించారు.

"వాళ్ళిద్దరిలో చిన్నతనికి నలభై సంవత్సరాల వయసుంటే, పెద్దతనికి మరో అయిదేళ్ళు ఎక్కువుంటుంది. పెద్దతను ఎప్పుడూ మవునంగా వుండేవాడు. నెర్వస్‌గా ఫీలవుతున్నట్లు అనిపించేది.చిన్నతను చాలా ధైర్యంగా ఉండేవాడు. నేను చేసింది తప్పుకాదు. అనే దృఢ అభిప్రాయంతో వుండేవాడు" అన్నారు వాళ్ళగురించి చెబుతూ అప్పటి సికింద్రాబాద్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ ఖురుదుకర్.

తెల్లవారితే వాళ్ళని ఉరితీసేయాలి. అశాంతితో ఆరాత్రి నిద్రపట్టక అవస్థపడుతున్న సూపరింటెండెంట్‌కి ఆఫోన్ ఆశ్చర్యాన్ని కలిగించింది. అవతలి వాళ్ళు చెప్పిన విషయం తన కానందాన్ని కలిగించేదే అయినా అలా నడుచుకోడానికి తనకి స్వతంత్రంలేదు. అందుకని ఆ విషయాన్ని ఢిల్లీనుండి ఫోన్ చేసిన ఆ ప్రముఖ వ్యక్తికి విన్నవించు కున్నాడు–రంగమంతా సిద్ధమయ్యాక ఉరిని ఆపే అధికారం లేదని!

అవతలి వ్యక్తి ఫోన్ పెట్టేసారు.

మరి కొంచెంసేపటి తర్వాత హోమ్ సెక్రటరీ ఫోన్ చేస్తే ఖురుదుకర్ జైళ్ళశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ నుంచి తనకి ఆర్డర్ వస్తేనే ఆపడానికి వీలవుతుందని మనవి చేసుకున్నారట.

ఆ తర్వాత ఇన్‌స్పెక్టర్ జనరల్ ఫోన్ చేసేరట, రేపుదయం ఉరిశిక్ష అమలుపరచవద్దని.

నేరస్థుల పిటిషన్ స్వీకరించి మరోసారి వాళ్ళ కేసుని పరిశీలించే

నిమిత్తం సుప్రీంకోర్టు ఆరోజు ఉరిశిక్షని అమలుపరచవద్దని ఆదేశించింది.

ఆనందంగా సూపరింటెండెంట్ కండెమ్డ్ సెల్స్‌వేపు ఆ అర్ధరాత్రప్పుడే వెళ్ళారట. కండెమ్డ్ సెల్స్‌లో వాళ్ళిద్దరూ నిద్రపట్టక అశాంతితో అటు ఇటు తిరుగుతున్నారట.

"మీరు హాయిగా నిద్రపోండి. మిమ్మల్ని ఈరోజు ఉరితీయడం లేదు" సంబరపడిపోతూ ఖురుదుకర్ చెప్పిన మాటలకి వాళ్ళ ముఖాలు ఆనందంగా వికసించాయిట.

మరి కొన్నాళ్ళకి మళ్ళి మరణశిక్షని ధృవపరుస్తూ ఉత్తర్వు వచ్చింది.

ఆరోజు తెల్లవారుఝాము ఉరిశిక్ష అమలుపరుస్తారనగా రాత్రిబాగా పొద్దుపోయిన తర్వాత హైకోర్టు రిజిస్ట్రార్ స్వయంగా జైలుకొచ్చి సుప్రీం కోర్టు ఉత్తర్వు ప్రకారం రేపుదయం ఉరిశిక్షని నిలుపు చేయాలని చెప్పి వెళ్ళారుట.

వెంటనే కండెమ్డ్ సెల్స్ దగ్గరకి వెళ్ళి సూపరింటెండెంట్ వాళ్ళకి ఈ విషయాన్ని చెప్పారట. వాళ్ళ ముఖాలలో రిలీఫ్ స్పష్టంగా కనిపించిందట.

"ఇలా రెండుసార్లు వాళ్ళ ఉరి వాయిదా పడేసరికి మృత్యువు కోరల్లోంచి వాళ్ళు పూర్తిగా బయట పడినట్లే అని భావించాను నేను. కానీ ఎమర్జెన్సీలో మూడోసారి వాళ్ళ మరణశిక్షని ధృవపరుస్తూ ఆర్డర్ వచ్చింది. అప్పట్లో జైల్లో ఎంతోమంది రాజకీయ ఖైదీలు కూడా వున్నారు. వాళ్ళందరూ మరణశిక్షని అమలుపరచడానికి వీల్లేదంటూ నాకు అడ్డం పడ్డారు. నేను వాళ్ళందరికీ ఒక్కటే మనవి చేసుకున్నాను. వ్యక్తిగతంగా నేనూ మరణశిక్షకి వ్యతిరేకినే, ఈ శిక్షని విధించడంలో నా బాధ్యత ఏమీ లేదానే విషయం మీకు తెలుసు. కానీ అమలుపరచాల్సిన బాధ్యత మాత్రం సూపరింటెండెంట్‌గా నామీద ఎంతోవుంది అని నేను చెప్పడంతో వాళ్ళందరూ

మవునంగా వెనక్కి తగ్గారు. బయటనుంచీ కొందరు "మరణశిక్షని ఆపు చేయాలి"అనే చీటీలను రాళ్ళకుకట్టి జైల్లోకి విసిరేసారు.

"ఆరాత్రి మళ్ళీ ఎవరైనా వచ్చి ఉరిశిక్ష అమలు పరచకుండా చూస్తే బాగుండని ఎదురు చూసాను. కానీ ఎటువంటి ఉత్తర్వూ అందక పోవడంతో వాళ్ళని 1975 డిసెంబర్ 1వ తేదీన ఉరి తీసాం"అన్నారు గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ శ్రీ ఖురుదుకర్.

కాసేపాగి ఆయనే "నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించిన విషయ మేమిటంటే అంతవరకూ ఎంతో ధైర్యంగా వున్న చిన్నతను ఉరితీసే సమయంలో ఎంతో నెర్వస్ ఫీలయ్యాడు అంతవరకూ మవునంగా వున్న పెద్దతను బోల్డ్‌గా మరణాన్ని కౌగలించుకున్నాడు. గాలోస్ మీదకు తీసుకు వెళ్ళేప్పుడు వీళ్ళని సమర్థిస్తూ ఎంతోమంది జైల్లోని వాళ్ళు నినాదాలు చేసారు. చిన్నతను "మనం చనిపోయినా పర్లేదు. వీళ్ళందరూ గుర్తుంచు కుంటారు. మనం ఓ మంచి పనికోసం మరణ దేవత ఒడిలోకి వెళుతు న్నాం.అందుకని బాధపడకు"అంటూ పెద్దతన్ని ఓదారుస్తూ గాలోస్‌మీదకు వెళ్ళేప్పుడు అన్నాడట అప్పుడతని గొంతు వణికిందట, పెద్దతను ఏమీ మాటాడలేదట, గాలోస్ మీదకు ఎక్కిన తర్వాత కూడా చిన్నతను తనకి తను ధైర్యం చెప్పుకుంటున్నట్లుగా ఏమేమో మాట్లాడుతూనే వున్నాడట. మెడకు తాడు తగిలించేసరికి అతనికాళ్ళ వణుకు పెరిగిపోయిందిట. పెద్ద తనిలో మాత్రం అంతకుముందు కన్నా కూడా ఎక్కువ ధైర్యం కనిపిం చిందిట. ఈ విషయం నన్నెంతో ఆశ్చర్యపరిచింది" అన్నారు శ్రీ ఖురుదుకర్.

"వాళ్ళు చనిపోయిన తర్వాత వాళ్ళ కుటుంబాలకి ఆర్థికసాయాన్ని అందించడం కోసం నిధిని కలెక్ట్‌చేస్తూ ఓ యువతి నా దగ్గరకొస్తే నేనూ కొంత విరాళం ఇచ్చాను"అన్నారాయన గతాన్ని గుర్తుంతెచుకుంటూ.

# చీకటికి భయపడే హంతకుడు!

**1973** లో కర్నూల్ సెషన్స్ జడ్జి మర్డర్ చేసినందుకు ముద్దవరం బోయి రోషన్న అనే కజిన్స్‌కి మరణశిక్ష విధించారు. ఇద్దరూ దాదాపు నలభై సంవత్సరాల వయసున్న వాళ్ళు.

సెప్టెంబర్ 73లో వాళ్ళిద్దర్నీ సికింద్రాబాద్ జైలుకి తీసుకొచ్చారు. అప్పుడు సూపరింటెండెంట్‌గా ఖురుదుకర్‌గారు పనిచేస్తున్నారు.

కండెమ్డ్ సెల్‌లో ఉన్నన్నాళ్ళూ వాళ్ళెటువంటి ఇబ్బందినీ కలిగించ లేదని చెప్పారాయన. మవునంగా వుండేవారట. వాళ్ళని చూడడానికి చుట్టాలెవ్వరూ కూడా రాలేదట.

భగవత్ ప్రార్థన చేస్తూ కండెమ్డ్ సెల్స్‌లో వైరాగ్య జీవితాన్ని అనుభవించారట.

73 నవంబర్‌లో హైకోర్టు వాళ్ళ మరణశిక్షని ధృవపరిచింది. ఆ తర్వాత సుప్రీంకోర్టుకూడా వాళ్ళకి ఉరిశిక్షని ఖాయపరచింది. రాష్ట్రపతి క్షమాభిక్ష ప్రసాదించలేదు. 74 అక్టోబర్ 9వ తేదీ ఉదయం వారిద్దర్నీ ఉరితీసేసారు.

సామాన్యంగా కండెమ్డ్ సెల్స్‌లో ఉండేవాళ్ళు ఒంటరి తనాన్నే ఎక్కువగా కోరుకుంటారు. రాత్రి పూట తమ సెల్స్ దగ్గర లైట్లు వేసుంటే నిద్రపట్టడం లేదని అధికారులకు విన్నవించుకుంటూ వుంటారు ఖైదీలు.

కానీ అందుకు భిన్నంగా ప్రవర్తించారట బోయసోదరులు. ఒక రోజు వాళ్ళ సెల్ ఎదురుగా వున్న బల్బు మాడిపోయిందిట. పాపన్న ఆరోజు రాత్రి నిద్రపోలేదట.

మర్నాడుదయం సూపరింటెండెంట్ రౌండ్స్‌కి రాగానే సార్ రాత్రి ఇక్కడ బల్బు వెలగలేదు. మాడిపోయినట్లుంది. వెంటనే బల్బుని మార్పించండి" అని అడిగాడట.

అన్నాళ్ళనుండీ ఒక్కసారి కూడా తనకోసం ఏమీ అడగని అతను ఆరోజు అలా అడగడం ఖురదుకర్‌గార్ని చాలా ఆశ్చర్యపరచింది. అతని మనస్తత్వాన్ని మరింత విశదంగా తెలుసుకోవాలనిపించిదాయనకి.

"మామూలుగా లైటువున్నది కాబట్టి మాకు నిద్రపట్టలేదు. అంటుంటారు అందరూ. కానీ నువ్వు లైట్లు లేకపోవడంవల్ల నిద్రపట్టడం లేదంటున్నావేమిటి?" అని పాపన్నని ఆశ్చర్యంగా అడిగారు ఖురదుకర్ గారు.

"చీకటిని చూస్తుంటే చాలా భయంగా వుంటోందిసార్....అందుకని...." అంటూ నసిగాడట తను.

వెంటనే బల్బుని తెప్పించి పెట్టించారక్కడ.

కండెమ్డ్ సెల్‌లోవున్న అతను బయటికి ఎంత నిబ్బరంగావున్నా లోపల లోపల విపరీతంగా భయపడుతున్నాడని, చీకటి అతని భయాన్ని మరింతగా పెంచి చావు దగ్గరకి వచ్చేసినట్లు భ్రమపెడుతోందనే విషయం అర్థమైపోయి మళ్ళీ వాళ్ళకటువంటి అసౌకర్యం కలగకుండా వేయికళ్ళతో గమనించాగట సూపరింటెండెంట్.

ఉరితీసే రోజుకూడా వాళ్ళిద్దరూ ఎక్కువ ఏమీ భయపడలేదట. దైవప్రార్థన చేసుకుంటూనే తమకు విధించిన శిక్షకి తలవాల్చేశారట.

"ఏమండీ....మీరు ఎనిమిది మందికి దగ్గరుండి ఉరిశిక్షని అమలు పరచారు. వాళ్ళ మనస్తత్వాలని, అప్పటి ప్రవర్తనలని వివరించారు.... కానీ ఆ శిక్షలని అమలుపరిచేప్పుడు మీరు మానసికంగా ఎటువంటి వత్తిడుల్ని ఎదుర్కొనేవారు?" అని అడిగింది. స్వాతి ఖురదుకర్‌గార్ని.

"వ్యక్తిగతంగా నేను మరణశిక్షకి వ్యతిరేకిని. అయినా ఉద్యోగరీత్యా వాళ్ళ ఉరిశిక్షలని దగ్గరుండి జరిపించాల్సి వచ్చింది. ఉరిశిక్ష అమలు పరచాల్సిన వచ్చినప్పుడల్లా ఎంతో మానసిక క్షోభకి గురయ్యేవాడిని. అంతకు ముందురాత్రి అసలు నిద్రపట్టేదికాదు.

నాతోపాటు ఇంట్లోవాళ్ళుకూడా డిస్టర్బ్ అయ్యేవాళ్ళు. అందుకని ఉరిశిక్ష ముందురోజు రాత్రి ఇంట్లోపడుకునేవాడినికాను. జైలుగెస్టుహౌస్‌లో పడుకునేవాణ్ణి.

"ఇన్నాళ్ళనుండీ రోజూ కనిపించి, నమస్కారాలు చేసిన ఆ వ్యక్తుల ప్రాణాల్ని దగ్గరుండి తీయించబోతున్నాననే ఆలోచన మనసుని మెలిపెట్టేస్తుండేది. అందుకని ఆ బాధ భరించలేక ఆరాత్రి బాగాతాగేవాణ్ణి. ఈ శిక్షకి అతను తగును అని మనసుని సరిపెట్టుకోడానికి ఆ జడ్జిమెంట్ కాపీని రెండు మూడుసార్లు చదువుకునేవాణ్ణి.

ఆ కాపీలో అతను నేరాన్ని ఎంత భయంకరంగా చేసింది పూర్తి వివరాలతోపాటు వుంటుంది కాబట్టి అంత ఘోరం చేసినవాడు ఈ శిక్షకు అర్హుడేనని మనసుకి సర్ది చెప్పుకునేవాణ్ణి. మందు ప్రభావం వల్ల కొద్దిగా కునుకుపట్టేది. ఇంతలో అర్ధరాత్రి ఒంటిగంట అయేది. గార్డ్సువచ్చి లేపేవారు.

"అంతకుముందే అక్కడ తెచ్చిపెట్టుకున్న యూనిఫారమ్ వేసుకుని జైల్లోకి వెళ్ళేవాణ్ణి. రెండుగంటలకల్లా డాక్టర్, మేజిస్ట్రేట్ కూడా వచ్చేవాళ్ళు. ఆ తర్వాత జరగాల్సిన కార్యక్రమాలన్నింటినీ చాలాయాంత్రికంగా జరిపించేసేవాణ్ని. తెల్లవారిన తర్వాత కూడా ఆరోజు జైలుకి వెళ్ళాలనిపించేదికాదు.

"మధ్యాహ్నం ఎప్పుడో వెళ్ళేవాణ్ణి, అర్జంటుపనులు చూసుకోవడానికి. కొన్నిరోజులు, ఒక్కోసారి కొన్ని నెలలు పట్టేది. 'ఉరి' హాంగోవర్‌లోంచి బయట పడడానికి" అన్నారు ఖురుదుకర్‌గారు గతాన్ని నెమరు వేసుకుంటూ.

# వాళ్ళని కౌగలించుకో నివ్వరూ?

ఓ మర్డర్ కేసుతో వాళ్ళ ముగ్గురికీ మరణశిక్ష విధించారు. ముగ్గుర్నీ సికింద్రాబాద్ జైల్‌కి తరలించారు. ముగ్గురిలో ఇద్దరు అన్నదమ్ములు. మూడో అతను వాళ్ళ కజిన్.

సుప్రీంకోర్టు కూడా వాళ్ళ మరణ శిక్షని ఖాయపరచింది. దాంతో వాళ్ళకి చాలా వరకు ప్రాణంమీద ఆశ సన్నగిల్లింది. చివరి ప్రయత్నంగా

ముగ్గురూ రాష్ట్రపతి క్షమాభిక్ష కోరుతూ విన్నపాలు పెట్టుకున్నారు.

విచిత్రమేమిటంటే అన్నదమ్ములిద్దరికీ రాష్ట్రపతి క్షమాభిక్ష దొరికింది. కజిన్‌కి మాత్రం క్షమాభిక్ష దొరకలేదు.

అప్పుడున్న రాష్ట్రపతికి దైవభక్తి మెండుట. శనివారంనాడు మరణశిక్షని ఖాయపరుస్తూ ఆయన ఉత్తర్వులు జారీచేసేవారు కారట. ఆరోజు ఆయన గనుక ఏ ఫైల్‌ని చూస్తే వాళ్ళకి కమాభిక్ష గ్యారంటీట. అలా ఆ అన్నదమ్ములిద్దరూ మరణశిక్ష తప్పించుకున్నట్లు ఓ అధికారి చెప్పాడు. మూడోవ్యక్తి పిటీషన్ ఆ రోజు రాష్ట్రపతి చూడకపోవడంతో అతనికి క్షమాభిక్ష దొరకలేదట.

ఆ ఇద్దరూ ఎంత ఆనందపడ్డారో మూడోవ్యక్తి అంతగా కృంగిపోయాడట.

సూపరింటెండెంట్ రాజేందర్‌రావు గారితో "సార్" వాళ్ళిద్దరూ ప్రాణాలతో బయట పడడం నిజంగా నాకెంతో సంతోషంగా వుంది. నాకు వాళ్ళిద్దర్నీ ఒకసారి కౌగలించుకోవాలని వుంది" అని ఎంతో వినయంగా అడిగాడట.

వాళ్ళెంత బంధువులైనా, ఒకళ్ళు ఉరి నుంచి బయటపడి మరొకళ్ళు ఉరికి గురవుతుంటే మనసులో కోపం వుండవచ్చుగా. కాపలించుకున్నవాళ్ళని ఉరికి గురయ్యేమనిషి కెలసీతో ఏమైనా చేయవచ్చు.

పైగా అంతకుముందు క్షమాభిక్ష దొరకని వ్యక్తి "సార్.... నాకీ హత్యతో ఏమీ సంబంధంలేదు. నేను నిర్దోషిని. నన్ను అనవసంగా శిక్షిస్తున్నారు" అంటూ సూపరింటెండెంట్ దగ్గర ఎన్నోసార్లుఅన్నాడట.

దాంతో అతను మిగతావాళ్ళకి ఏమైనా హాని చేయవచ్చని భయపడి సూపరింటెండెంట్‌గారు అతని కోరికను తిరస్కరించారట.

"సార్....నేను ప్రాణాలు కోల్పోతున్నా, వాళ్ళు ప్రమాదంనుంచి బయటపడ్డారు. అందుకని నేను వాళ్ళని కౌగలించుకోవాలనుకుంటున్నాను. దయచేసి అవకాశం కల్పించండి" అంటూ అతనెన్నోసార్లు ప్రాధేయపడ్డా సూపరింటెండెంట్‌గారి మనసు కరగలేదు.

కజిన్స్‌ని కౌగలించుకోకుండానే అతను ఉరి రూపంలో వచ్చిన మృత్యువును కౌగలించుకుని పరలోకానికి వెళ్ళిపోయాడు.

# మరణశిక్ష ఎవరికి విధించాలి?

నమస్కారమండి సుబ్బారెడ్డిగారూ....
నమస్కారమండి....

ఉరిశిక్షమీద మీ అభిప్రాయాలని మా స్వాతి పాఠకులకు తెలియ జేయాలని వచ్చానండి....

మంచిదండి. అసలు ఉరిశిక్ష అనేకంటే మరణదండన, అంటే సబబుగా వుంటుందండి. మనిషి ప్రాణాన్ని తీయడానికి అనేక దేశాల్లో అనేక పద్ధతులు అవలంబించేవారు. కొన్ని పద్ధతులు ఇప్పటికీ ఆచరణలో వున్నాయి. ఉరిశిక్ష అంటే కేవలం మనిషిని ఒక త్రాడుతో వ్రేలాడదీసి ప్రాణాలు తీయడం అనే అర్థం ఇస్తుంది. కొన్ని దేశాలలో నేరస్థుల్ని తుపాకి పేల్చి చంపుతున్నారు. కొన్ని దేశాలలో గ్యాసు ఛాంబరులో బంధించి విషవాయువుని వదిలి ప్రాణాలు తీస్తున్నారు. మరి కొన్ని దేశాల్లో ఎలక్ట్రిక్ చైర్‌లో కూర్చోబెట్టి కరెంటు వదిలి ప్రాణాలు తీస్తున్నారు.

ఇంకా కొన్ని దేశాల్లో విషపూరితమైన ఇంజెక్షన్లు ఇచ్చి ప్రాణాలు తీస్తున్నారు. పూర్వ కాలంలో చాలా అమానుషంగా ఏనుగుల చేత తొక్కించేవారు. రాళ్ళతో కొట్టి ప్రాణాలు తీసేవారు. కొందరు రాజులు నేరస్థుల్ని సింహాలకి, మొసళ్ళకి ఆహారంగా పడేసేవారు. ఫ్రాన్స్ దేశంలో జోన్ ఆఫ్ ఆర్క్‌ని అగ్నిలో పడదోసి ప్రాణాలు తీసారు ఫ్రెంచి విప్లవకారుల్ని అనేకమందిని "గలిటోన్ యంత్రం ద్వారా స్వర్గానికి పంపారు. ఇలా మరణదండన విధించడానికి అనాది నుండి రకరకాల పద్ధతుల్ని అమలుపరుస్తున్నారు. ఇప్పుడు మనదేశంలో ఉరి ద్వారా మరణ శిక్షని అమలుపరుస్తున్నారు.

మరణశిక్షని నేరస్థులకు విధించడం ఎంతవరకూ సబబు అంటారు?

మరణదండన సామాన్య నేరస్థులకే కాదు కొన్ని సందర్భాలలో

రాజులకి విధించబడింది. ఇంగ్లాండ్‌లోని చార్లెస్ రాజుని ప్రజలు వురితీసి క్రాంవెల్‌కు పట్టం కట్టారు అలాగే ఫ్రాన్సులో కూడా ప్రజల ఆగ్రహానికి గురయిన లూయిస్ రాజు, అంటాయినెట్ రాణి కూడా "గిలిటోన్"కు ఆహుతి చేయబడ్డారు. ఇప్పుడు జైళ్ళలో విధించే మరణ దండనని సాధారణ ప్రజలు చూడడానికి అనుమతించరు గతంలో బహిరంగంగా వురితీసే వాళ్ళు. అంతకుముందు శిరచ్ఛేదం చేసేవాళ్ళు.

అసలు మనదేశంలో మరణదండనని ఏయే సందర్భాలలో విధిస్తున్నారండి?

భారతప్రభుత్వం మీద యుద్ధానికి సిద్ధం కావడం (121 సెక్షన్) భారత ప్రభుత్వంపై జరిగే తిరుగుబాటుని ప్రోత్సహించడం (132 సెక్షన్) తప్పుడు సాక్ష్యం ద్వారా ఓ అమాయకుడిని ఉరికంబం ఎక్కించడం (194 సెక్షన్), హత్య (302 సెక్షన్), చిన్నవాళ్ళని గాని (మైనర్లు), మతిస్థిమితంలేని వ్యక్తినిగాని, తాగిన మైకంలో వున్న వ్యక్తిగాని ఆత్మహత్య చేసుకోవడానికి ప్రోత్సహించడం (305 సెక్షన్), యావజ్జీవ కారాగార శిక్ష అనుభవిస్తున్న ఖైదీ హత్యా ప్రయత్నించడం (307 సెక్షన్) దోపిడీ సందర్భంగా హత్య చేయడం (396 సెక్షన్) ఈ పరిస్థితుల్లో ఆ నేరస్థులకి ఉరిశిక్ష విధించవచ్చు.

భారతదేశంలో 1961 సంవత్సరం మొదలు 1969సం. మధ్య 1965 మంది పురుషులకు, 24 మంది స్త్రీలకు మరణశిక్ష విధించబడింది. 1965మంది పురుషులలోనూ కేవలం 268 మంది పురుషులు మాత్రమే ఉరికంబం ఎక్కారు స్త్రీలలో ఒక్కరినీ ఈ కాలంలో ఉరి తీయలేదు. ఒక నేరాన్ని ఓ స్త్రీ, పురుషుడు కలిపి చేస్తే పురుషుడికే అధిక శిక్ష విధింపబడుతోంది.

మనదేశంలో వురిశిక్ష విధించిన తర్వాత దాన్ని హైకోర్టు ఖాయపరచవలసి వుంటుంది. హైకోర్టు ఖాయపరచిన తర్వాత నేరస్థుడు సుప్రీంకోర్టుకి అప్పీలు చేసుకోవచ్చు. అక్కడ కూడా ఖాయమైతే గవర్నరుని, రాష్ట్రపతిని క్షమాభిక్షకోసం అభ్యర్థించవచ్చు. గవర్నరు, రాష్ట్రపతి క్షమాభిక్షవల్ల వురి నుంచి బయటపడ్డ వారెందరో మనకి లక్ష్యమైన

లెక్కల ప్రకారం వందమంది నేరస్థులలో ఇరవై అయిదు మందిమాత్రమే పట్టుబడుతున్నారు పట్టుబడ్డ ఇరవై అయిదుమందిలోనూ 94.5% నిర్దోషులుగా విడుదలవుతున్నారు. అంటే 5.5% మాత్రమే శిక్షింపబడు తున్నారన్నమాట.

నేరాల సంఖ్యతోపోలిస్తే శిక్షింపబడేవారు 1.4% మాత్రమే. అందులోనో ఎంతమంది క్షమాభిక్షకి కూడా నోచుకోకుండా వురి శిక్షకి గురవుతున్నారు? శిక్షకి గురవుతున్న ఆ అతికొద్ది శాతం గురించే మనం అతిగా ఆలోచిస్తున్నాంగాని శిక్షని తప్పించుకున్న 99% గురించి మనం ఎంతవరకూ ఆలోచిస్తున్నాం? మనం మానవతా ధోరణిలో నేరస్థుడ్ని క్షమించినప్పుడు అతనిలో మానవతా దృక్పధం లోపిస్తే సంఘానికి ఎటు వంటి అపాయం కలుగుతుంది? వ్యక్తి శ్రేయస్సు ముఖ్యమా? సంఘ శ్రేయస్సు ముఖ్యమా? అసలు వీళ్ళు ఇలా నేరస్థులుగా మారడానికి ఏయే పరిస్థితులు కారణం? వాటిని సంస్కరించకపోతే నేరస్థుల సంస్కరణ ఎలా జరుగుతుంది? ఇలా ఎన్నో విషయాల్ని మనం క్షుణ్ణంగా ఆలో చించాలి.

కొందరు ఉరిశిక్షలు అవసరమంటే మరి కొందరు అనవసర మంటారు. హత్యలు చేయాలనే సంకల్పం వున్నవాళ్ళకి హెచ్చరికగా వుంటుందని, చనిపోయిన వ్యక్తి తాలూకు బంధువులు రెచ్చిపోకుండా అవుతుందని, ప్రమాదకరమైన నేరస్థుల్ని విడిచిపెడితే వాళ్ళు మళ్ళీ హత్యలు చేయవచ్చు. కాబట్టి వాళ్ళని అంతమొందించడానికి, దోపిడి, స్త్రీ మానభంగ, భ్రూణహత్య, హైజాకింగ్ టెర్రరిజమ్ లాంటి నేరాల్ని అరికట్టడానికి ఉరిశిక్ష తోడ్పడుతుందని కొందరు అభిప్రాయపడితే శిక్ష పూర్తయిన తర్వాత అతను అమాయకుడని తెలిస్తే ఏమీచేయలేము. మరణదండన అనేది అతి క్రూరమైనది. ప్రతీకార ధోరణిని పెంచు తుంది. కాని నేరస్థులలో పరివర్తన తీసుకురావడానికి వుపకరించదు. వురి శిక్ష అమలులేని దేశాలలో హత్యల సంఖ్య యెక్కువగా ఎక్కడుంది. ప్రాణం ఇచ్చే శక్తి లేనప్పుడు ప్రాణం తీసేహక్కు మనిషికెక్కడుంది

అని మరణశిక్షకి వ్యతిరేకంగా వాదించేవారు మరికొందరు.

ఇంతకీ మరణశిక్ష అవసరమా? కాదా? మీరే ఆలోచించండి.

మానభంగం, శిశుహత్యచేసిన బిల్లా-రంగాలకి శిక్ష విధించాలి? మూఢభక్తితో హత్యలు, శిశుహత్యలు కావించిన రామన్ రాఘవన్ ఏ శిక్షకు అర్హుడు? నగర శివార్లలో దోపిడీకోసం అర్ధరాత్రి ఇళ్ళపైబడి అమానుషంగా ప్రాణాలు తీసే డెకాయిట్స్‌కి ఏ శిక్ష సరయినది? టెర్రరిజం, హైజాకింగ్‌లతో హడలెత్తిస్తున్న వాళ్ళని ఏమిచేయాలి? దేశద్రోహానికే శిక్ష?

మరణశిక్షను పూర్తిగా మానివేయడమా? లేక మరణశిక్షను కొన్ని అసాధారణ పరిస్థితులలో అమలుచేయడమా? విద్వేతలు ప్రజలు.... నిర్ణేతలు నిపుణులు.... అంటూ తమ అభిప్రాయాన్ని వెల్లడించారు అనుభవజ్ఞులైన శ్రీ ఎమ్. వి. సుబ్బారెడ్డిగారు.

# మరణశిక్ష అమానుషం!

ఫిలిప్స్‌గారూ! జైలు సూపరింటెండెంట్‌గా మీరు పనిచేస్తున్నారు కదా! అసలు ఈ మరణశిక్షని పూర్తిగా రద్దుచేయాలని మీ అభిప్రాయం అన్నారు! ఎందుకో వివరిస్తారా?

మరణశిక్షని విధించడంవల్ల నేరాల్ని అరికట్టలేమండి. 200 సంవత్సరాల క్రితం అన్ని తప్పులకూ మరణశిక్షని విధించేవాడు. 150 సంవత్సరాల క్రితం దొంగతనాలు చేస్తే మరణశిక్ష వేసేవారు ఎందరో ప్రజల సమక్షంలో. అలా ఓ జేబు దొంగని వురితీస్తుంటే గుమికూడిన జనంలో ముగ్గురి జేబుల్ని ఎవరో కొట్టేసారు. అంటే మరణశిక్షవల్ల భయంతో

నేరాలు తగ్గవు అని రుజువైంది. మరణశిక్ష తీసివేయడంవల్ల నేరాలు పెరిగాయనడానికి ఎక్కడా ఆధారాలులేవు. ట్రివాన్‌కూర్- కొచ్చిన్‌లో 1944 లో మరణశిక్షని రద్దుచేసి 1951లో తిరిగి ప్రవేశ పెట్టారు. ఈ 6 సంవత్సరాలలో (1945 50) 962 ఖూనీలు జరిగితే, మరణశిక్ష ప్రవేశపెట్టిన తర్వాత 6 సంవత్సరాలలో (1951- 56) 967 ఖూనీలు జరిగాయి. శ్రీలంక, కెనడియన్ రిపోర్టులలో కూడా మరణ శిక్షవల్ల నేరాలు తగ్గుతాయని లేదు.

మరణశిక్ష విధించిన నేరస్థులను కూడా సంస్కరించ వచ్చంటారా?

నా సర్వీసులో మరణశిక్షనుండి యావజ్జీవశిక్షగా మార్చబడిన ఖైదీలెందర్నో చూసాను. వాళ్ళందరూ ఎంతో సత్ప్రవర్తనతో వుండేవారు. ఎటువంటి ఇబ్బందులల్ని కలించలేదు. పూర్తిగా సంస్కరించబడ్డారు. వాళ్ళలో ఎవ్వరూ ఏ నేరముతోనూ తిరిగి జైలుకిరాలేదు. అందుకే నేను ఖచ్చితంగా చెప్పగల్గుతున్నాను. మరణశిక్షకు గురికాబడుతున్న వాళ్ళని కూడా సంస్కరించవచ్చని!

ఎన్నో పాపాలుచేసిన వాల్మీకి మహర్షిగా మారలేదా? ఎంతమంది డెకాయిట్స్ తమ ప్రవర్తనలో మార్పు తెచ్చుకోలేదూ? తప్పుచెయ్యడం మానవసహజం. తన తప్పుని తెలుసుకున్న తర్వాత అతను నడవడికను మార్చుకుంటాడు ముందు అతని తప్పు అతను తెలుసుకోవడానికి మనం అవకాశం ఇవ్వాలి. మనిషి తప్పుచేసే పరిస్థితుల్ని ఈసంఘం కల్పిస్తోందే కాని ఆ తప్పుల్ని తెలుసుకుని సరిదిద్దుకునే అవకాశం ఇవ్వడం లేదు. అందుకనే ఈ మరణశిక్షని పూర్తిగా రద్దుచేయాలని నా అభిప్రాయం. ఎవ్వరూ నేరమనస్తత్వంతో పుట్టరు. సరయిన ప్రేమ, అభిమానం, మార్గదర్శకత్వం చూపిస్తే ఏ నేరస్థుడిలో అయినా మార్పు వస్తుంది. మరణశిక్షని రద్దు చెయ్యడమంటే ద్వేషం మీద ప్రేమ విజయం సాధించడమన్నమాట!

మరణశిక్ష అమలు జరపడంలో కూడా తేడాలుండవచ్చు అంటారా?

ఒక్కోసారి సరయిన ఆధారాలు దొరకకపోవడంవల్ల కూడా నేరస్థుడు పెద్దశిక్షను అనుభవించాల్సి వస్తుంది. చాలా కేసులని విజయలక్ష్మి

వరించడానికి కారణం న్యాయం అటువేపే వుండికాదు, నేర్పరి అయిన న్యాయవాది అటువుండి వాదించడం వల్ల: ఒక్కోసారి ఒకేవిధమైన నేరాలు చేసిన ఇద్దరికి వేరువేరు శిక్షలు పడవచ్చు.

ఉరితీసేసిన తర్వాత అతను నిర్దోషి అని బయటపడిన సంఘటనలూ చరిత్రలో వున్నాయి. ఇలా ఓ నిర్దోషిని ఉరి తీసినందుకు 1965లో ఇంగ్లండ్ రాణి ప్రజలకి క్షమాపణలు చెప్పుకుంది. క్షమాపణలు చెప్పుకున్నంత మాత్రాన అతని ప్రాణం తిరిగిరాదు కదా! అదేమరోశిక్ష అయితే ఆ నిర్దోషిని విడిచిపెట్టడానికి అవకాశముండేది. పదిమంది నేరస్థులు శిక్షని తప్పించుకున్నావర్లేదుకాని ఒక్క అమాయకుడు శిక్షింప బడగూడదు: ఆ తర్వాత మరణశిక్ష విధించినవారికి క్షమాభిక్ష పెట్టడానికి సరయిన గైడ్ లైన్ ఏమీలేదు. ధనము, పలుకుబడి వున్నవాళ్ళకే ఈ పద్ధతి ఎక్కువ అనుకూలం.

తన తరపున క్షమాభిక్షకి ప్రయత్నించడానికి ఎవ్వరూలేని, డబ్బు సాయంతో న్యాయవాదుల్ని పెట్టుకున శిక్షని తప్పించుకోడానికి ప్రయత్నించలేనివాళ్ళు మాత్రమే ఉరిశిక్షకు గురవుతున్నారు 1961లో రాజ్యసభలోని ఓ చర్చలో ఓ సభ్యుడు "143మంది మరణశిక్ష విధించిన ఖైదీలను నేను పలకరిస్తే వాళ్ళలో 93మంది షెడ్యూల్డ్‌కాస్ట్, షెడ్యూల్డ్‌ట్రైబ్‌కి చెందినవారే తారసపడ్డారు. బీదవాళ్ళు కావడంవల్లే వాళ్ళు ఈ శిక్షను తప్పించుకోలేకపోయారు. అదే డబ్బుంటే మంచి న్యాయవాదుల సాయంతో తప్పకుండా ఉరినుండి బయటపడేవారు" అన్నాడు.

"మనకి రాజ్యాంగం ఎన్నో హక్కుల్ని కల్పించింది. మరణశిక్ష విధించడం అమానుషం. ఒకరిని చంపాడంటూ మరొకర్ని చంపడంలో అర్థమేముంది? కల్తీ పదార్థలని, మందులని అమ్మే ఎంతోమంది వ్యాపారస్థులు మరి వాళ్ళకు మరణశిక్ష వెయ్యడంలేదేం? ఖూనీచేసి శిక్ష పొందిన వాళ్ళలో ఎక్కువమంది అది మొదటి నేరమే: వాళ్ళది నేర ప్రవృత్తి కాదు- పరిస్థితుల కారణాన అలాచేసారు. కాబట్టి మరణ శిక్షని పూర్తిగా తొలగించాలి. అందువల్ల నేరాల సంఖ్య ఏమీ పెరగదు" అన్నారాయన.

# నా పెద్ద కొడుకుచేతనే తలకొరివి పెట్టించండి!

ఇది రెండున్నర దశాబ్దాల క్రితం జరిగిన సంఘటన.

అతని వయసు యాభై రెండేళ్ళు. వాళ్ళది రాయలసీమలోని ఓ గ్రామం. అక్కడ అతనికి చాలా పొలముంది వ్యవసాయమే వృత్తి. పెద్ద పిల్లలుకూడా తండ్రికి వ్యవసాయంలోనే తోడ్పడుతున్నారు.

అతని పొలంలో ఒకచోట ప్రక్క పొలంవాడు ఆక్రమించాడు. దానితో సుబ్బారెడ్డికి ప్రక్కపొలం ఆసామికి మధ్య గొడవ ప్రారంభ మైంది. చినుకు చినుకు గాలివానయినట్లు గొడవ పెరిగి ఆవేశంలో సుబ్బా రెడ్డి తన పొలంలోకి గట్టుని జరిపి దురాక్రమణ చేసిన ఆసామిని చంపే సాడు.

సుబ్బారెడ్డికి ఉరిశిక్షపడింది సికింద్రాబాద్ జైల్‌కి తరలించారు. అప్పుడు ఎ.ఎన్. రాజేందర్‌రావుగారు సూపరింటెండెంట్‌గా వున్నారు.

రాష్ట్రపతినుంచి ఉరిశిక్షని ఖాయపరుస్తూ ఉత్తరం రాగానే సుబ్బా రెడ్డిని ఉరితీసేయబోతున్నట్లు తెలియజేస్తూ రాదల్చుకుంటే వచ్చి ఆఖరి సారిగా అతడిని కలుసుకోవచ్చని అతనింటికి తెలియజేసారు జైలు అధి కారులు.

సుబ్బారెడ్డి పెద్దకొడుకు ముప్పై సంవత్సరాలవాడు, చిన్నకొడుకు అతనికన్నా కొద్దిగా చిన్నవాడు చూడడానికి వచ్చారట.

వాళ్ళతో తల్లి రాలేదు. చిన్న పిల్లలు రాలేదు. మిగతా చుట్టాలె వ్వరూ రాలేదు.

కొడుకులు కాసేపు తండ్రితో మాట్లాడి వెళ్ళిపోతుంటే సూపరిం టెండెంట్‌గారు పిలిపించారు.

"ఉరి తీయడం అయిపోగానే మీ తండ్రి శరీరాన్ని మీరు తీసుకు పోతారా?"కొడుకుల్ని అడిగారు సూపరింటెండెంట్ గారు.

"ఆ శవాన్ని మేమేమి చేసుకుంటాంసార్....మీరే ఏదో ఒకటి చేసేయండి, మేము మా వూరు వెళ్ళిపోతున్నాం"నిర్లక్ష్యంగా పెద్దకొడుకు చెప్పిన జవాబు రాజేందర్ రావుగార్ని కలిచివేసింది.

ఆ కొడుకుల కోసమే అతను పైసాపైసా కూడబెట్టాడు. వాళ్ళకి చెందాల్సిందే మరెవరికో చెందుతోందన్న కోపంతోనే అతను మర్డర్ చేసి జైలుకొచ్చాడు. ఉరికి గురి కాబోతున్నాడు! అటువంటి ఈ అభాగ్యుడి శవాన్ని తీసుకెళ్ళి అంత్యక్రియలు జరపడానికి కూడా ఆ కొడుకులు నిరాకరించడం తననే ఇంత బాధ పెడుతుంటే ఆ తండ్రికి ఈ విషయం తెలుస్తే ఇంకెంత బాధపడతాడో ఆఖరురోజుల్లో అతన్ని బాధపెట్టడం ఎందుకని, అతనికీ విషయం చెప్పను కూడా చెప్పలేదట.

పాపం ఆ అభాగ్యుడు ఉరిశిక్ష తీసుకోబోయేముందు సూపరింటెండెంట్ గారితో "సార్-తండ్రికి పెద్దకొడుకే తలకి కొరివి పెట్టాలి. అది మన హిందూధర్మం నన్ను ఉరి తీసేసిన తర్వాత నా శవాన్ని దహనం చేసేప్పుడు నా పెద్దకొడుకుతోనే తలకి కొరివి పెట్టించడం‌ని కన్నీళ్ళు పెట్టుకున్నాడట.

కొడుకుల మనస్తత్వం తెలిసిన సూపరింటెండెంట్ రాజేందర్ రావు గారు ఏమీ మాట్లాడలేకపోయారు.

ఆ తర్వాత మేజిస్ట్రేట్ కి తన భూములన్నింటినీ కొడుకులందరికీ సమంగా పంచుతూ విల్ చెప్పాడట ఆ తండ్రి.

మళ్ళీ సూపరింటెండెంట్ గారికి తన కోరికని విన్నవించుకున్నాడట.

"మీవాడు వెళ్ళిపోలేదు. ఇక్కడే వున్నాడులే....అతడిని పిలిపించి అతడితోనే నీ శవానికి తలకొరిని పెట్టిస్తాను"అని ఓ తప్పుడు ప్రామిస్ ని ఇస్తేగాని అతను కుదుటపడలేదు.

ఉరి తీసేసిన తర్వాత ఆ అభాగ్యుడి శవానికి అంత్యక్రియలు జైలు అధికారులే చేసారు. అతను ఆస్తిని పంపకాలుచేస్తూ రాయించిన విల్‌ని ఇంటికి పంపారు.

"ముప్పైఅయిదు సంవత్సరాలు దాటిన తర్వాత ఉరితీయబడ్డ ఖైదీలందరిలోనూ ఓ విధమైన నిర్లిప్తత కనిపించేది. చావు దగ్గర పడు తున్న కొద్దీ వాళ్ళలో ఆ నిర్లిప్తత పెరిగిపోతుండేది. తిండి, నిద్ర, బంధుత్వం మొదలయిన వేవీ వాళ్ళ మనసులకి అంతగా పట్టి పీడించేవి కావు. ధైర్యంగానే చావుని ఎదుర్కొన్నారు. కానీ చిన్నవాళ్ళని ఉరితీస్తే వాళ్ళకి చాలా చాపల్యాలు తగ్గవు కాబట్టి రకరకాలుగా బాధపడతారు" అన్నారు రాజేంద్రర్ రావుగారు.

# ఉరి తీస్తున్నా చావని జిహ్వా చాపల్యం

అతని వయసు పాతిక సంవత్సరాలుంటాయి అంతే। లంబాడీ యువకుడు.... రేప్, మర్డర్ చేస్తే ఉరిశిక్ష విధించారు.

సికింద్రాబాద్ జైల్లోనే అతడిని ఉరి తీసారు. కండెమ్డ్ ప్రిజనర్‌గా అతడు జైల్లో వున్నంతకాలం అతడిని చూడడానికీ ఎవ్వరూ రాలేదట.

సాధారణంగా కండెమ్డ్ ప్రిజనర్స్ కంటిముందు చావుని చూస్తూ తిండి, నిద్ర లేకుండా శిక్ష అమలు జరిపేంతవరకూ ఎంతో నరకాన్ని అనుభవిస్తారు.

"నీ శిక్షని ఖాయపరుస్తూ రాష్ట్రపతిగారి దగ్గరనుండి ఉత్తరువు

వచ్చింది రెండు రోజుల్లో అమలు పరుస్తాం. నీకేమైనా ప్రత్యేకంగా తినా లనివుంటే చెప్పు...."అని అప్పటి సూపరింటెండెంట్ రాజేందర్ రావు గారు అతడిని అడగ్గానే—

"సార్.... ఇప్పుడే దొరికే పళ్ళన్నింటినీ రకానికి ఒకటి చొప్పున నాకు తెప్పించి పెట్టండి"అని ఆశగా అతను అడిగాడు.

సాధారణంగా ఉరిశిక్ష విధించిన ఖైదీలకు బయటనుంచీ వచ్చే ఆహార పదార్థాలనిగానీ పళ్ళనిగానీ పెటినీ పెట్టనివ్వరు కానీ ఆ అమాయ కపు యువకుడి కోరికని కాదనాలనిపించలేదట ఆయనకి వెంటనే ఓ వార్డ ర్ని పిలిపించి బజారులో దొరికే పళ్ళన్నింటినీ రకానికి ఒకటి చొప్పున తీసుకురమ్మని పంపారు. తర్వాత ఆ పళ్ళని పరీక్షించి ఉరికి గురికాబో తున్న ఆ కుర్రాడి దగ్గరకి పంపారట.

తిలాలనే యావతో అడిగాడు కాని అతను వాటన్నింటినీ తినలేక పోయాడట కొన్నింటిని మాత్రమే తిని మిగతా వాటన్నింటినీ అలాగే వదిలేసాడట.

మళ్ళీ చూడటానికి వచ్చిన సూపరింటెండెంట్ గారిని"చాపల పులుసు తినాలనుందని అడిగాడట.

అతని విచిత్ర ప్రవర్తన ఆశ్చర్యం వేసిన ఆయన దానినీ తెప్పిం చారట. ఈసారీ అతను కొద్దిగా రుచిచూసే వదిలేసాడట.

అంతటితో వూరుకోకుండా సూపరింటెండెంట్ గారిని "ఓ బీడీ వుంటే ఇవ్వండి"అని అడిగాడట.

"నేను తాగనుకదా నా దగ్గరలేవు...."అని ఆయన జవాబు చెపు తుండగానే ప్రక్కనున్న జైలర్ ఏమిటా కోరికలు"అంటూ అతడిని కసి రేసాడట.

రాజేందర్ రావుగారికి జాలేసింది.

"ప్రాణాలు పోతున్నవాడు కోరిన ఆ చిన్న కోరికని మనమెం దుకు కాదనాలి స్టోర్స్ లోంచి తెప్పించి ఇవ్వండి" అన్నారట.

తర్వాత బిర్యానీ తినాలనుందని అడిగి కొద్దిగా తిన్నాడట.

ఉరి తీయడానికి కొన్ని గంటలముందు కూడా అతను డబల్ రోటీ, టీ కావాలని కోరాడట.

వాటినీ తెప్పించి ఇచ్చారు.

"సగం రొట్టిని తిని సగం టీ మాత్రమే తాగగలిగాడతను...." అన్నాడప్పటి సంఘటనలని గుర్తు తెచ్చుకుంటూ రాజేందర్ రావుగారు.

"ఆ తర్వాత అతని తిండికి అంత ఖర్చు ఎందుకు పెట్టావ్, ఎలా పెట్టావ్ అని హెడ్ ఆఫీస్ నన్ను ప్రశ్నించింది దానికి నేను జవాబిచ్చాను చనిపోబోతూ అతను కోరిన ఆ చిన్న కోరికలని అవీ తిండి గురించి కాదనడం భావ్యంగా అనిపించలేదు. అందుకనే తెప్పించాను. అతడి సెల్‌కి పంపేముందు వాటన్నింటినీ పరీక్షించే పంపాను అని సర్ది చెప్పుకున్నాను. నేను ఎంతోమందిని దగ్గరుండి ఉరి తీయించాను కానీ ఇతని మాదిరి చావబోతూకూడా ఏవేవో తినాలనిపించే వాళ్ళని మాత్రం నేను చూడలేదు. కేవలం చిన్నవయసు కావడంవల్లనే ఇతనికి ఇటువంటి కోరికలు పుట్టాయనిపించింది. నాకు ఉరికి గురయ్యే వ్యక్తుల ప్రవర్తన వాళ్ళ వయసు, కుటుంబ సంస్కారం, ఆర్థిక పరిస్థితులనిబట్టి మారుతుందని నా అనుభవం చెబుతోంది" అంటారు రాజేందర్ రావుగారు.

— సమాప్తం —